*istory of the Rachakonda Kingdoms*

# రాచకొండ చరిత్రము

(1326 – 1482 A D)

తేరాల సత్యనారాయణశర్మ

విజయభారతి నిలయం
నల్లగొండ

# అధోజ్ఞాపికా సంకేతములు

| | |
|---|---|
| A. R E. | Archaeological Reports of Epigraphy |
| A. R H. S | Archaeological Reports of the Hyderabad State |
| A S. P P Vol | Andhra Sahitya Parishat patrika volume |
| A. P G. R. E | Andhra Pradesh Govt. Reports of Epegraphy |
| E. C | Epigraphia carnatica |
| E. I | Epigraphia Indica |
| H A S. | Hyderabad Archaeological Series |
| H. A. R. | Hyderabad Archaeological Reports |
| I. A | Indian Antiquary |
| I. T D. N D | A corpus of Inscriptions in the Telengana districts of H. E. S. the Nizam's Dominions |
| I. T D. H. | Inscriptions in the Telangana districts of the Hyderabad State. |
| L R. | Local Records |
| M. E R. | Madras Epigraphical Reports |
| Mac Mss | Mackenzie Manuscripts. |
| M G Ori Mss Lib. | Madras Govt Oriental Manuscripts Library |
| S I I. | South Indian Inscriptions |
| T T D. Ins. | Tirumala Tirupathi Devasthanam Inscriptions |
| V V C, వె వం.చ. | =వెలుగోటి వంశచరిత్ర |
| V V, వె. వం. | = వెలుగోటి వంశావళి |
| కా. స. | కాకతీయ సంచిక |
| రె. సం. | రెడ్డి సంచిక |
| తె. శా. | తెలంగాణా శాసనపు సంపుటములు I & II |

అను=అనుబంధము, పు=పుట

# రాజ్యకాలములు

| | | | |
|---|---|---|---|
| 1. | బేతాళనాయుడు | క్రీ. శ | 1225–1262 |
| 2. | దామా – ప్రసాదిత్య – రుద్రానాయుడు | ,, | 1235–1265 |
| 3. | వెన్నమ – సబ్బినాయుడు | ,, | 1265–1295 |
| 4. | ఎఱదాచనేని – నలదాచానేని | , | 1295–1326 |
| 5. | I సింగమనేని | ,, | 1326–1361 |
| 6. | I అనపోతానేడు | ,, | 1361–1384 |
| 7. | II సింగభూపాలుడు | ,, | 1384–1400 |
| 8. | II అనపోతానేడు | ,, | 1400–1425 |
| | రావు మాదానేడు (II అనపోతానేని సోదరుడు) | ,, | 1420–1430 |
| 9. | III సర్వజ్ఞ రావుసింగభూపాలుడు | ,, | 1425–1475 |
| | లింగమనేడు | ,, | 1420–1482 |

# రాచకొండ భూపతుల వంశవృక్షము

1. బేతాళనాయుడు

ప్రసాదిత్యానాయుడు

రుద్రానాయుడు

2. దామానాయుడు

వల్లినాయుడు

3. వెన్నమ నాయుడు

నలదావానేని

4. ఎఱదాచానేని

5. I సింగమనేడు వెన్నమనేడు

ఏచమనేడు

మాదానేని దామానేడు

6 I అనపోతానేడు

మాదానేడు (దేవరకొండరాజ్యము)

నాగానాయుడు

7. II సింగభూపాలుడు, ధర్మానేడు

పెద వేదగిరినేని

8. II అనపోతానేడు, దాచానేడు, వల్లభనేడు, వేదగిరినాయుడు, దామానేడు, రావు మాదానేడు

రామచంద్రానేడు

II కుమార మాదానేడు

9. III సర్వజ్ఞరావు సింగభూపాలుడు

వసంతానేడు

కేశవనాయుడు

రావు ధర్మానేడు

సూరానాయుడు

కుమార వేద గిరి నాయుడు

లింగమనేడు

పర్వతనాయుడు

కుమార లింగమనేడు

# కొన్ని చారిత్రక సంఘటనలు - వాటి కాలములు

| జీవితకాలము | పేరు | సంఘటనలు | క్రీ.శ. | వయస్సు | మొ.ఆ. |
|---|---|---|---|---|---|
| 1296-1361 A D | I సింగన | కంచి యుద్ధము | 1316 | 20 | |
| | | కుమ్మట పోరాటము | 1320 | 25 | |
| | | జల్లిపల్లి పోరాటము | 1361 | 65 | 65 |
| 1321-1384 A D | I అనపోతానేడు | జల్లిపల్లి పోరాటము | 1361 | 40 | |
| | | రాచకొండ దుర్గప్రతిష్ఠ | 1365 | 44 | |
| | | ఆయినవోలు శాసనము | 1367 | 46 | |
| | | ధరణికోట యుద్ధము | 1377 | 56 | |
| | | భువనగిరి శాసనము | 13[illegible]0 | 6[illegible] | |
| | | సింహాచల శాసనములు | 1380 | 59 | |
| | | తుదికాలము | 1384 | 63 | 63 |
| 1350-1405 A D | II సింగభూపాలుడు | కొత్తకొండ యుద్ధము | 1384 | 34 | |
| | | సింహాచల శాసనములు | 1387 | 37 | |
| | | పానుగంటి పోరాట ప్రారంభము | 1397 | 47 | |
| | | పానుగంటి పోరాట సమాప్తము | 1399 | 49 | |
| | | తుదికాలము | 1405 | 55 | 55 |
| 1375-1425 A.D | II అనపోతానేడు | మెదకు యుద్ధము | 1404 | 29 | |
| | | పానుగల్లు పోరాట ప్రారంభము | 1417 | 42 | |
| | | పానుగల్లు పోరాట సమాప్తము | 1419 | 44 | |
| | | కొండవీటిపై | 1420 | 45 | |
| | | ఓయుగంటి పోరాటము | 1425 | 50 | 50 |
| 1405-1475 A D | III సర్వజ్ఞరావు సింగమాపాలుడు | యువరాజత్వము | 1425 | 20 | |
| | | కంజీవర శాసనము | 1437 | 32 | |
| | | బెల్లంకొండ శాసనము | 1453 | 48 | |
| | | శాయింపేట శాసనము | 1464 | 59 | |
| | | తిరుపతి శాసనములు | 1475 | 70 | 70 |

**గమనిక ·** II అనపోతానేని సోదరుడైన రావుమాదానేని శాసనములు 1421 నుండి 1429 వరకు గలవు.

## విషయానుక్రమణిక

## పీఠిక

చరిత్ర పరిశోధకులందరికి తెలంగాణా యొక బంగారుగనివంటిదని కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు ఒకప్పుడన్న మాటలు మన వాఙ్మయేతిహాసిక చరిత్రలను చదువుచుండు వారందరికి ఒక్కొక్కప్పుడు గుర్తుకురాక తప్పదు

ప్రాచీనకాలమునుండియు యిటీవల వరకు గడచిన తెలంగాణా ప్రాంతపు చారిత్రక విశేషాలను తెలుసుకోవాలన్నపుడు ఈ ప్రాంతాన్ని పాదుగాజేసుకొని పూర్వమిక్కడ వర్ధిల్లిన శాతవాహన, చాళుక్య, కాకతీయులవంటి ప్రసిద్ధ రాజరిక వంశములు, బౌద్ధ, జైన, వీరశైవములవంటి పెక్కుమతములు, అనేక శిల్పకళాఖండములు స్మృతిపథంలో ఒకసారి మెఱుపువలె గుర్తుకురాక తప్పదు

ఆంధ్రంలో రాజకీయంగానేమి, భౌగోళికంగానేమి, భాషా సంస్కృతుల పరంగానేమి తెలుగుజాతికి జాతియే యేకమై ఒకటిగా నిలచినది తుదివారైన కాకతీయ మహాచక్రవర్తుల కాలంలో. ఆ సామ్రాజ్యం అంతరించటంతో వారి శిక్షణలోనే పుట్టి పెరిగిన తెలుగు నాయకులు కొందరు స్వతంత్ర రాజ్యముల నేర్పాటు గావించుకొని తెలుగుజాతికి గలుగు మహోపద్రవాన్ని కొంతవరకు నిరోధించారు.

ఈ తెలుగు రాజ్యములలో విస్తీర్ణంలోనేమి, పరిపాలనలోనేమి విజయనగరం – కొండవీడు రాజ్యాల తరువాత వాటికి ప్రవేశ ద్వారంవలెనున్న రాచకొండ పెద్ద భూభాగంగా కనపడుతుంది. కాకతీయుల తరువాత కాలంలో సుమారు ఒకటిన్నర శతాబ్దముల పాటు పద్మనాయకులైన వెలమ ప్రభువులు రాచకొండ ప్రదేశాన్ని రాజధాని గావించుకొని దేశవిఖ్యాతమగునట్లు పరిపాలించారు.

వాఙ్మయపరంగానే దీని చరిత్ర గైకొన్న రామాయణ మహాభాగవతములవంటి ఉద్గ్రంథములు ఈ రాజ్యకాలములో, ఈ

ఆస్థానమునుండియే వెలువడియున్న ప్రఖ్యాతి నార్జించుకొనుచున్నది మల్లినాధసూరివంటి వ్యాఖ్యాన పండితులు నివసించి, సింగభూపాలునివంటి విద్వత్తంసులు ఈ రాజ్యమును పరిపాలించినవారగుటచే, తెలుగులో తొలిసారిగా ప్రముఖ కావ్యములెన్నో యిక్కడినుండియే అవతరించుటచే రాజకీయముగనే గాక భాషా వాఙ్మయముల పరముగను దీనికెంతో విశిష్టస్థానము గలుగుచున్నది. కాని ఈ చరిత్రలన్నియు పరిశోధిత వ్యాప్తములుగాక తగిన పేరు ఇప్పటివరకు బడసియుండలేదు.

ప్రస్తుత సందర్భములో చారిత్రకముగా తగిన అనుభవము లేవీ లేకపోయినా ఈ గ్రంథమిట్లు సిద్ధముజేయుటలో నాకు కవి జీవితచరిత్రములందుగల అభిమానము నన్ను మరికొంత ముందునకు గైకొని పోయి వారి జీవితసందర్భములేమిటో తెలుసుకొనుటకు ఉత్సాహపరచినది. మన వాఙ్మయ చరిత్రలో కవిజీవిత సమయములు తెలుసుకొనవలెనన్న వారి పోషణకు కారకులైన ప్రభువుల చరిత్రయు, ప్రభువుల కీర్తి ప్రతిష్ఠలకు కారణమగుచున్న కవుల జీవితము ఒక దాని నొకటి వేరుపరచి చెప్పుట కవకాశముండదు. కనుక ఇక్కడి కవుల నరయునపుడు ఈవరకు సరిగా గ్రంథస్తముగాని రాచకొండ చరిత్రమును ఒక క్రమములోనికి వ్రాసుకొనుటయు తటస్థించినది కాని యిది సమగ్రమనిగాని లేక విపులమనిగాని అని అనునట్టి సాహసము చేయలేకపోవుచున్నాను. అందుకు కారణమీ చరిత్రము ఇంకా అజ్ఞాతముగనుండుటయె.

ఈ చరిత్ర సంఘటనలలో కొన్ని ఈవరకే పాఠకలోకమున చర్చలకు వచ్చి సుప్రసిద్ధమైనవి. చరిత్ర గ్రంథమేదియు సంతరమై లేదు కనుక అసంపూర్తి భాగములగురించి ఆధారమేమైనా లభించునేమోయని శాసన సహాయమపేక్షించి ఇక్కడ ప్రాంతములు తిరిగి చూచుట సంభవించినది. వీనికి సంబంధించిన ఒకటి రెండు శాసన

ములు దప్ప ఈ సందర్భమున లభించిన యితర శాసనములే అధికము గాగలవు అయినా చరిత్రకవి ఆత్యంతోపయోగము గనుక వాటిని ప్రభుత్వ శాఖకు అందించుట ఇటీవల జరిగినది.

ఈ చరిత్ర రాజ్యకాలములో కొన్నిచోట్ల కాలము నట్టు పడుట, కొన్ని తావులలో సందేహాస్పదముగ నుండుట, మరికొన్ని సంఘటనలలో చారిత్రకుల అభిప్రాయములు వేర్వేరుగా నుండుటయు గానిపించుచున్నది కనుక ముఖ్యవిషయములందైనను దృక్పథము వివరించుట న్యాయమనుకొందును.

వానిలో క్రీ శ. 1326 నుండి క్రీ శ 1265 వరకు గల మధ్యకాలములో వీరికి సంబంధించిన కొద్ది వాఙ్మయము దప్ప చరిత్రను తెలుసుకొనుటకు దగిన శాసనము లేవియు లభింపలేదు. ఒకటవ అనపోతభూపాలుని కాలములో క్రీ శ 1365 నుండి లభించుచున్న శాసనములలో వీరు 'ఆంధ్ర దేశాధీశ్వరు' లని చెప్పుట పెక్కు శాసనములలో చూడవచ్చును కాని చారిత్రక సంఘటనలలో ప్రసిద్ధులుగా నున్న అనపోత భూపాలుని పూర్వుల గురించి 'అయ్యనవోలు' వంటి శాసనములు చెప్పుచున్నను పరిపాలన విషయముగా ఈ కాలమును చారిత్రికు లింకను అంగీకరింపలేదు. కాని వాఙ్మయాధారములబట్టి వారు కాకతి రాజ్య పతనానంతరమునుండియు 'ఆమనగంటి' పురమునుండి రాజ్యము పరిపాలించుచున్నట్లు తెలియవచ్చుచున్నది కనుక దానినే పరిగణనలోనికి గ్రైకొనబడినది శాసనములు వెలికితీయని లోపములు ఇంకా గలదు కనుక ముందైనా తగిన వివరములు లభించునని ఆశింతును కాల నిర్ణయములలో ఆయా చారిత్రక సంఘటనలు, కొన్ని శాసనములు ఈ చరిత్రను గురించి మిక్కిలి సహాయము జేయుచున్నవి. కాని రెండవ సింగభూపతి కాలము కొందరు ఇప్పటికిని క్రీ. శ 1412 వరకు అని చెప్పుట జరుగుచున్నది. అది సరికాదు. ఎందుకనిన క్రీ. శ. 1399 లో సమాప్త

మైన పానుగంటి పోరాటములో ఈతడు ఓటమి చెందినట్లు శాసనములు కలవు. ఆటుతరువాత కాలములో అనగా క్రీ. శ 1400 ల నుండి ఈతని ప్రస్తావన ఏమాత్రము కనిపింపదు కనుక అదియే తుది కాలమని భావించుట జరుగుచున్నది.

అల్లో మూడవ సింగభూపాలుని కాలమునాటికి యీ వంశములో క్రమము తప్పి కాలము క్రిందు మీదై యుండుట గానవచ్చుచున్నది. ప్రస్తుతము ఈ ప్రభువుకాలమునకు సంబంధించిన శాసనము లు అయిదు వరకు గలవు. మొదటిది క్రీ. శ. 1437 తుదిది క్రీ శ. 1475 లో తిరుపతి శాసనము కాగా ఈ ప్రభువు గురించి నరసభూపాల రాజీయము, విష్ణుభ క్తి సుధాకరమువంటి గ్రంథములలో తమ్మ భూపాలునిచేత ఈతడు పరాభూతుడని తెలుపబడి యున్నది. ఈ తమ్మ భూపతి శాసనమొకటి క్రీ. శ 1458 లోను, పురుషోత్తమ గజపతి శాసనమొకటి క్రీ. శ. 1465 లోను బెజవాడలో గలవు కాని 'సంగరరంగమందు దునిమె'నని ఉషాభ్యుదయమను కావ్యములో చెప్పబడు మరియొకఅంశము పై తిరుపతి శాసనాదులబట్టి పరిహరింప దగుచున్నది

ఈ కాలములోనిదే యగుచున్న శ్రీనాథకవిసార్వభౌముని రాచకొండ పర్యటనగూడా కడు ప్రాముఖ్యముగలిగియున్నదే. వాఙ్మయకారులలో ఈ పర్యటన కాలముగురించి అభిప్రాయభేధములున్నను క్రీ. శ 1428 పూర్వమీ పర్యటన జరుగుట కవకాశము గనిపించుటలేదు. అట్లు భావించుట చారిత్రక సంఘటనలను విస్మరించుటే కనుక 1428 నుండి 1435 కాలములోనే శ్రీనాథుడు పర్యటన జరిపియుండునని కొన్ని సంఘటనలు దెలుపు చున్నవి. ఇక క్రీ శ. 1475 వరకు బమ్మెర పోతన కాలమని చిత్రభారత కృతి కర్త వలనను, పితాబుఖాను శాసనము ననుసరించి ఈతని కాలము

క్రీ. శ. 1503 పైబడియుననియు స్పష్టమగుచున్నది. భాగవతపు అంకిత గాథ కేవలము ప్రవాదు మాత్రమే. దాని కెట్టి చారిత్రక విలువయు లేదు. అదిగాక పోతనగారే స్వయముగా బలికిన 'కర్ణాటకిరాట కీచకుల కమ్మ' అనునదియే సత్యమగునని తోచుచున్నది.

పొరుగురాజ్య సంబంధములలో రాచకొండ స్థానమును గురించి కొన్ని కఠిన సమస్యలు రాకపోలేదు. కాని అవి సందర్భ మును బట్టి ఈవరకు చరిత్రకారులు ఊహించి వ్రాసినవె. ఈ ఊహ లన్నియు చరిత్ర సరిగా పరిశోధితము గానపుడు న్యాయముగనుండవు. అయినను అవుసరమైనచోట వాటిని పేర్కొనుచు తిరిగి ఊహావిష యములతో దీనిని నింపక వదిలివేయుట జరిగినది

ముఖ్యముగా అనేక సందర్భములలో దీనిని విస్తరించుట కన్న వ్రాసినదానినే మిక్కిలి సంక్షేపపరచవలసివచ్చినది. కారణము దీనికి వలసిన స్క్రిప్టు, మ్యాపులు, చిత్రములు మొదలైనవి తయారుపరచు కొని వ్యయము లెక్కించిచూడగా అధికమై తోచినది. ఇతర సహా యము లేనిది ప్రచురించుట కష్టమని చూచుచుండగా ప్రభుత్వము మరియు సాహిత్యఅకాడమివారును సహాయము చేతుమని తెలిపి యుండిరి వారి నర్థించగా సంవత్సరకాలము గడిచినది. తుదకు సంక్షేపముగనైనను దీనిని కడతేర్చగోరి ముద్రణ పూర్తిగావించితిని. లోపము లిందుండవని యే గ్రంథకర్తయు అనజాలడు, అందులో అభ్యాసములేని విషయములలో తల దూర్చవలసి వచ్చినది. కనుక లోపములకు సహృదయులందరు క్షమింతురని విశ్వసించెదను.

ఈ గ్రంథములోని కొన్ని విశేషములు, కొన్ని శాసనవివర ములు ఈవరకు ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, భారతి మొదలైన పత్రికలలో వచ్చినవి. చారిత్రక విషయములకు ప్రోత్సాహమిచ్చి వ్యాప్తిగలిగించుచున్న అట్టి పత్రికాధిపతులందరికి మిక్కిలికృతజ్ఞుడను.

ముఖ్యముగా చారిత్రక వృద్ధులైన శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారి పరిచయము గలిగి, సహపర్యటన జేయు అవకాశము జిక్కి, వారి సలహాల నందుకొనగలుగుట మహద్భాగ్యము అట్లే ప్రసిద్ధులైన శ్రీ మారేమండ రామారావుగారు, శ్రీ ఆదిరాజు వీరభద్ర రావుగారు, శ్రీ గడియారం రామకృష్ణశర్మ గార్ల ఆశీస్సులును అందుకొనుట ఈ సందర్భమున ఉత్సాహకరము మరియు ప్రోత్సాహకరము నైనది

ముద్రణాధిపతులు దీని ప్రచురణ సందర్భములో సానుభూతి జూపకున్నచో యిది వెలుగునకు వచ్చునది కానేకాదు ఆయా సందర్భములలో ఆర్థిక సదుపాయమును గలిగించిన మిత్రులిట్లే తోడ్పడి యుండిరి. వారందరికి కృతజ్ఞతాభివందనములు. చరిత్ర విషయములో నిది యేమాత్రమేని ఉపకరింపగలిగినచో ఈ కృషి ఫలించినట్లుగ భావించువాడను.

ఇట్లు

విధేయుడు,

తేరాల సత్యనారాయణశర్మ

నల్లగొండ

25-5-1970

# రాచకొండ చరిత్రము

## పూర్వరంగము

కాకతీయ మహాయుగంలో గణపతిదేవుని కాలంనుండి ఒక శతాబ్దికి పైగా అత్యంత ప్రాముఖ్యానికి వచ్చిన వంశంపేరు రేచర్ల పద్మనాయకులది. ఈ పద్మనాయకుల పూర్వనివాసం నేటి నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా పిల్లలమఱ్ఱి గ్రామానికి చేరువగానున్న ఆమనగంటిపురము ఆమనగంటిపురము, నాగులపాడు, పిల్లలమఱ్ఱి కాకతీయులనాటి నాయంకర మండలమునకు కేంద్రస్థానముగానున్నట్టి చారిత్రక గ్రామములు. ఈ రేచర్ల పద్మనాయకులు కాకతి చక్రవర్తులైన గణపతిదేవునికి, వీరనారియగు రుద్రమదేవికి, మరియు ప్రతాపరుద్రునికి సేనాపతులై యుండి, వారి కన్నిరంగములయందును కుడిభుజముగా పనిజేసి, ప్రీతిపాత్రులై, ఆ చక్రవర్తులచే 'కాకతి రాజ్యస్థాపనాచార్య - రాయపితామహాంక' వంటి ప్రశస్తమైన బిరుదులెన్నో బొంది ఖ్యాతివహించిరి. కాలవశమున ఆ కాకతిరాజ్య మంతరించుటతోడనే దేశమన్యాక్రాంతమై అంధకారమున బడినది. కాని తెలుగుదేశమునందచిరకాలముననే తిరిగి స్వాతంత్ర్య శంఖారావము పూరింపబడినది. ఆ స్వాతంత్ర్య పోరాటంలో మిగిలిన కాకతి నాయకులందరును ఆంధ్రజాతి పౌరుషశక్తులను తిరిగి సమీకరించి దాస్యశృంఖలముల నుండి దేశము [illegible] నడుముగట్టిరి. ఆ పోరాటభాగమొక యుజ్జ్వలమైన ఘట్టము.

ప్రస్తుత ఘట్టమునందీ [illegible] చరిత్రలో పరాక్రమోపేతులు, చారిత్రిక విఖ్యాతులునైన ఈ రేచర్ల పద్మనాయక చరిత్ర యొకటి దేశమునందెట్లు ప్రాముఖ్యమును వహించుచున్నదో ఆంధ్రులైన మనము దెలుసుకొనవలసి యున్నది.

## ఆధారములు

పద్మనాయకుల చరిత్ర దెలిసికొనుటకుగల ముఖ్యాధారములు నాలుగు రకములు అవి 1. శిలాశాసనములు 2. వాఙ్మయము 3 స్థానిక చరిత్రలు 4 కట్టడములు - నిర్మాణములు ఈ సాధనములన్నియు వీరి చరిత్రనుగూర్చి ఉపయుక్తమైన సమాచారము కొంత నొసంగుచున్నవి వీటిలో చిరకాలానుగతము, అత్యంత ప్రమాణమునై ప్రత్యక్ష సాక్ష్యము నొసంగునవి వీరి శిలాశాసనములు. వీటికి మించిన బలమైన సాధనము మరియొకటి యుండదు

చరిత్ర కుపయోగించుచున్న ఈ శాసనములు రెండు రకములు ఒకటి శిలాశాసనములు, రెండు తామ్రశాసనములు సామాన్యముగా ఈ శాసనములన్నియు భూదాన ధర్మములకు, దేవాలయ ప్రతిష్ఠ, అగ్రహారాది దానములకు జెంది శాసనకర్తలైన యా ప్రభువుల పరాక్రమ శౌర్యములు, వారి వంశప్రతిష్ఠాది బిరుదావళి, కాలము మొదలైన సమాచారములను దెలుపుచుండును కొన్ని శాసనములు కేవలము వీరి పరాక్రమ ఘట్టములను దెలుపుటకు గూడా వేయబడి గానవచ్చుచున్నవి మొత్తముపై రాచకొండ ప్రభువులు వేయించిన శాసనములన్నియు సుమారు ముప్పదివరకును గానవచ్చుచున్నవి ఈ శాసనములు వేయబడినట్టి స్థలములు, వాటి కాలములు ఈ దిగువ నుదాహరింపబడినవి.

గార్ల శాసనము క్రీ శ 1287

రాచకొండ దుర్గముకడ నున్న శాసనములు ఆరు. క్రీ శ 1365–1380

సింహాచల శ్రీకూర్మములందున్నవి నాలుగు. క్రీ శ 1380–1407

అయ్యనవోలు శాసనము క్రీ శ. 1369

కందికొండ శాసనములు రెండు క్రీ శ 1375

ఉమామహేశ్వర శాసనము ఒకటి క్రీ శ. 1376

జాతరరేవు శాసనము క్రీ శ. (?)

దేవరకొండ దుర్గముకడ రెండు క్రీ శ (?)
భువనగిరి శాసనము క్రీ శ 1378
మాదానాయుని శాసనములు మూడు క్రీ శ 1421–1429
చినకింజీవర శాసనము క్రీ శ 1437
బెల్లంకొండ శాసనము క్రీ శ 1453
శాయింపేట శాసనము క్రీ శ 1464
తిరుపతి శాసనములు మూడు క్రీ శ 1475
పానుగల్లు శాసనము క్రీ శ (?)
దోమలపల్లి శాసనము క్రీ శ (?)[1]

కొన్ని శాసనముల ముఖ్య సంగ్రహభాగములు అనుబంధము 2 లో చూపబడియున్నవి

## వాఙ్మయము

చరిత్రాదిమయుగంలో మరో గొప్ప సాధనము ఆనాటి వాఙ్మయ సంపత్తి ఇది రెండు విధములు ఒకటి సంస్కృత వాఙ్మయము మరొకటి తెలుగు వాఙ్మయము రాచకొండ భూపతులు తెలుగు సంస్కృత భాషలను సమానముగనే ఆదరించినను ఎందువలననో గాని తెలుగు కృతి కావ్యములు ఎక్కువ బయటికి రానేలేదు. సంస్కృత కావ్యముల స్థితి దీనికన్నను కొంత మెరుగనియే చెప్పవచ్చును

వారి కృతికర్తృత్వమునగాని శాస్త్రప్రమాణముగను సింగభూపాలుని రసార్ణవసుధాకరము, సంగీతరత్నాకర సుధాకరము, రత్నపాంచాలిక లేక గ్రంథశ్రేణికి చెందిన సంస్కృత కావ్యములు అస్తిత్వమున

---

**1. చివరి రెండు శాసనములు – మరికొన్ని యితరములు ఇటీవలి శోధనలో బయలుపడియున్నవి. అనుబంధములో వీనినిజూడవచ్చును. రాచకొండ యుగమునను – తదనంతర కాలమునను రేచర్ల వంశీకులైన 'వెలుగోటి' నాయకుల శాసనములు మరికొన్ని గానవచ్చుచున్నవి. వీటి సంబంధము నింకను జూడ వలసియే యున్నది.**

ఆస్థానకవుల చమత్కార చంద్రిక, అమరకోశ వ్యాఖ్యానము, మదన విలాసభాణము, లక్షణదీపిక యనునవి ప్రఖ్యాతమైన సంస్కృత కావ్యములు. రాచకొండ రాజ్యవిశిష్టత కివి శిరోభూషణములన్నను అతిశయోక్తి గాజాలదు.

తెలుగులో గానవచ్చు గౌరనార్యుని హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్రము, కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక యిట్టి ప్రాధాన్యమే వహించుచున్నవి తెలుగునాటి సాంఘిక జీవితమును దెలుసుకొనుటకివి ఉత్తమసాక్ష్యములని జెప్పవచ్చును ఇక మహాభాగవతకావ్యము తెలుగువారి కొక మధురామృతపానమని జెప్పవలసినపనియుండదు పురాణరచన గనుకనేమో – దానియందెక్కువ చారిత్రక సాక్ష్యము లభింపజాలదు వీనితోబాటుగా ఆనాటి సమకాలీన సాహిత్యమునుగూర్చి దెలుసుకొనవలసియున్నది భాషాపోషణ విషయములో ప్రత్యేకముగా రాచకొండ రాజ్యము మరియు కొండవీటి ప్రభువులు ఒకరితో నొకరు పోటీపడియుండిరా – అనునట్లు గాన్పించుట గొప్ప విశేషము సాహిత్యం విషయములో ఈ రెండు రాజ్యములు గావించిన కృషి శ్లాఘనీయమని జెప్పవచ్చును ప్రబంధపరమేశ్వరు డనబరగిన ఎఱ్ఱన హరివంశ నృసింహపురాణములు, కాటయవేమా రెడ్డి కావ్యత్రయ వ్యాఖ్యానములు, పెదకోమటి వేముని శృంగారదీపిక, బాణభట్టుని వేమభూపాల చరిత్రము రెడ్డిరాజ్యములో వెలసిన మేటి కావ్యములు ఇవన్నియును ఒక ఎత్తు – అసలు రెడ్డిరాజ్య కీర్తిప్రతిష్ఠలకే కారణభూతుడైన శ్రీనాథమహాకవి మరియొక యెత్తు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారన్నట్లు 'తెలుగు రాజ్యములం[illegible]గల సంస్కృతీ సంబంధమునకు ముఖ్యముగా శ్రీనాథుని [illegible] జీవిత బంధమనుట' అది యాతని విశిష్టత [illegible]చున్నది. వేయేల ఈ విషయములో పండితులందరును ఏకకంఠముగా బల్కుమాట లిట్టుల నున్నవి. 'తెలుగు నేల అధిక భాగము నాక్రమించుకొని తెలుగు సంస్కృతికిని సాహిత్యమునకును దోహదముచేసిన సిసలైన తెలుగు రాజులు కొండవీటి రెడ్లును, రాచకొండ వెలమలును'

మాత్రమేనని భాగవతమును పరిష్కరించిన పండితులు యథార్థముగా వ్రాసియుండిరి [2]

## స్థానిక చరిత్రలు

సాహిత్యము తరువాత జెప్పకొనదగినవి స్థానిక చరిత్రలు, దండకవితెలు, చాటు పద్యావళులు. తెలుగులో చరిత్ర రచనాకృషి యాలశ్యముగనే జరిగియున్నప్పటికిని – జరిగినంత వరకైనను – అది ప్రయోజనాపేక్షితము నొనగూర్చలేదనియే జెప్పవలసి యున్నది. అసలు తెలుగులో – తెలుగుదేశ చరిత్రలే గాన్పింపవన్నను దోషము లేదేమొ! ఉన్నంతలో వెలుగోటి వంశ చరిత్ర, వెలుగోటివారి వంశావళి, రావు మరియు సురభివారి వంశ చరిత్ర మొదలగు గ్రంథములు కొన్ని ఈ రాచకొండ చరిత్రకు ఉత్తరవాదముగా నున్నవి. అంతేగాని రాచకొండచరిత్రకు మూలమైన గ్రంథమేదియు ఇంతకు పూర్వము వెలువడియుండనేలేదు

చాటు పద్యావళులకు పొగడ్తయే ముఖ్య ఆధారముగనున్నది గనుక, ఆ యా సందర్భములందు భట్రాజులచేత జెప్పబడినదైన వెలుగోటి వంశావళి ఈ శ్రేణిలోనే జేరుచున్నది కాని దీనికి చారిత్రక కథనమైన ప్రాముఖ్యత కొంత గలిగియున్నందున అప్రమాణమని దీనిని త్రోసివేయుటకును ఏ మాత్రము వీలు గాజాలదు. తెలుగులో చాటు పద్యసాహిత్యము చెప్పదగినంతగా వృద్ధియగుచునే యున్నది వీటిలో కొన్ని సాహిత్యం దృష్టితో, కొన్ని వర్ణనాత్మక దృష్టితో, మరికొన్ని ఏదో సమాచారమును దెలుపుచుండును. ప్రత్యేకించి వీటిలో ఒక కవిని గురించి గాని, కాలము గురించి గాని సమాచార ముపలభ్యముగాదు ఏ సందర్భంలోనో – ఎవరో జెప్పగా, జనవాడుకయందవి నిలిచిపోవటమే సామాన్యముగా గనిపించుట గలదు. మహాకవి శ్రీనాథుని పేరిట గానవచ్చుచున్న అసంఖ్యాకమైన చాటువులు ఈవరకు దెలిసియే యున్నవి. పోతనామాత్యునివని జెప్పు చాటువులు కొన్నియు ప్రచారమున నున్నవి. వీటి ననుసరించి చారిత్రక

2. సాహిత్య అకాడమివారి శ్రీ మహాభాగవత పీఠిక. 1964. పుట. 81.

ప్రమాణములు నిర్ణయింపకున్నను యితర సాక్ష్యములనుబోల్చి చూచుకున్నపుడు అవి కొంతవరకైనను ఉపయుక్తమగునని చెప్పవచ్చును

## దండకవిలెలు - కైఫియతులు - బిరుదావళి

తెలుగులో దండకవిలెలు, కైఫియతులు, బిరుదావళులు, సనదులు, చారిత్రక సమాచారమునకు మిక్కిలి ఉపయోగపడుచున్నవి అనుబంధమున యిట్టివి కొన్ని చేర్చబడియున్నవి ముఖ్యముగా కాకతీయ నాయకులైన 72 మంది నాయకుల బిరుదావళి[3], అందుగుల వెంకయ్యగారి (రామరాజీయ మందలి) బిరుదావళి గద్యము, చిన్నకోట పెద్దనగారి (కావ్యాలంకార) ప్రబంధ బిరుదావళి ఈ తరహాకు చెందుచున్నవి

పూర్వపు రాజవంశములు వారి పరాక్రమ చరిత్రలు తెలుసుకొనుట కిట్టి బిరుదావళి ఎంతో సహాయపడును రాజవంశములో గల ఈ బిరుదులలో విశేషమేమన ఈ వంశములలోగల మొదటికాలపు వారెవరైనా - ఏదేని బిరుదు దాల్చియున్నదో పరంపరగా నది చివరికాలము వరకును కొనసాగుచుండును అందువలన ముఖ్యసంఘటనలు కొన్ని తెలుసుకొనుటకు తగిన అవకాశము లభించుచున్నది రాచకొండవారి బిరుదావళిగద్యము అనుబంధమున జూడవచ్చును. ఇక ఓరుగంటి కైఫియతులు, కొండవీటి దండకవిలెలు, కొన్ని సనదులును చారిత్రకముగా మిక్కిలి ప్రాముఖ్యతను గలిగియున్నవి.

## మెకంజీ వ్రాతప్రతులు

పుట్టుకతోడ ఆంగ్లేయుడైనను మద్రాసు ఇంజనీయరైన కల్నల్ మెకంజీదొర (1782-1821) దక్షిణదేశ చరిత్రకు గావించినట్టి మేలు ఎల్లకాలము మరువరానిది 38 సంవత్సరాల సుదీర్ఘకాలము

3. కాకతీయ నాయంకర సంఖ్య 77 అని వెలుగోటి వంశావళి, 75 అని శల్లి కలుఃచేరు శాసనము 72, అని మరియొకచోటను వేర్వేరుగా చెప్పబడియున్నది. అనగా ఈ నాయంకర సంఖ్య అప్పుడప్పుడు మారుచు వచ్చియుండవలయును.

దేశంలో గల వివిధ ప్రాంతాలలో చారిత్రక విశేషాల నెన్నెని ఈ మహానుభావుడు సేకరించి వాటిని 'Mackenzie Manuscripts' గా పదిల పరచియుండెను మన కృషితో బోల్చి చూచుకొన్నప్పుడు కల్నల్ మెకంజీద్వార గావించినపని - స్వదేశమువాడు గాకున్నను - మన దేశముపై గనబరచిన అతని అభిమానము మనకంటే మించినదని చాటుతున్నది దానిని జూచియైనను మనము నేర్వదగినది కొంత గలదు ఆ తరువాత C, P బ్రౌనుమహాశయుని 'Local Records' గూడా ఈ తెరహాకు జెంది మిక్కిలి ఉపయుక్తముగ నున్నవి మద్రాసు ఓరియంటలు లైబ్రరీవారు వీటిని ప్రచురించి యుండిరి.

స్థానిక చరిత్రల తరువాత జెప్పదగినవి మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన గ్రంథములు వీటిలో ఖుతు హుస్సలాతీన్-ఈసామి (1310-1350), తారీఖే ఫెరిస్తా (1570), తబెఖతె అక్బరి (1593), బుర్హానె మా అసిర్ (1594) అనునవి దక్కను తెలుగుదేశ చరిత్రను తెలుసుకొనుటకు జూ. డగియున్నవి కాని వీటియందలి ప్రమాణములు నిర్ణయించుకొనునప్పుడు మిక్కిలి జాగరూకత వహింపవలసియున్నది. ఈ గ్రంథము లన్నిటికిని ఆంగ్లానువాదములు లభింపగలవు

## పట్టణములు - నిర్మాణములు

రాచకొండవారి కిట్టణములలో ప్రధానమైన రాచకొండ దేవరకొండలందుగల దుర్గనిర్మాణములు మొదట బేర్కొనదగినవి. ఈ దుర్గములందుగల ముఖ్యభవనములు శిథిలమైయున్నను అక్కడ గల కోటగోడలు, బురుజులు, ప్రధాన ద్వారములు ధాన్యపు గిడ్డంగులు కొన్ని దేవాలయములు చూపరుల నాకర్షించుచున్నవి దుర్గనిర్మాణపు పనులలో రాచకొండ కన్నను దేవరకొండయందు పని తన మెక్కువ. ఆ తరువాత జెప్పదగినవి కొన్ని ముఖ్యదేవాలయాలు, లౌకిక నిర్మాణములు దేవాలయములు రెండు మాత్రము దప్ప తక్కినవి శిథిలముగానున్నవి. వాటిలో II అనపోతా నేడు రాచకొండలో నిర్మించిన రామస్వామి ఆలయము, దేవరకొండ కోటలో గల శివాలయము కొంతవరకు సంస్కారమున నున్నవి.

తటాకములలో నాగాంబికాదేవి నిర్మించిన నాగసముద్ర మనునది అగ్రశ్రేణి నిర్మాణము అట్లే దేవరకొండలోగల ప్రభువులు వేదగిరి నాయుడు, పర్వతరావు అనువారు వారిపేరిట తటాకములు నిర్మించియుండిరి నాగసముద్ర నిర్మాణ సమయముననే నాగాంబికాదేవి అచ్చట శాసనప్రతిష్ఠ యొకటి గావించియున్నది. ఆ శాసనము వలననే నాగాంబికాదేవి భర్తయగు రావుమాధవ భూపాలుని 'రాఘవీయ కావ్యము' ఆ శ్రీరామచంద్రున కంకిత మొసంగినట్లు దెలియవచ్చుచున్నది మొత్తముపై నేటివరకు లభించిన వివిమాత్రమే పేరు తెలిసి నేటికిని బయటికి రానివి మరికొన్ని గలవు అసలు పేరే తెలియక కాలగర్భమున దాగియుండు చరిత్ర మరికొంత యుండును. 'కృషితోనాస్తి దుర్భిక్షః' మనునట్లు పై యంశములన్నిటిని దృష్టిలోనుంచుకొని భావి చరిత్రకారులెవరైనా ఈ కృషిని నిరంతరము సాగించుచు తమ కర్తవ్యమును మీరు నెరవేర్చవలసి యున్నది

## కాకతీయ యుగములో మహాంధ్ర నిర్మాణము

రాజకీయముగ జూచినచో తెలుగుదేశమునకు 13 వ శతాబ్దమొక స్వర్ణయుగమని జెప్పవచ్చును ఆ కాలముననే తెలుగునేలయంతయు కాకతిచక్రవర్తుల ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి రాగలిగినది తెలుగు ప్రజాభ్యుదయము, తెలుగు సంస్కృతీ వికాసముల కిది అతి ముఖ్యమైన కాలము. దీనిని విజయవంతముగా సాధించినవాడు మహాచక్రవర్తి గణపతిదేవుడు.

కాకతి చక్రవర్తులలో అగ్రగణ్యుడైన గణపతిదేవుడు మహాశూరుడు, విజేత, పరిపాలనాదక్షుడు. ఈతని బహుముఖ ప్రజ్ఞాపాటవములచేత రాజ్యమెంతయో విస్తరించి తెలుగునాడంతయు నొకచోటికి జేరి మహాంధ్ర సామ్రాజ్యపు నిర్మాణమైనది. త్రిలింగమని నాడు బిలిచినను, విశాలాంధ్రయన్నను - లేక మొత్తరాహుం లొసంగిన 'ఆంధ్రప్రదేశ్' అని వాడుకొనుచున్నను ఆనాడే యది మహాంధ్రశబ్దమునకు నాందియైనది. సంస్కృతీపరముగ జూచిన కవిబ్రహ్మయగు తిక్కనసోమయాజి అఖిలాంధ్రజాతి సమ్మేళనమునకే

ఱువహించెనని దోచుచున్నది[4] తిక్కన సోమయాజి గంటము ట్టుటలోనే గాక రాచకార్య నిర్వహణ మందును ఎట్టి కుశాగ్ర ద్ధిశాలియో గణపతి చక్రవర్తి గావించిన మహాసత్కారమునుబట్టి ప్పవచ్చును.[5]

గణపతిదేవుడు రాజ్యమునకు వచ్చుసరికి పరిస్థితులు మిక్కిలి నుకూలముగ నున్నవి. దేశములో అనేకప్రాంతములు అనేక రాజుల ఏలుబడిలో నుండి చిన్న చిన్న మండలములై మిక్కిలి ల్లోలముగనున్నవి రాజ్యవిస్తరణ కిది తగిన సమయమని గణ తిదేవుడు క్రీ శ 1209 నాటికి గుంటూరు మండలము నందున్న వెల నాడు పలనాటిమండలములపై దాడిగావించి వాటిని వశపరచు నియుండెను ఆ పిమ్మట నెల్లూరి తెలుగుచోడుల సహాయమున ంచి నాక్రమించి కృష్ణామండల మందలి పెక్కుప్రదేశములు వశము వించుకొనెను ఆటుతరువాత 1212లో కళింగముపై దండయాత్రను ప్రారంభించుట జరిగినది ఈ దండయాత్రలో మహాశూరుడైన రాజ నాయకుడను సేనాని ఈతని ననుసరించి గంజాం జిల్లాలోని బొక్కిం రకును జొచ్చుకొనిపోయి విజయము సాధించినట్లు ఉప్పరపల్లి శాసన ముకటి తెలుపుచున్నది[6] క్రీ శ 1230 నాటి మరియొక దండయాత్రలో

---

4. కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్కృతి
శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్।

భార. విరా. ఆ 1-ప. 30

5. ఆ రీతి గణపతి నటుఁ జూచి పేర్మి
దిక్కన సోముడు నక్కడేతెంచె
నా రీతిగా సోమయాజుల రాక
వారికతా పణిహారు లేర్పరుప
గణపతి మహరాజుగా రెదుర్కొనిరి.

సిద్ధేశ్వర చరిత్రము.

6. No. H.A.S. 19- W.G. P. 166 to 170.

దేవగిరి సింహణ నీతడు ఓడించి విజయము సాధించినట్లు దెలియవచ్చు చున్నది కళింగముపై సాగించిన దండయాత్రలు మూడు ఈ సమయ మునవే పెక్కు ప్రాంతము లీతనికి వశమైనవి 1239 ప్రాంతమున కాయస్థసేనానియగు 'గంగయ సాహిణి' వంటి బలవంతుల నీతడు వశముగావించుకొని కృతకృత్యుడాయెను ఈ విషయము లన్నిటికి ప్రభు భక్తి పరాయణులైన కాకతిసేనానాయకులే ముఖ్యకారణమని చెప్పవచ్చును కాకతి రాజ్యవిస్తరణ బూర్తియైన వెంట దాని హద్దులు దక్షిణమున కంచివరకును, తూర్పున సింహాచలము, పడమట భీమానది, ఉత్తరమున యాదవరాజ్యమువరకును వ్యాపించి మహాంధ్ర దేశనిర్మాణమైనది ఈ చక్రవర్తి కాలములో ఆంధ్రదేశమున వెలసి నన్ని దేవాలయములు, వేయించిన శాసనములు మరియొకరి కాల మున గానరావన్నచో అతిశయోక్తి గాదేమో పాండ్యులవలన చివరి కాలములో గణపతిదేవునికి కొంత చికాకుగలిగినను దానిని సమర్థ వంతముగనే నెదుర్కొని యుండెను గణపతిదేవుని కాలముననే అనుమకొండనుండి రాజధాని ఓరుగల్లునకు మారినది ఈ చివరి కాలములోనే గావచ్చును రేచర్ల పద్మనాయకులకు కాకతీయులకడ ఆశ్రయము లభించి ఉత్తరోత్తరా మంచి యభివృద్ధిలోనికి వచ్చి యుండినది వెలుగోటి వంశావళి ననుసరించి - గణపతిదేవుని కాలముననే వీరి కాశ్రయమచట లభించినట్లుగ దెలియుచున్నది.

I

# బేతాళ నాయుడు

పద్మనాయక వంశ చరిత్రలో తొలిసారి గన్పించువాడు బేతాళ నాయుడు ఈ బేతాళనాయుని వంశోత్పత్తినిగురించి పూర్వము కొంత చర్చజరిగియున్నది. కాని వాటి సారాంశము లన్నియు ఏకాభిప్రాయమును గనబరచవు కారణమేమనగా అందుకు బలమైన యాధారమేదియు ఆనాటివరకు లభించియుండదు శాసనము లైనను బేతాళ నాయుని సంతతిలో I అనపోతానేని కాలము (1361) నుండిగాని లభించుటలేదు లభించినంతలో ఈ అంశముపై కొన్ని ప్రాచీన గాథల నాధారముగా గొని కొన్ని చర్చలు సాగియున్నవి

పద్మనాయకుల వంశోత్పత్తి విషయమున విశేషముగా చర్చకు వచ్చినది 'రేచర్ల'యను నామసామ్యము ఈ రేచర్ల నామమే పూర్వము బమ్మసేనాని మొదలు కాట్రెడ్డివరకుగల పిల్లలమర్రి రెడ్డి సేనాపతులకు వంశనామముగా నాడబడినది[1]. ఆ తరువాత ఆ పేరు తోనె – అదేగ్రామమున వృద్ధిలోనికి వచ్చిన పద్మనాయకులు రేచర్ల యను నామమే వాడుకొనుచుండిరి ఈ రేచర్లయను నామమిట్లు రెండు వంశములకు విచిత్రముగా గలసి యున్నందున – నివాస గ్రామములు ఒకటేయైనందున, ఈ రెండువంశములును ఒకటేయను భ్రమను చరిత్రకారులు లోనుగావలసివచ్చినది కాని శాసనములును మరికొన్ని ఇతరాధారములను బాగుగా పరిశీలించి చూడ ఈ రెండు వంశములు వేరనియే స్పష్టముగా దెలుచున్నది. ఇందులో రేచర్లయను వంశ నామము గృహనామముగా రెడ్డి సేనాధిపతులకు వాడుకొన్నట్లును, రేచర్లయను వంశనామము గోత్రనామముగా పద్మనాయకులు వాడు

---

1. 'తద్భక్తస్య ప్రవీరస్య శ్రీమద్రుద్రచమూపతేః.
రేచర్లస్వామినోవంశం వక్ష్యేవిఖ్యాత ముత్తమం' (119)
పాలంపేట శాసనము క్రీ. శ. 1213.

కొన్నట్లును తేటతెల్లమగుచున్నది[2]. ఇది వారికి పూర్వానుగతమేగాని యాకస్మికముగా వచ్చియున్నదిగాదు[3].

ఈ రేచర్ల వంశీకుల చరిత్రను తొలిసారి చరిత్రకెక్కించిన వారు కీ శే శ్రీ వెల్లాల సదాశివశాస్త్రిగారు మరియు శ్రీ అవధానం శేషశాస్త్రిగారు ఈ పండితులిద్దరు పూర్వపు వెంకటగిరి సంస్థాన ప్రభువుల యాదేశమున వివిధ ప్రాంతములు పర్యటించి, సాక్ష్యమెంతో నరసి 1910 లో ఆ చారిత్రమును ప్రకటించిరి కాని కొద్దిలో ఈ పండితులిరువురును పై రెండు వంశములు నొకటియను భ్రమ ప్రమాదమునకు లోనైయుండిరి[4]

ఆ తరువాత యా వాదమునే మరికొందరనుసరించుచు బోయిరి కాకతీయ సంచికలో[5] ఈ విషయమై జరిగిన వాదము కొంత సహేతుకముగానుండగా రెడ్డి సంచికావారు లావాదమును త్రోసివేసిరి[6]. కాకతీయ సంచికలో రేచర్ల బేతాళ నాయునికిని, పలనాటి రేచర్ల బ్రహ్మనాయుని వంశానికిని సంబంధమున్నట్లు వ్రాయబడినది వాస్తవముజూడ అది నిజమనియే దోచుచున్నది నాను వ్రాసినదిది

---

2. 'తస్యగోత్రా ణ్యనేకాని ప్రసిద్ధా న్యాంధ్రమండలే.
రేచర్ల గోత్రం తే ష్వేకం కాకతీయ నృపార్చితమ్'(6)
అయ్యనవోలు శాసనము క్రీ. శ. 1'69.

3. 'బాసదబ్బరగండ బ్రహ్మన్నసుతుడు, వాసిగ రేచర్లవంశవర్ధనుడు (?140)
పలనాటి వీరచరిత్ర. పుట. 434.

గీ. వెలయు తత్పద్మనాయక కులమునందు,
నభ్యుదయమొందె ఘనుడు మహామహుండు
వినయ రేచర్లగోత్రుండు విజయశాలి,
తనరఁ బిల్లలమఱ్ఱి బేతాళనృపతి. వె. వం. పుట. 5. ప. 5.

4. వెలుగోటివారి వంశచరిత్ర ఉపోద్ఘాతము. పు. 1 నుండి 15.

5. కాకతీయ సంచిక. 1935. పుట. 50.

6. రెడ్డి సంచిక. 1947. పుట. 222.

పలనాటి రాజైన అనుగురాజునకు దొడ్డానాయుడను మంత్రిగలడని, ఆ దొడ్డా నాయుని కుమారుడైన బ్రహ్మనాయుని ప్రోద్బలముననే కులభ్రష్టులైన పలనాటి వీరులు పలనాటి పోరాటము ముగియగనే తమ నాదరించువారు గానరాక చెల్లాచెదరైరని, అట్టివారి సమ్మిశ్రణముననే వీరులైన పద్మనాయక వంశమొకటి యేర్పడెననియు దెలిపియుండిరి పై విషయమునగల నామసామ్యము, అందుకు తగిన సంఘటనలు అది నిజమగునని దెలుపుచున్నవి ఈ సంబంధము నిజమైనను పద్మనాయక వంశోత్పత్తి పలనాటి యుద్ధానంతరమే యేర్పడినదిగాదు రేచర్ల వెలమవంశము పలనాటి యుద్ధమునకు పూర్వముననే వృద్ధిలోనున్నట్లు ఆ చరిత్రయందే తగు నిదర్శనము లున్నవి[7]. ఇక వెలుగోటి, రావు వంశాది చరిత్ర గ్రంథములన్నియు పద్మనాయక వంశోత్పత్తిని గురించి యిట్లు దెలుపుచున్నవి. ఈపద్మనాయక వంశస్థులొకప్పుడు మహాపద్మునిచేత చెఱపెట్టబడి, స్మృతినిగోల్పోయి, కొంతకాలానికి పిమ్మట పద్మనాయకులని పిలువబడిరని, మరియొకచోట మహావిష్ణువు పాదపద్మములనుండి జనించిన వారగుటచేత పద్మనాయకులని పిలువబడిరనియు దెలుపుచున్నవి[8]. ఈ చివరిఅంశము ఇటీవలనే, ఆకస్మికంగా లభించిన ఈ వంశీయులదైన యొక భగ్న శాసనమందును సమర్థింపబడుచున్నది[9]

---

7. అనుగురాజు కాలంనుండి ఆ కొలువులో దొడ్డానాయుడు, బ్రహ్మనాయుడు, పేర్నీడు, సూర్నీడు, తెప్పలినీడు, వెలమనాయుడు, వెలమలదోర్నీడు, మలినీడు, పినమలినీడు _ గోపినాయుడు అనువారు గాన్పించుచురు.

8. బరఁగు లక్ష్మీమనోభర్త పాదయుగళ
మందుజనియించె సకలార్థబృందమునకు
శరణమై గాఢశోభనాచరణమగుచు
వెలమవంశంబు గాంభీర్య విలసనంబు.

వె. వం. పు. 5. ప. 4.

9. [లక్ష్మ ...లా]కాలాయిత తనుహర్తారి రవ్యాన్మహోన్నతః। యద్దంష్ట్రాగ్రి కేత కేయాతి పృథ్వీ షట్పద విభ్రమం॥ అభూ దంభోజ సంభూతే పాదపద్మ భవః ప్రభుః।

దోమలపల్లి శాసనము _ అను II. పు. 24.

మొత్తము పై వీటినన్నిటిని జూడగా వెలమవంశము గూడా ప్రాచీనమైనవంశమే యని, కొన్ని కారణాంతరములచేత ఈ వంశము లోను రాను రాను సమ్మిశ్రణ మధికి భాగమై యొక విలక్షణమైన వీరవంశముగా నిది మారి యుండెనని జెప్పుట కెట్టి యడ్డంకులు గానవచ్చుటలేదు. అంతేగాని పూర్వీకుడైన చెవ్విరెడ్డికి- ఈ బేతాళ నాయుడికి గల సంబంధ మంతయు అసంబద్ధ మనియే జెప్పవచ్చును

## బేతాళనాయుడికి సంబంధించిన కథ

పద్మనాయకులకు మూలపురుషుడైన ఈ బేతాళనాయుడి గురించి ఒక విచిత్రకథ యిట్లు దెలియుచున్నది[10] బేతాళనాయుడు ఆమనగంటి పురమునందొక పాటిచేని కర్షకుడు రేచడను సేవకునితో గలసి బేతాళనాయుడు పొలము దున్నుచుండగా నాగలి తుద కొక రాయి తగిలి అది పగిలిపోవ, అచ్చట నిధి ఒకటి గానవచ్చెను. ఆ నిధిని వారు వెలిదీయుటకై బ్రయత్నింపగా నరబలియైన గాని యది లభింపదని ఆకాశవాణి యొకటి వారికి వినిపించెను. తక్షణమే సేవకుడైన రేచడు అందు కంగీకరించి తన ప్రాణము లర్పింప యా నిధి బేతాళనాయునకే లభించినట్లును- ఆ వెంటనే జరిగిన యొక పరీక్షలో ధైర్యసాహసమున నెగ్గుటచే సాక్షాత్తు భూతనాయకుడైన భేతాళుని దర్శనము గూడా ఈ బేతాళనాయుడికే లభించెనని- ఆతని అనుగ్రహమువననే బేతాళనాయుడు ప్రసిద్ధి కెక్కెనని యీ కథ దెలుపుచున్నది. సామాన్యముగా పరాక్రమ శూరులైన నాటి విషయములో యిట్టి కథ లెన్నో ప్రచారమునకు వచ్చుచుండుట, జనములు నాటి కాలమున హెచ్చుట సమాజమందున్న విషయమునే అంత మాత్రమున దీని కెట్టి చారిత్రక యాధారము గనిపించదు. ఇది ఒక ఫుక్కిటిపురాణమే గాని సత్యము గాజాలదు

## బేతాళనాయుడు-రాజాశ్రయము

సహజముగా బేతాళనాయుడు పరాక్రమశూరుడు. అప్పటికే ఆతడు కాకతీయ సైన్యమందు జేరి బాగుగా పేరు సంపాదించి

10. వె. వ. పు. 1 to 5

యుండవచ్చును. మెల్ల మెల్లగా ఈతని పరాక్రమ శౌర్యములగూర్చి మహాచక్రవర్తియైన గణపతిదేవుని చెవివరకును బ్రాకి, ఆతని నొక ప్రధానపదవిలో నుంచుటకు దారితీసి యుండవచ్చును. ఇందుకు తగిన అవకాశములు కొన్ని గనిపించుచున్నవి. అప్పటివరకు పిల్లలమఱ్ఱిని పాలించుచున్న రేచర్ల రెడ్డివంశము కారణ మేమిటోగాని క్షీణదశ లోనికి వచ్చినది. తొలుదొల్త గణపతిదేవునికి వ్యతిరేకియై ఆ తరు వాత కాలంలో సామంతుడైన కాయస్థసేనాని 'గంగయ సాహిణి' క్రీ శ 1253, 1256లలో నల్లగొండ మండలములో చిట్యాల వరకుగల విశేష ప్రాంతమును పాలించుచుండెను[11] సామంతుడైనను ఈ గంగయ సాహిణిని గణపతిదేవుడు విశ్వసించెనని చెప్పజాలము కనుక పిల్లలమఱ్ఱి ప్రాంతమున తగిన వారి నొకరి నేర్పాటు జేయుటకై ఈ బేతాళనాయుని బిలిపించి లక్ష (ఆదాయపు) సీమనిచ్చి ఆమనగంటి పురమున కధిపతిని గావించెను[12]

ఈ సందర్భమున మరియొక అంశమును జూడవలసి యున్నది. గణపతిదేవుని చివరికాలముననే నాగులపాటితో రేచర్ల రెడ్డివంశీకు డయిన కామిరెడ్డి శాసనములు గనిపించుచున్నవి కనుక అంతకుముందుగల కాలము పూర్వమో- యిప్పటనో బేతాళనాయుడిచ్చట యధి పతియై యుండవచ్చును కొందరు భావించునట్లుగా గణపతిదేవుని పిన్నతనముననో లేక అంతకుపూర్వమో వెలమనాయకులా యాస్థాన మునజేరి గణపతిదేవుని చెఱ విడిపించిరని జెప్పుటకు దగిన యాధార మేదియు గనిపింపదు గణపతిదేవుని గొలువునందే జేరినట్లు దెలియు చుండగా, అంతకు పూర్వమే యాతనిని చెఱవిడిపించి 'రాయబందీ విమోచక'యని బిరుదు గాంచుట అసాధ్యమైన విషయము ఆ బిరుదు ఆ తరువాత కాలముననే వచ్చియుండవలయునని దోచుచున్నది.

---

**11.** ఈ చరిత్రశోధనలో 'చిట్యాల, అన్నారెడ్డి గూడెములందు' గంగయ **సాహిణి శాసనములు నూతనముగా లభించినవి. వాటి కాలములు. క్రీ.శ. 1253_1256.**

**12.** వె. వం. పు. 2

## II

# దామా, ప్రసాదిత్య, రుద్రానాయుడు

బేతాళ నాయునికి నలుగురు కుమారులు. వారిలో దామా నాయుడు, ప్రసాదిత్యానాయుడు రుద్రమదేవికి సేనాధిపతులై రాజ్యమందు మిక్కిలి ప్రాముఖ్యమునకు వచ్చిరి. గణపతిచక్రవర్తి గతించిన పిమ్మట యాతనికి పుత్రసంతతిలేనందున కాకతీయరాజ్యమునకు ఆతనికూతురైన రుద్రమదేవియే అధికారమునకువచ్చెను కాని కొందరీమె యధికారము చులకనగా భావించి తిరుగుబాటు గావించిరి అట్టివారిలో పొరుగుననున్న దేవగిరి యాదవ రాజ్యము ప్రముఖమైనది దీనికితోడుగా స్వదేశమందలి కొందరు మండలాధిపులును ఈమెకు ఎదురుతిరిగిరి ముఖ్యముగా దేవగిరి యాదవులకు ఆది నుండియు కాకతిరాజ్యాభ్యున్నతి కంటగింపుగానున్నది ఆ యాదవ రాజులీ యవకాశము గ్రహించి ఓరుగంటిపైకి సైన్యములు నడిపిరి దామా, ప్రసాదిత్యానాయకులు ఈ యాదవసైన్యమును పరాక్రమమున నెదిర్చి వెనుకకు దరిమిరి అంతేగాక రాణిరుద్రమదేవి సహితమీ యుద్ధరంగమున కాలిడి యాదవసైన్య సమూహముల దునుమాడెనని దెలియుచున్నది

ఈ పోరు ఒకవైపు జరుగుచుండగనే దక్షిణ దిశనుండి సామంతులైన మూడవకులోత్తుంగచోడ, సిద్ధయ దేవచోడ, కొప్పెరుంజింగ, గంగగోపాలాదులు తిరుగుబాటుగావించిరి ఈ తిరుగుబాటుదారులను కాకతిసేనానులైన త్రిపురాంతక - అంబదేవులు వారెదిర్చి శత్రు నిష్కంటక మగునట్లుజేసియుండిరి. ప్రారంభమున రాణిరుద్రమదేవికి గలిగిన ఈ చిక్కులనన్నిటిని తొలగించి, తిరుగుబాటులనణచి, సింహాసనమందు ఆమెను పదిలముగా నుండునట్లు ప్రసాదిత్యానాయుడు మిక్కిలి కృషిజేసి 'కాకతీయరాజ్య స్థాపనాచార్య, రాయపితామహాంక' వంటి బిరుదులు గాంచె తొంబదిమంది ప్రసిద్ధులైన కాకతీయ నాయకులందు దానొసరమించినట్లు దెలియుచున్నది[1].

---

1. కాకతి రాజ్యస్థాపనాచార్య బిరుదును, రాయపితామహాంక బిరుదును బొంది డెబ్బదియేడ్గురు నాయకులం దానొనరయించి. వె. వం. పుట. 7_18.

అదిగాక ఈ 77 గురి నాయంకరవ్యవస్థయును ప్రసాదిత్యానాయుడే ఏర్పరచినట్లు చెప్పబడుచున్నది. మొత్తముపై 1279 నాటికే శాసనములందీ ప్రస్తావన గానవచ్చుచున్నది గనుక ఈ విషయము కొంత వరకైనను వాస్తవము గావచ్చును[2]

III

## వెన్నమనాయుడు - సబ్బినాయుడు

దామా నాయునికి పుత్రసంతతి ఏడుగురుగలరు వారిలో వెన్నమనాయుడు సబ్బినాయుడనువారు ప్రఖ్యాతులు వెన్నమనాయుడి వీరత్వమునుగురించి కొంత సమాచారము లభించుచున్నది కాకతి రాజ్యంపై 1303 లో ప్రప్రథమంగా జరిగిన తురుష్క దండయాత్రి నితడెదిరించి వీరోచితముగా బోరాడి యుండెనని దెలియుచున్నది. ఈ విషయము వీరి శాసనములందును, వెలుగోటి వంశావళిలోను ప్రస్తావించబడినది[1] ఈ యుద్ధమునకు పూర్వమే ఢిల్లీని పరిపాలించుచున్న సుల్తానాధిపతియైన అల్లావుద్దీన్ ఖిల్జీ దేవగిరి యాదవరాజ్య మాక్రమించియుండెను. క్రమముగా అతనికి దక్షిణదేశముపై చూపుపడినది ఇందుకై 1303 లో 'మాలిక్ ఫకీరుద్దీన్ జూనా' అనువానికి విశేషసైన్యమొసంగి ఓరుగంటిపైకి బంపియుండెను దారిలో విధేయులైనట్టి యాదవులుగూడా వీరికి సహాయము గావించిరి ఓరుగంటివరకు ఈ తురుష్క సైన్యము జేరకపూర్వమే 'ఉప్పరపల్లి' (కరీంనగర్ జిల్లా) అనుచోట వెన్నమనాయుడు, పెంప

'ఎలమి దెబ్బదియేడ్గు రలరారఁ గొల్చిరా,
రుద్రదేవుని యొద్ద భద్రగజము'.
పోతుగంటి మైలిపై చాటువు. చా. ప. మ. P 183.

2. S.I.I. - Vol IV 705 (A. R. E. 254/1892)

1. 'విక్రమే విజయాకారో వీరో వెన్నమహీపతిః
దోర్దండ శాలినాయేన మండలాగ్రేణ ఖండితా
రిపుకుండాల కుండాలీ జయలక్ష్మ్యై కవాయతే'.
(ఉమామహేశ్వరశాసనము. 1376)

పూడి అన్నమంత్రి, పోతుగంటిమైలి తదితర నాయకు లీసైన్యము నెదిరించి వారిని పరాభూతులను గావించిరి[2] తురుష్కసేన లీవీరుల ధాటికి తాళలేక పలాయనము చిత్తగించినవి

IV

## ఎఱదాచానాయుఁడు - నలదాచానాయఁడు

వెన్నమనాయుడికి ఎఱదాచానేడు సబ్బినాయుడికి నలదాచానేడు అను వీరులుద్భవించిరి ఈ ఎఱదాచానేని శౌర్యపరాక్రమములలో కాకతీయులకు సాధించిన కంచి విజయము మిక్కిలి గొప్పది ఈ కాంచీనగరం పూర్వకాలము నుండియు కాకతీయుల విజయములలో చేర్కొనబడుచున్నది కారణం కాంచీనగరం వీరిచే చిక్కుచున్నప్పటికిని తిరిగి వెనువెంటనే జారిపోయెడిది పూర్వం బమ్మసేనాని మొదలుకొని కాకతి సేనానులందరు దాదాపు కంచిపై విజయములు సాధించియే యుండిరి కాని ప్రస్తుత విజయకాలమునకు దేశపరిస్థితులలో కొంత మార్పు ప్రారంభమైనది దక్షిణదేశంలోకి తురుష్కప్రమాదము ఈ కాలానికి తీవ్రతరమైనది మధురనేలుచున్న పాండ్యరాజులలో సుందరపాండ్యు డనువాడు స్వార్థబుద్ధితో తన సోదరుని పైననే ద్రోహము తలపెట్టి ఢిల్లీతురుష్కుల సహాయమున మధుర నాక్రమించియుండెను. దక్షిణదేశంలో తురుష్క స్థావరాలకిది తొలిచర్య యని జెప్పవచ్చును ఆ సమయముననే గండికోట యందును పరిస్థితులు తిన్నగాలేవు కాకతి చక్రవర్తి పెక్కు పర్యా

2. శా. సన్నద్ధప్రసర తురుష్క పృతనా సందోహ నిర్మూలనో
త్పన్నానూన యశుండు విక్రమకళా పారీణ దోస్సారుఁడ
చ్ఛిన్నానేక సమిత్తురంగ విజయశ్రీ భోగ సౌభాగ్య సం
పన్నుండున్నత కీర్తి వెన్నధరణీప స్వామి సామాన్యుఁడే.
వె. వం. పు. 15. ప. 25.

‘నుప్పర వల్లొద్ద నుద్వృత్తిఁ బైపడి
ఢిల్లీ తురుష్కుల త్రుళ్ళడించె।
పోతుగంటి మైలిపై చాటువు. చా. ప. మ. II. P. 183.

యము లేవరకే తురుష్కుల నెదిరించి బలహీనముగానుండెను. సమయ మిట్లుండగా, కాకతీయులు తమకు జేసిన సహాయముగూడా మరచి పాండ్యులు తిరిగి కంచి నాక్రమించుకొనిరి

ప్రతాపరుద్రుడు ఈ పర్యాయము పాండ్యుల నెదిరించుటకై ప్రసిద్ధ సేనానులైన ఎఱదాచానేనిని ముప్పిడినాయకుని, కొలని రుద్రదేవుల సమిష్టిగా 1316 లో కంచిపైకి బంపియుండెను ఎఱదాచానేని కుమారుడైన I సింగమనేడుకు ఈ యుద్ధమున శాల్గొనియుండెను ఈ కంచి యుద్ధములో ఎఱదాచానేని గనబరచిన సాహస పరాక్రమములు అసామాన్యమైనవి భీకరమైన పాండ్యగజదళము నెదిరించి, పంచ పాండ్యులైన వీర, విక్రమ, పరాక్రమ, సుందర మరియు కులశేఖర పాండ్యులను జయించి కంచి నవలీలగా సాధించియుండెను.[1] ఆ సమయమున నే ఎఱదాచానేడు నెల్లూరి ప్రాంతములందు గల మన్నెనాయకులను జయించి, గొట్టిపల్లికి కుంటూరి యిమ్మడినిగూల్చి విజయములు గైకొనినట్లు తెలియుచున్నది

ఇతడు జూపిన పరాక్రమ సాహసములకు ప్రతాపరుద్రుడు మెచ్చుకొని, 'పంచపాండ్యదళవిభాళ, పాండ్యగజకేసరి, కంచికవాట చూఱకార' యను బిరుదు లొసంగి గౌరవించియుండెను ఈ బిరుదులు శాసనస్థములు కాక చిరకాలము నుండియు వాడబడుచున్నవి

ఈ మహావీరుడు జీవించిన దంతకాలమో సరిగా తెలియదు కాని 1320 లో జరిగిన తురుష్క దండయాత్రలో కొలచలమపురి (మెదకుజిల్లా) వద్ద ఆ సైన్యము నితడు ఎదిరించియుండవచ్చును.

---

1. 'వెలయు బ్రతాపరుద్రునృప విశ్రుతి కెక్కు భటా? చూడఁగాఁ
జలమునఁ గుంతమందుకొని చయ్యన వచ్చు గజంబు నోర్చి దో
ర్బల భుజవిక్రమంబునను బైకొని తా జయలక్ష్మిఁ జేకొనన్
గెలిచెను పాండ్యరాజ గజకేసరి దాచయ శౌరి పాండ్యులన్.

వె. వం. పు. 12. ప. 36.

ఈతని తృతీయ కుమారుడైన ఏచమనాయుడి ప్రస్తావనయును కొంతగనిపించుచున్నది.[2] అటుతరువాత జరిగిన తురుష్కదండయాత్రలలో దేనియందైనను ఈతడు నిహతుడైయుండునేమో. ఓరుగంటి పతనము తరువాత ఎఱదాచానాయుని ప్రస్తావన మరి గనిపించదు

V

## 1 సింగమనేడు

ఎఱదాచానేనికిగల ముగ్గురు పుత్రులలో సింగమనేడు, వెన్నమనాయుడు, ఏచమనాయుడు, నలదాచానేనికిగల పుత్రులలో మాధవనాయుడు మరియు దామానేడు ముఖ్యులుగానుండిరి ఇక సింగభూపాల నామధేయులలో ఎఱదాచానేని పుత్రుడైన ఈ సింగమనేడే రాచకొండ వంశచరిత్రలో ప్రథమ వ్యక్తిగా జెప్పవలసియున్నది. ఈ సింగమనేని కాలంలోనే కాకతిరాజ్యమున చారిత్రకమైనసంఘటన లెక్కువగా జరిగియున్నవి ముఖ్యముగా మూడు శతాబ్దములపైబడి మహాంధ్ర సామ్రాజ్యమును పరిపాలించిన కాకతిరాజ్యమింతటితో అంతరించి తిరిగి స్వతంత్ర రాజ్యములు తలయెత్తుట ఈ పరిణామములలో ముఖ్య విషయము.

సింగమనేనివరకు ఆతని జీవితకాలంలో కొంతభాగం కాకతిసేనాపతిత్వము, మరికొంతకాలం స్వయం రాజాధిపత్యము సమకూడియున్న కాలమీతనిది ఈ రెండువిధములైన సంఘటనలయందును సింగమనేడు జూపిన పరాక్రమ శౌర్యములు గణింపదగియున్నవి.

సింగమనేడింతకుపూర్వమే తండ్రితోబాటుగా కంచియుద్ధమున బాల్గొని విజయ కారకుడైనందుననేమో – ప్రతాపరుద్రుని మెప్పు

2. '[దోరాజ] ఖడ్గధారన్ దునిమెఁ దురకలం దోలి తత్సైన్యరాజీ
ఘోరాజీ ధాటిచెల్లన్ గొలచలమ పురిన్ ఘోటికాకోటిఁ జెప్పెన్.'

సహితము అందుకొనియుండెను.[1] ఈ విజయమేగాక కాకతిరాజ్యమునకు సింగమనేడు సాధించిన మరియొక విజయము గనిపించుచున్నది కంపిల నేలుచున్న కుమారరాముడు ప్రతాపరుద్రునిపై నిష్కారణమైన వైరభావమువహించి కాకతిరాజ్యమునగల ముద్గల్లు నాక్రమించి పరిపాలింపదొడగెను ప్రతాపరుద్రుడీ కంపిలి రాముని గర్వమణచుటకై 1320 లో సింగమనేనిని, బెండపూడి అన్న మంత్రిని ఆతనిపైకి బంపియుండెను

సింగమనేడీ కంపిలిరాముని 'కుమ్మటము'ను చోట యాతని సైన్యములదాకి యోడించివేయగా కుమారరాముడు సంధిజేసుకొని నష్టపరిహారముగా 6,000 ల గుఱ్ఱములు సమర్పించుకొన్నట్లు దెలియుచున్నది కర్నాటభాషలోగల 'కుమార రాముని చరిత' మరియు ద్విపద బాల భాగవతమందును ఈ వివరములు కొన్ని గలవు. బాల భాగవత మనుసరించి కుమారరామునిపైకి ప్రతాపరుద్రుని స్వాయత్తుడైన కోటికంటి రాఘవుడును ఈ యుద్ధమున బాల్గొనియున్నట్లు దెలియుచున్నది [2]

---

1 'లాలిత శౌర్యశక్తి నవలక్ష తెనుంగు దళంబువాజిలోఁ
దోలిన పాండ్య ఘూర్జరుని తోకి పెనుంకువకోర్చి సన్నుతిన్
వాలి ప్రతాపరుద్రునిచె వర్ణనకెక్కిన యెఱ్ఱదాచ భూ
పాలసుతుండు సింగని కళింగుని కేబిరుదైన దెల్లదే'

వె. వం. పు. 13. ప. 41.

2 'హరికాంతబోలు సూరా భిక్షయ దు
మనశౌర్యుఁడై కోటికంటి రాఘవుని
గనియెనతండు స గ్రామంబునందు
రాజిల్లు కంపిలి రాయసైన్యములఁ
దేజంబు మెఱయంగఁ దెగువమైగెల్చి
గరిమె గైకొనియె సగండర గూ?
బిరుదంబు పరిన్నృపుల్ బేర్కొని పొగడ.'

(ద్విపద బాలభాగవతము Mac Mss. 13-2-19. P. 284 & Forther Sources of Vijayanagara History P. I.)

సింగమనేడీవిధముగా తన ప్రభువుకిట్టెన్నియో విజయములు సాధించియున్నందున ప్రతాపరుద్రుడు మిక్కిలి సంతసించి ఈతనికి ఆశీతి (80) వరము లొసంగినట్లు ఒక యైతిహ్యము గనబడుచున్నది. సింగమనేనికి ఆ తరువాతనే ఆశీతివరాల సింగమనేడనియు ప్రఖ్యాతి గలిగినది.

కాకతి సామ్రాజ్యానికి ఆ తరువాత దశలో కష్టకాలము సంప్రాప్తమైనది. ఉత్తరమునుండి పదేపదే తురుష్క దండయాత్రలు కొన్ని వచ్చిపడుట దీనికి ముఖ్యకారణము మరియొకవైపు స్వదేశము లోని తిరుగుబాటులును దీనిని బలహీనపరచుటకు కారణమైనవి. ఈ పరిస్థితు లిట్లుండగా, కంపిలి విజయమప్పటికి పూర్తియయ్యెనో-ఇంకా లేదో 1320-21 మధ్యకాలములో తురుష్కసేనలు తిరిగి ఓరుగంటిపై వచ్చిపడినవి. అతి ధైర్యసాహసముతో కాకతిసేన లీ తురుష్క సైన్యము నెదిరించుటచే వారి కాపర్యాయము పరాభవము తప్పినది కాదు. కాని తురుష్కసైన్య మిట్లు ఓటమిజెందినను తమ ప్రయత్న మును వారు విరమించలేదు కొద్దికాలమే వారట్లు వెనుదిరిగిపోయి నను తిరిగి 1321-22 లో ప్రచండ సైన్యమును గైకొని ఓరుగంటి కోటను ముట్టడించిరి ప్రతాపరుద్రుని హ్రస్వభావమో - మరి యేకారణముననో ఆతడీ తురుష్క దండయాత్రా ప్రమాదమును సరిగా లెక్కించి యుండలేదనియే దెలియుచున్నది.[3] దీనికితోడు అంతకుముందే రాజధానియందుగల నాయకుల నందరిని స్వప్రదేశ ములకు బంపివేసి యుండెను

ఈ చర్య ప్రమాదమునకు కారణమైనది కోటలోనున్న వా రెంత బోరాడినను బయటి సహాయము వారి కందుటలేదు తురుష్క-

---

3 ఖుతుహాస్సలాతీన్ (ఈసామి) క్రీ. శ. 1341 లో అల్లావుద్దీన్ హసన్ గంగుకు అంకిత మీయబడిన గ్రంధము. అప్పటి వాస్తవపరిస్థితుల నది (Eye-witness) సరిగా తెలుపుచున్నట్లు చారిత్రకుల భావన. ప్రతాపరుద్రుని యోటమికి ముఖ్యకారణము ఆతని హ్రస్వభావమనియే దెలుపబడుచున్నది. కాని స్వదేశ చరిత్ర లీ విషయమున గండికోట తిరుగుబాటు, బొబ్బరెడ్డి విద్రోహము నెత్తిచూపుచున్నవి. ఈ విషయంలో ఏకాభిప్రాయము గానవచ్చుటలేదు.

లీ విషయమున మిక్కిలి జాగరూకత వహించిరి. పద్మనాయకులు, అన్న మంత్రి[4] మొదలైన వీరశిఖామణు లెంత బోరాడినను దుర్వి పాకము దప్పినది గాదు కాకతిరాజ్య యదృష్టదేవత దొలగిపోయి ప్రతాపరుద్రుని వారు జెఱబట్టుకొనిపోయిరి.

## తెలుగుదేశస్థితి

కాకతి సామ్రాజ్యము బడిపోయినవెంటనే ఆంధ్రదేశము యావత్తును ఢిల్లీ తురుష్కుల వశమైనది. ఆ తరువాత వారు ఓరు గంటికి 'సుల్తాన్‌పూరని' పేరుపెట్టి పరిపాలనకై వారు మాలిక్ లను అమీర్లనువారిని నియమించిరి. ఈ అమీర్ల పాలనలో దేశ మానాడెట్లుండెనో విలస శాసనము జక్కగా దెలుపుచున్నది[5]

---

4. 'కాకితేశుఁడు మెచ్చ గలుకోట వెసఁగాచి యవనేశులను దున్మినట్టి యితఁడు సులతాను దగనోరుగలు చుటుముట్ట నెక్కువలీలఁ దానె కల్కోటఁగాచె.'
(శివయోగసారము. కా. సం.)

5. వీకోద్భట భటస్సోపి వీరరుద్ర ప్రతాపవాన్। అజయత్ప్రాప్త కృత్యస్తం నవలక్షాశ్వసాధనం [17] నీతి ప్రశస్తోపి బలాధికోపి సహాయ యుక్తోపి చ వీర రుద్రః। భాగ్యక్షతే ర్మానుష మండలస్య తురుష్కభర్తు ర్వశతామయాసీత్॥ సనీయ మానో నగరీం స్వకీయాం ఢిల్లీప్రయత్నా ద్యవనేశ్వరేణ। సోమోద్భవాయాః సరితః ప్రతీరే దైవా దయాసీ త్రిదశాధి వాసం॥ ప్రతాపరుద్ర త్రిగ్మాంశౌ లోకాంతరిత్ రోహితె। తురుష్కాంధత మిశ్రేణ పరంపరాస్తో రిపూ నధర్మో యవనాన్ గతోను। నోచేన్మి తేస్మిన్ యవనై సహైవ కథం నిరాబాధ సుఖం జ జృంభే॥ కేచిద్ధనాఢ్యాః పరిబాధ్య మానా ధనాయ పాపై ర్వివిధై రుపాయైః। కేచి న్నిరాశ్రైవచ పారశీకాన్ పర్యత్యజ స్ప్రాణ న భస్వతోన్యే॥ ద్విజాతయ స్త్యాజిత కర్మబంధా భగ్నాశ్చ దేవ ప్రతిమా సమస్తాః। విద్వద్వరిష్ఠై శ్చిరకాలభుక్తా నర్వేవ్యపాహో రిషితాగ్ర హారాః॥ ధనదారా(దికే) నృణాం కశ్మిం శ్చిదపి వస్తుని। స్వాయత్తతా మతిర్నాభూ ద్భువిత స్యాం మహాపది॥ (పేయా) సురా గోపిసితం చ భోజ్యం లీలా విహారో ద్విజఘాత నంచ। ఆ క్రాంత మాసీ ద్యవనాధమానాం కధం న్ను జీవే ద్భువి జీవలోకం॥ ఇత్థం త ర్యవనభటైః ప్రబాధ్యమానం తైలింగం ధరణీతలం సురారి కల్పైః ।... ఏ పీడితా స్తురుష్కై రనారతం మానుషాఘోరం। తేతానేవ నిజఘ్ను ర్బలమాశ్రయజం

'ప్రజలపై అపహాజము - అక్రమమునై, భరింపరాని పన్నుల నెన్ని టినో వేసి పీడింపసాగిరి దేవాలయములను, అగ్రహారములను కొల్లగొట్టి బ్రాహ్మణులను హింసించిరి ఆ మహా విపత్కాలమున ప్రజలకు స్వాయత్తమను భావములేకపోయినది. కల్లుత్రాగుట, కృషీవలులకు మూలాధారమైన గోవును జంపుట, బ్రాహ్మణుల వధించుట ఆ యవనాధముల వృత్తి'యని ఆనాటి దేశస్థితిని వర్ణించుచున్నది

ముఖ్యముగా హైందవజాతి జీవనము కేవి యావశ్యకములో, ఏవి పవిత్రములో వాటిని భగ్నపరచుటయే వారి యాశయమైనది ఇది నాటి ప్రజలను, వారి నాయకులను మిక్కిలి కలవరపెట్టిన

---

మహాతుభ్యాతం॥ ఇద్ధం పరాన్య ప్రబలం ప్రపంచం యూపనం బలి । నష్టపాపాని కష్టాయాం ధర్మపునర్వివృతతె॥ (35)

(సంక్షిప్త విలసతామ్రశాసనము. No EP Ind Vol 32 P 239 to 268, A Forgotten chapter of Andhra History, P 101 to 110)

శాసనమందున్న ఈ విషయములేగాక అలెగ్జాండర్ రే వంటి పాశ్చాత్యపండితులేమి వ్రాసిరో గూడా గమనార్హమగుచున్నది

"As a proof of their destruction of Temples no evidence other than the mosque at Rajamahendravaram ..This is one of the oldest of the Muhammadan mosques in the presidency (Madras), having been built in A D. 1324 by Muhammad Tughlak shah who, after capturing the fort at Kondapally after six months continues trouble, entered a temple here, and after massacring some of the officiating brahmin priests, had this mosques built on the ruins of the desolated pagoda, and began to establish Muhammadan worship there Muhammad b n Tughlaq converted an important Hindu Temple in to a mosque to symbolise the victory of the faithfull over the infidels According to treditional accounts it was originally the temple of Venugopala Swamin, built by an Eastern chalukyan monarch of Vengi It is likely that many of the temples of the chalukyan and kakatiya periods in Telangana shared the same fate as the above one. That the mosques at Ellore, and at Bikkavole were originally Hindu temples is attested to by the Hindu epigraphs there

(Alexander Rea. Suptd of Archaeology, Annual Report 1910–11. PP. 18–19, A Forgotten chapter of Andhra History P. 21–22.)

విషయము ఎట్లైనను, ఎంతటి త్యాగమైనను గావించి తురుష్కుల నీదేశమునుండి తరిమివేయవలెనని నాయకులందరును నిశ్చయించుకొనిరి కాకతి నాయకులలో మిగిలినవారు ఒకచోట సమావేశమై ముసునూరి ప్రోలయ నాయకుని నాయకునిగా ఏర్పరిచి స్వాతంత్ర్య సముపార్జనా భారమును ఆతనిపైనుంచిరి

కాకతిరాజ్య పతనానంతరము హిందూ నాయకుల తొలి శాసనములు క్రీ. శ. 1325, 1326 లలో గానవచ్చుచున్నవి.[6] అనగా ప్రథమ ఘట్టమునందీ పోరాటము కోస్తాప్రాంతమున ప్రారంభింపబడి 1326 నాటికి యీ ప్రాంతములనుండి తురుష్కులను ప్రోలయ నాయకుడు పారద్రోలగలిగెను ఈపోరాటంలో తెలంగాణమును విముక్తిపరచవలసి యున్నది గనుక రాజమహేంద్రవరమునుండి తన రాజధానిని భద్రాచలంతాలూకా 'రేకపల్లి' యను స్థలమునకు మార్చుకొనియుండెను ప్రోలయ నాయకుడు దీర్ఘకాలము పరిపాలించినట్లు గానవచ్చుటలేదు. తన భారమంతయు సోదరుడైన కాపా నాయకుని యందుంచి రాజ్యమతనికి అప్పగించియుండెను

## అద్దంకి - కొండవీటిరాజ్యము

తురుష్కులను పారద్రోలుటలో ప్రోలయ నాయకునితో పాటు అద్దంకిని పాలించిన ప్రోలయ వేమారెడ్డి ముఖ్యులలో ఒకరు. ఈతని స్వతంత్ర పరిపాలన 1325 లోనే ప్రారంభమైనట్లు ఆతని మల్లవరపు శాసనము తెలుపుచున్నది.[7] చరిత్రకిది ముఖ్యశాసనము. ఈ శాసనములో వేమారెడ్డి 'మ్లేచ్ఛాబ్ధి కుంభోద్భవు'డని పొగడబడియుండెను. ఈ ప్రోలయ వేమారెడ్డికి కుడిభుజముగా పనిచేసినవాడు ఆతని సోదరుడైన మల్లారెడ్డి స్వాతంత్ర్యసమరమందీతడు అధికముగా పాల్గొనియుండెను. ఎఱ్ఱనకవిని రెడ్డిరాజ్యమునకు పరిచయము గావించినదితడే మొత్తముమీద నొక శతాబ్దికాలము ప్రభువులు కొండవీడును పాలించి హిందూధర్మమును నిలుపుటకు పాటుబడియుండిరి.

---

6. EP. coll. No. 308 of 1916. A. R. E 1916. P 53
7. EP. Ind. Vol. XXV. P. 139. f n. 5.

## విజయనగరరాజ్యము

కాకతీయుల కాలంలో పూర్వము చిన్న రాజ్యముగానున్న కంపిలి దేశమనునదియే విజయనగరరాజ్యముగా యావిర్భవించి యున్నది. ఓరుగంటి పతనంలో జెఱబెట్టబడిన హరిహరరాయలు[8] కంపిలి తిరుగుబాటులో తుగ్లక్ వలన చెఱనుండి విడువబడి యాతని ప్రతినిధిగా కంపిలిరాజ్యమును పాలించుటకు బంపబడియుండెను. కాని దేశమానాటికే తురుష్క సమూహమును పారద్రోలి స్వేచ్ఛా వాయువులు బీల్చుటకు సిద్ధముగ నున్నది. హైందవ రక్తము, హైందవాభిమానము హృదయమునందు నిలచియున్నది గనుక బలవంతముగా నాతనికి తురుష్కులు మతమిచ్చినను దానిని దిగవిడచి, ప్రాతినిధ్యము వదలి, స్వాతంత్ర్యము ప్రకటించి విద్యారణ్య యతీంద్రుల కృపాభిక్షతో తుంగభద్రా నదీతీరమున 1336 లో విజయనగర మను పట్టణము నిర్మించి విజయనగరరాజ్యము నీతడు స్థాపించెను అచిరకాలముననే ఈ రాజ్యము మిక్కిలి విస్తరించినది.[9] పాలించినది కర్నాటకులైనను, యాంధ్రభూమిగనుక, హైందవ ధర్మరక్షణమే వీరియాశయముగనుక వీరిని యాంధ్రులే యని అన్నను విపరీతము ఉండదు దక్షిణాంధ్ర దేశమున విజయనగరరాజ్యము, కొండవీటి రాజ్యములు ఏర్పడుటవలన ఓరుగంటి స్వాతంత్ర్యపోరాటమునకు అమితమైన సహాయము అందసాగినది

## ప్రథమాంధ్ర స్వాతంత్ర్య పోరాటము

కాకతీయ మహాంధ్ర సామ్రాజ్యం కూలిపోయి తురుష్కుల వశమైన వెంటనే దేశమేపరిస్థితిలోనున్నదో, ప్రజల కష్టసుఖాలేమిటో ముఖ్యముగా హైందవజాతి మనుగడకెట్టి ముప్పు వాటిల్లినదో ఉద్వేగ పూరితముగా జెప్పిన యా విలస శాసనపు మాటలు చూచినవారికి దెలియక మానవు. ఆంధ్రదేశము యావత్తు ఆ యవనులు బెట్టిన బాధలకు తల్లడిల్లిపోయెననుటలో ఆవంతయును సందేహములేదు.

---

8. ఒక యైతిహ్యము.

9. Atakalagundu Ins (1339. A D) Mac, MSS 15-4-27

తురుష్కులు గావించిన ఆ అకృత్యాలకు బలియైన పవిత్రస్థలాలెన్నో పూర్వచరిత్ర దర్శనమునకై నేటికిని నిలచియున్నవి.

ఈ స్థితిలో యవనులు గావించిన అమానుష కృత్యాలన్నిటికి ప్రజలెప్పుడైతే గురిగావలసివచ్చినదో, ఆనాడే ఆ యవనులన్న యెడల జుగుప్స, ద్వేషము, ప్రతీకారము అన్నీ వారిలో కలుగసాగినవి. సాధారణముగా రాజకీయాధికారముతో సంబంధము లేకనే జీవించే సౌమ్యలక్షణము మనవారిది కాని ఆ సౌమ్యుల మనుగడకే ముప్పు ఏనాడు గలిగినదో, అది ఏ ప్రభుత్వమైనాసరే ఎదురాడక తప్పదు. తురుష్కులకు రాజకీయాధికారముకన్నను - మతవ్యాప్తి, హైందవ వ్యతిరేకత ఆశయమైనట్లు పెక్కు సంఘటనలు రుజువు పరచుచున్నవి గనుక, ఈ స్థితి వారెప్పుడు గుర్తించిరో, ఆనాడే వారిలో తురుష్క ప్రభుత్వమును తరిమివేయుటకై విప్లవభావము లంకురించినవి తత్ఫలితమే స్వాతంత్ర్యపోరాట ప్రారంభము ఆంధ్రుల స్వాతంత్ర్యదీక్షకిది ప్రథమ సోపానము ఈ పోరాటమునకు నాయకత్వము వహించినవారు పూర్వ కాకతి మహాప్రధానులైన కొలని రుద్రుడు, అన్నయమంత్రి, I సింగమనేడు మరియు ప్రోలయ నాయకుడు, వేమారెడ్డి మొదలైనవారు ముందునకు వచ్చిరి [10]

కాకతీయుల కాలంలో పనిచేసిన 75 మంది నాయకులలో పైని దెలిపిన ముగ్గురు ప్రధానులుదప్ప తక్కిన నాయకులెవరు జీవించియున్నట్లు ఆధారములేదు. తురుష్కులచేవారు చంపివేయ బడుటయో, చెఱబెట్టుటయో జరిగియుండునని చారిత్రకుల విశ్వాసమై యున్నది అది నిజమే కారణం అటుతర్వాతనైనను ఈ నాయకుల

---

10 Rudhadeva with his old colleague Annamantri, gathered together the decscedents of the ancient Mahasamanta and Mandalika families of prolayanayaka of Musunuri family, prolayanayaka of Koppula family, Vema of the Reddy family, Singamanayaka of Recherla family, Ganapathinayaka of Manikonda family to come together for the commen perpose of rescuing the country from the Muslim domination. A Forgotten chapter of Andhra History. P. 31.

ప్రస్తావన మరిఎక్కడనైనను గనిపింపదు ఈ నిశ్చయానికి బలమైన కారణము అదియే గావచ్చును

మరియొక అంశమేమన తురుష్కులచేత ప్రతాపరుద్రుడు బందీయైనవెంట సింగమనేడును మరికొందరు నాయకులుగలసి యాతనిని చెఱవిడిపించిరని చిరకాలమునుండి యొక యైతిహ్యము వినవచ్చుచున్నది కానిదానికి దగిన ఆధారములేమియు గనిపించుటలేదు ఒకవేళ అదేనిజమైనచో ఈ స్వాతంత్ర్యపోరాటంలో ప్రథమఘట్ట మిదియేగావలసి యుండును సింగమనేనికి సంబంధించినంతవరకు యాతనికిగల బిరుదులలో 'రాయబందీ విమోచక' యనునదొకటి గానవచ్చుచున్నది [11] మరియు ఓరుగంటి నగరపాలకుడైన నాగయగన్న మంత్రికిని 'నీతి యుగంధరుడని' బిరుదమొకటిగలదు ప్రతాపరుద్రీయమువంటి కథ లిటీవలివైనను పై యైతిహ్యమునకు - ఈ బిరుదులకేమైన సంబంధముగలదో - లేదో జెప్పుట మిక్కిలి కష్టమైన విషయము కాని ప్రతాపరుద్రుని తరువాత యొక శతాబ్ది కీవల అనగా 1423 లో వచ్చిన అనితల్లి కలువచేఱు శాసనములో 'తస్మిన్ ప్రతాపరుద్రే స్వేచ్ఛయైవ యాతవతి' అని చెప్పిన మాటలు కొంత అర్థాంతర మొసంగి చర్చలకు వచ్చినవి [12] దానికితోడు 1326 లో కొలనిరుద్రుడు ప్రతాపరుద్రుని పుణ్యార్థమై సంతమొగులూరులో వేసిన శాసనము సహితము అంతవరకాతడు జీవించెనేమోయని సందేహము గల్పించినది [13] కాని విలస శాసనము తరువాత ఈ అభిప్రాయము నిలువజాలదు ముఖ్యముగా పై ఘట్టములన్నియు స్వాతంత్ర్యపోరాటమునకు పూర్వమే జరిగినవై యుండును ఏమైనను కాకతి వృద్ధనాయకుల ఆశీస్సుల వలననే, నాయకులలోగల సమైక్య భావముచేతనే, 1325 నాటికి ఈ పోరాటము ప్రారంభ

11. గణపతిదేవుని చెఱవిడిపించుకాలానికి ఈతని పూర్వీకుల కీ బిరుద మున్నట్లు గానవచ్చుటలేదు.

12. కలువచేరు శాసనము (1423) A S P. P Vol IV P 93 to 112.

13. సంతమొగులూరు శాసనము (1326) EP. Coll. No. 308 of 1916 & A R E 1916 P 53.

మైనది[14] కోస్తా ప్రాంతములో ముందే పోరాటము ప్రారంభింపబడి క్రమముగా నది ఓరుగంటిని దాకి యా ప్రాంతమును తురుష్కుల నుండి విముక్తిపరచినది ఓరుగంటి స్వాధీనమునకై కాపయనాయకు డధ్వర్యము వహించి, హొయసలరాజైన III భల్లాలుని సహాయము గైకొని, సింగమనేనితో గలసి 1336 నాటికి దానిని ఆక్రమించిరి[15] అనగా కాకతిరాజ్య పతనానంతరము ఒక దశాబ్దమునకు తిరిగి తెలుగు పతాకమచ్చట ఎగురవేయబడినది ఈ పోరాటంలో ఆంధ్ర సురత్రాణ కాపయనాయకుడు ప్రముఖమైన కృషి సాగించియుండెను

## సింగమనేడు - కాపానాయకుడు

సింగమనేని జీవితములో స్వాతంత్ర్య పోరాట మొక మలుపు వంటిది పోగా మిగిలిన చరిత్ర గల కాకతి నాయకులలో ఈతడు మాత్రమే మిగిలినవాడు ఓరుగంటి రాజ్యమున కాపానాయకునికిగల ప్రతిపత్తి ఏమిటో బొత్తిగా తెలియదు. అయినా సింగమనేనితో గలసి ఈతడా ప్రదేశమును తురుష్కులనుండి వశపరచుకొనగలిగెను సింగమనేనికి అంతకుపూర్వమే పైతృకమైన పిల్లలమఱ్ఱి రాజ్యము ఉండుటవలన కాపానాయకుడు ఓరుగంటిలోను, సింగమనేడు తన పూర్వప్రాంతమును పరిపాలించుచుండిరి కాని 1326 నుండి 1361 వరకు సింగమనేనికి సంబంధించిన శాసనము లేమైనా దొరికియున్నచో ఈ పోరాటవిషయమున వీరి భాగస్వామ్య మేమిటో సరిగా దెలియ గలిగియుండును. అప్పటివరకు ఈ ఇరువురి నాయకుల గురించి వ్యాఖ్యానము జేయుట సాహసకార్యమగుచున్నది

ఈ స్వాతంత్ర్య పోరాటంలో తెలుగు నాయకులందరు ఒకరితో నొకరు సహకరించుకున్నను తమకుగల రాజ్యాధికార విషయ

---

**14.** ప్రోలయ వేమారెడ్డి మల్లవర శాసనము. (1325 A.D )No E I VIII P. 14. V-9.

15. Singamanayaka, who had served under Kakatiya pratapa-rudra in the last years of his rule, must have co-operated for the time being with kapaya and other nobles of the Telugu country in the war of indipendence in 1336–37 A D.

A Forgotten chapter of Andhra History, P 73.

ములో సర్వస్వతంత్రముగనే వారు వ్యవహరించుచుండిరి ఒక్క కలువచేఱు శాసనముదప్ప తక్కిన శాసనములన్నియు తెలుగు రాజ్యముల స్వతంత్రప్రతిపత్తినే జాటుచున్నవి. ఈ శాసనమైనను, కాపానాయకుని తరువాత, రెడ్డిరాజ్యము చివరిలోగాని వచ్చియున్నదిగాదు ఇందులో కాకతి నాయంకరములైన 75 ప్రదేశములు, ఆ వ్యవస్థ లేని కాలములో కాపానాయకునికి సామంతములని జెప్పుట జూడ మిక్కిలి ఆశ్చర్యముగ నున్నది[16] పోనీ పూర్వశాసనములైనను, లేక తదుత్తర గాథలేవైనను ఈ విషయమును బలపరచజాలవు ఈ శాసన మింకనూ పరిశీలనార్హమని అభిప్రాయము మొత్తముపై ఈ శాసనమం దెట్లున్నను కొండవీటిరాజ్యము, రాచకొండ రాజ్యములు సర్వస్వతంత్రముగనే పరిపాలింపబడుట సుప్రసిద్ధము కాపయనాయకుడికి ఇవి సామంతములనుట పై శాసనము ననుసరించి మాత్రమె కాపయ నాయకుని శాసనములు జూచినయెడల ఆతనికి 'ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణ' వంటి బిరుదులు వాడబడినట్లు గానవచ్చుచున్నది.[17] రాచకొండవారికిని ఆంధ్రదేశాధీశ్వరయను బిరుదమున్నది.[18] కాని 1365 కు పూర్వమీ బిరుదుగల వీరి శాసనములు లభింపలేదు [illegible] ననుసరించి జూచియున్నచో ఆంధ్రదేశాధీశ్వరయని బిరుదు వాడు కొన్న వారెవరును కేంద్రాధిపత్యము వహింపలేదనియు, ఆ బిరుద మట్టి అధికారసూచకముగానే గాదనియు తేటపడుచున్నది. కాని కాపానాయకుడుమాత్రము ఓరుగంటి నాక్రమించిన వెంట కాకతి చక్రవర్తివలెనే కేంద్రాధిపత్యమునకై కొంతవరకు ప్రయత్నించి యుండునని జెప్పవచ్చును దీనికొరకై ఆతడు పద్మనాయకరాజ్యమైన

---

16. అథపంచోత్తర సప్తతి నాయక సంసేవ్య మానపదపద్మః ।
కాపావనీశ్వర శ్రీవిశ్వేశ్వర కరుణయా క్షితమరక్షత్ (30)
—కలువచేఱు శాసనము. A. S. P. P Vol. IV P. 93 to 112

17. గణపేశ్వర శాసనము క్రీ. శ. 1346, S I I Vol. IV- No. 950, ప్రోలవరశాసనము క్రీ. శ. 1345, C P No 30 of 1934-35, పిల్లలమఱ్ఱి శాసనము క్రీ. శ. 1357, I. T D N. D No 40. P. 113. FF.

18 రాచకొండదుర్గ శాసనములు 1365 to 1380. A. D.

పిల్లలమఱ్ఱి నాక్రమించుట ఈ వాదమును కొంత బలపరచుచున్నది.[19] కాపానాయకుడు పిల్లలమఱ్ఱి నాక్రమించుటలో స్వాతంత్ర్యమునకై పోరాడిన యిరువురు హిందూనాయకులమధ్య స్పర్థలు హెచ్చుటకు కారణమైనది. కాకతీయ రాజ్యములో తుదిసేనానియైన సింగమనాయకుని కాపానాయకుడు పెణచివేయుగోరుటలో ఈ విషమ పరిణామముల నాతి డెదుర్కొనవలసి వచ్చినదని చెప్పవచ్చును.

సింగమనేడు సమయంలో ఎల్లిదగ్గ నైకొనకనే ముందు రాజ్యవిస్తరణకై కృష్ణా తుంగభద్రానదుల నడుమనున్న ప్రాంతములనన్నిటిని జయించి తన రాజ్యమును గెలుపుకొనసాగెను. రాజధానికై పూర్వప్రాంతము తమకు అనుకూలముగా లేనందున రాచకొండలో దుర్గనిర్మాణమొకటి ప్రారంభించి తగిన బలములనచ్చట సమీకరణ గావించెను.

కాపానాయకుడు ఈసమయంలో ఢిల్లీసుల్తానుపై తిరుగుబాటు జేసిన బహమనీసుల్తానుకు సహాయమందించి వారి రాజ్యస్థాపనకై కొంత తోడ్పడియుండెను. కాపయనృపునిలో ఢిల్లీప్రమాదము తన రాజ్యమునకు తగ్గును గదాయని గావచ్చును. కాని తురుష్కులతో తురుష్కులకు బడకున్నను హిందూరాజ్యమునకు సహాయము జేయుటలో వారు వ్యతిరేకులే యని ఆతడు గ్రహింపలేదు. అల్లావుద్దీన్ సింహాసన మలంకరించగనే తెలంగాణమును జయించుట కాతడు బయలుదేరి కాపయను ఓడించి పిల్లలమఱ్ఱి, అమరావతి వరకు దండయాత్ర సాగించి అక్కడ గల ప్రసిద్ధ దేవాలయములను కొల్లగొట్టి వైచెను.[20]

---

19. 'స్వస్తి సకలగుణాలంకార ఆంధ్రదేశాధీశ్వర పరనారీసహోదర **అనుమనగంటి పురవరాధీశ్వర చోడరాయ స్థాపనాచార్య కాంచీరక్షపాలక విషమదాడి పాంచాల ఇదువెత్తం గండ గండగోపాల మూరురాయజగడ ఇత్యాది బిరుదాంకితు డైన కాపయనాయ్నింగారి ఇష్టభృత్యుండు ఎఱపోతు లెంకంగారు పిల్లలమఱ్ఱిని రాజ్యముచేయుచుండి తత్కాలదేశ విద్వరాలను సురదాణిచేతను ఉపహతి అయితేని అల్యావదీను ....**

**పిల్లలమఱ్ఱి శాసనము క్రీ. శ. 1357. I. T. D. N D. No. 40. P 113.F.**

**20. S. I. I. Vol. VI. 276, I.T.D.H. No. 40. P. 113 F.F.**

బహమనీలకు సహాయమందించుటలో కాపా నాయకుడు పాముకు పాలుబోసి పెంచినట్లైనది తుద కాతడు పశ్చాత్తాపపడినను పరిస్థితులప్పటికి చాలావరకు చేయిదాటిపోయినవి

ఇక పిల్లలమఱ్ఱి విషయంలో క్రోధభావమున నున్న సింగమనేడు తిరిగి ఆ ప్రాంతమును సాధించుటకై కాపయతో పోరాటమునకు సిద్ధపడసాగెను. ఇరుపక్షములకు ఎక్కడో తావు తెలియదుగాని 1357-60 మధ్యకాలమున యుద్ధము జరిగి కాపానేడా యుద్ధములో ఓటమిని జెందినట్లు గానవచ్చుచున్నది.[21] పిల్లలమఱ్ఱి ప్రాంతము ఆ తరువాత సింగమనేనికి వశమైనది.

## సింగమనేడు - జల్లిపల్లి పోరాటము

సింగమనేడు కాపానేనిపై గెలుపు సాధించినను ఆతని యుద్ధకారమున పెద్ద మార్పేమియు గలుగలేదు కాని కాపయకు లోబడిన వారేమొ క్షత్రియులు కొందరు జల్లిపల్లి కోటలో సింగమనాయుని బావమరిదియైన చింతపల్లి సింగమనాయుని బంధించివేసిరి ఈ చింతపల్లి సింగమనాయుడు పోతుగంటి మైలివంశములోనివాడు పరాక్రమవంతుడనియు తెలియుచున్నది[22] క్షత్రియులు గావించిన ఈ పనికి

21. వెలుగి మీ ముత్తాత సింగక్షితీశుండు
కాపక్ష్మాపతి గెల్చె కదనమునను.
వె. వం. పు. 43

22. భీమానాయకుడు




(Contd)

# 1 సింగమనేడు

సింగమనేడు మిక్కిలి కోపించి యు[illegible]ను [illegible]మొటడిగావించెను. క్షత్రియులందరు మూయోపాయము జేసి తత్[illegible]ము జియ్యా'డను వానిచేత ఈ సింగమనాయని బాడపంచి వేసిరి ఈ కారణముగా ఇరగాక మహాసంగ్రామమైనది ప్రాణములు విడుచుటకు పూర్వమే సింగమనేడా వార్త తన కుమారులైన I అనపోత – మాదా నాయకులకు బంపి క్షత్రియుల రక్తముచేత తనకు తర్పణము వదలు నట్లు వారి నాదేశించి కన్నుమూసెను

కాకతి సామ్రాజ్యంలో చివరి నాయకుడైన ఈ యోధుడు, వివిధ రంగములలో, వివిధ చారిత్ర కాలములందు, తన శక్తికొలది పోరాడి – ప్రతాపరుద్రునిచే సంప్రీతుడై, తదనంతరము తెలుగు రాజ్యమును స్థాపించి, దానినెంతో విస్తరించి, చివరకొక అకృత్యమునకు గురియై ప్రాణములు విడిచెను

---

సీ. 'ప్రతిపక్షసుందరీ బంధుర స్తవముల
పసుపు బయ్యెదలకు బాయుతెరువు
రిపురాయభామినీ విపుల ధమ్మిల్లంబు
విరుల నెత్తావికి వీడుకోలు
శాత్రవకామినీ చటుల నేత్రంబుల
కలికి కాటుకలకుఁ గాని వావి
యరిరాయభామినీ యరుణాధరముల
సొబగు వీడెములకుఁ జుక్కతెరువు

గీ. చేసె నాహార ధాత్రినీచే కరారి
వైరిగజభీమ వల్లభేశ్వర కుమార
వనజ హితతేజ। కామినీ జనమనోజ।
బహుంతరాటోప। సింగభూప ప్రతాప।

Mac Mss. No. 15–5–32

VI

# 1 అనపోతానేడు - మాదానాయుడు

తమతండ్రి మోసానికి గురియై జల్లిపల్లి యుద్ధరంగమున నేల కొరిగెనని దెలిసినంతనే చేజెర్ల, మొగుళ్ళూరు ప్రాంతములందు సమరరంగముననున్న అనపోతానేడు మరియు మాదానాయుడు పద్మజులైన తమ పదివేల నాయకులరావించి - ఆరువేల గుఱ్ఱములు, ఏడునూఱుల మత్తేభములు, ఇరువదివేల కాల్బలములు వెంటనడువగా తక్షణమే ఇనుగుర్తి - జల్లిపల్లి కోటలను ముట్టడించిరి. తమ తండ్రి వాక్యములు దలచి - ఆ శవమును దహింపకపూర్వమే అయిదులక్షల అరువదివేల బలముతో ఎదురువచ్చిన కొండమల్రాజు, కొమ్మలదేవు పిన్నడు మరియు మచ్చ ఓబళ్రాజులను అవలీలగా ఖండించివేసిరి హతశేషులందరు జల్లిపల్లికోటలో జేరియున్నందున - అందున్న నూటొక్కరాజుల శిరములు ఖండించి ఏబదియొక్క రాజుల కలుగాన్గలాడించి, మరి ముప్పది ముగ్గురు రాజుల జెరబట్టి, రణదేవతకు బూజించి వారిని బలిబెట్టిరి తమకత్తికి అడ్డు అనునదియే లేక వీరావేశమునుదాల్చి దొరికిన క్షత్రియులనెల్ల, వారికి సహాయపడినవారినెల్ల ఆ సమరాంగణమున నేలగూల్చివేసిరి. జల్లిపల్లి పోరాటమున క్షత్రియులకు సహాయముగా కొందరు రెడ్డినాయకులును బోరాడినట్లు గానవచ్చుచున్నది. వీరిలో ద్వాశతగిరి దుర్గాధీశ్వరులైన పంట ముమ్మడి - పంటమైలారు రాజులగు గోలిమల్లారెడ్డి, పోలూరు పోలారెడ్డి, వినుకొండ మారారెడ్డి, బండి కాటారెడ్డి మొదలైనవారిపేర్లు గనపడుచున్నవి వీరందరును కాపయనాయకునకు సామంతులు గావచ్చును బహుశా కాపయనాయకుని ప్రోత్సాహముగూడా దీనికుండినను యుండవచ్చునేమో పద్మనాయక రాజ్యము లోబరచుకొని కేంద్రాధిపత్యము స్థాపించుటకై ఆతడు జూచియుండవచ్చును. వెలుగోటి వంశావళిలో జల్లిపల్లి రంగమున బాల్గొన్నవారి పేర్లు విస్తారముగా జెప్పబడియున్నవి కాని ఆ పేర్లన్నియును గుర్తించుట కష్టము మొత్తముపై జల్లిపల్లి రంగమున క్షత్రియనిర్మూలనము ఎక్కువగనే జరిగినదని జెప్పవలసియుండును.

## అనపోతానేఁడు - అనవోతారెడ్డి

జల్లిపల్లిపోరాటము 1361లో సమాప్తమైనవెంట తమ నాయకుల నచ్చట అధిపతులుగా నిలిపి అనపోతానేఁడు రెడ్డిరాజ్యప్రభువైన అనపోతా రెడ్డిని దాకియున్నట్లు తెలియుచున్నది దీనికి రంగస్థలము ధరణికోట (అమరావతి) ప్రాంతము. మనకు తెలిసినంతలో పద్మనాయకులకు – రెడ్డిరాజ్యమునకు జరిగినట్టి పోరు ఇదే ప్రథమపర్యాయము. ఈ అంశముపై ఉభయవంశముల శాసనములుగాని – వాఙ్మయముగాని విపులమైన సమాచారమేదియు అంతగా తెలుపుట లేదు కనుక వీరికిగల విరోధకారణమేమిటో తెలుసుకొనుట దుష్కరముగనున్నది జల్లిపల్లి రణరంగమున తమకెదురై నిలచి రెడ్డినాయకులు పోరాడుట కొంతవరకది కారణముగావచ్చును. ప్రస్తుతమీ ధన్నాలకోట బయట అనవోతారెడ్డిని సింగయమాధవు డెదిరింపగా భీతిచే నాతఁడు వెనుదిరిగిపోయెనని, మరియొక స్థలమున పట్టివిడువఁబడెనని జెప్పబడినది[1] అనవేమారెడ్డి కాలమునను ఈ పోరాటము జరిగి సింగయమాధవునిచేత యాతఁడోడింపబడినట్లును గానవచ్చుచున్నది. కాని ఈ యుద్ధము 1377 తరువాతనే జరిగియుండవలయును. కారణమేమన ఈ అనవేమారెడ్డి శాసనమొకటి 1377లో వాడపల్లి

---

1. (a) అనపోతారెడ్డెదిరిన, ఘనుఁడై ధన్నాలకోట కాదనుమున్నే
వెనుదాగుపెట్టి విడిచెను, వినుతింపఁ గరారినాగ విభుఁడు ధరిత్రిన్.

(b) ధన్నాలకోటయొద్ద ననపోతారెడ్డి మానంబు
సిగ్గునఁ బోనాడి రయంబునన్ బఱవ.

(c) ధన్నాలకోటకడ రెండుమారులు రెడ్లవారిని గెలిచి జగనొబ్బగండ
సంగ్రామధనంజయ, రాయవేశ్యాభుజంగ బిరుదుల దెచ్చిన.

(d) సింగయ మాధవుఁజేరిన యనవేముఁ
డోడిపాఱు కొఱంత చూడవైతి.

వె. వం. 15/51, 31/86, 36/99, 39/108

క్షేత్రమున గానవచ్చుచున్నది [2] ఈ శాసనముల ననుసరించి జయాప జయములు నిర్ణయించుట మిక్కిలి కష్టము

ధన్నాలకోట పోరాటముతరువాత అనపోతానేడు కృష్ణానది నంటియున్న చిన్న చిన్న మండలములతోసహా శ్రీశైలము నగరాను స్వాధీనపరచుకొనియున్నది ఈ సందర్భముననే గావచ్చును శ్రీశైల పర్వతమునకు సోపానములును వీరు గట్టించియుండిరని తెలియు చున్నది [3] ఈ చిన్న మండలములన్నియు రెడ్డిరాజ్యమునకు సామంత ములే వీటిలో క్షత్రియులు పాలించునవి అధికముగానున్నవి ఈ విజయముల తరువాత అనపోతానేడు రాచకొండ దుర్గనిర్మాణమును విస్తృతపరచినట్లు తెలియుచున్నది ఈవిషయమై 1365 నుండి 1380 వరకు గల ఈతని శాసనములు కొన్ని గానవచ్చుచున్నవి. [4]

---

2. 'అనవేమయగారికి నిజభృత్యుండైన కడియము పోతినాయుండు స్వామి అనమాచమరెడ్డింగారికి పుణ్యంగాను శ్రీకృష్ణ ముసి సంగమమైన బదరికాశ్రమ మందు అగస్త్యేశ్వరదేవరకు పిల్లలమఱ్ఱి బేతిరెడ్డిగారు గట్టించిన గర్భగృహము మీదను శిఖరప్రతిష్ఠజేసి బేరిశాలను గట్టించిరి.'

(వాడపల్లి శాసనము. క్రీ శ. 1377 No A R. H. S. 1334-35 F APP. దేసట్ల గోత్రికుడైన అన్నమనాయకుని బూరుగడ్డ శాసన మొకటి ఈ సందర్భమున గమనార్హము. I. T. D H No. 19-PP 71-72)

3. ప్రత్యర్థి గాయగోవాళ సోయం సమర సాత్యకిః
శ్రీశైల మధ్యోర్వీ మండలం పరిపాలయన్
ఉమామహేశ్వర శాసనము క్రీ. శ. 1376. A. D.

"హేమాద్రి దానై ర్ధరణీ సురాణాం, మహాచలం హస్తగతం విహాయ
యశ్చారుసోపాన పదేనచక్రే, శ్రీపర్వతం సర్వజనాంఘ్రి గమ్యమ్'
రసార్ణవసుధాకరము. అవ.

4. 'అనపోతానాయనింగారు రాజగిరినివాసులయి సకలభూవలయము పరి పాలిస్తూన్న అనపోత సముద్రము దక్షిణాన రాజుకొండమీంది కలుకోటలు, భావులు, దుర్గసమ్రక్షణ సేయించి ఆ చెరువు వుత్తరాన నాగానాయని కొండమీది కలుకోటలు భావులు సర్వమైన దుర్గసమ్రక్షణ సేయించి ఆ పడమట భూమికోటలు సేయించి'
తుంగచెరువుకట్ట కొనగల శాసనము. క్రీ. శ. 1365.

"విరంతర శివదేవతా పారాయణ, వీరశ్రీరాయరావు అనపోతానాయనిం

## రాచకొండ దుర్గస్వరూపము

పద్మనాయకుల రాజధానియైన రాచకొండను రాజాద్రి, రాజగిరి లేక రాజాచలమని వివిధ నామములు వాడుకలో నున్నవి. అన్నిటికన్నను రాచకొండయను నామమే జనబాహుళ్యమందు పేరు కెక్కుటచే దానినట్లు వాడుట జరుగుచున్నది. రాచకొండ దుర్గ ప్రాంతము హైద్రాబాదు నగరమునకు 30 మైళ్ళ దూరములో, విజయవాడకుపోవు రహదారిపై గల 'కోయలగూడెం' బస్సు స్టేజికి ఆరుమైళ్ళ దూరమున దక్షిణముగానున్నది. బస్సులో ప్రయాణించు వారికి రాచకొండ పర్వతపంక్తులు ఉత్తర దక్షిణములుగా బారులు తీర్చి యగుపడుచుండును. శిథిలప్రాయమైన ఈ రాజధాని నగరము, దాని పరిసరప్రాంతములన్నియు సుమారు ముప్పది మైళ్ళ ప్రాంతము నావరించియుండెను. ప్రధానముగా ఈ దుర్గము రెండు పర్వతములపై నిర్మింపబడినది. ఒకదాని పేరు రాచకొండ అనగా రాజులు నివసించు నది. మరియొకదాని పేరు నాగనాయుని కొండ. ఈ రెండింటిపై గల ప్రాకారదుర్గములు నేటికిని శిథిలమైపోలేదు. రాచభవనములు, సభామందిరము, రాచనగరు శిథిలమైయున్నవి. పురవీధులు, గృహ ప్రాంగణములు ఇప్పటికిని స్పష్టముగా గానవచ్చుచున్నవి. దూరముగా సైనిక గుడారములు, గజశాలలు, కొలువుకూటములు శిథిలమై గనిపించును. దేవాలయములనేకము ప్రధాన స్థానములందు నిర్మింపబడినవి. ఈ దుర్గములోనికి పోవునప్పుడు ప్రవేశద్వారములకడను, పర్వతపు దిగువలందును ఉన్న దేవతా విగ్రహములు, వాటి ప్రక్కన శాసనములు కొన్ని చెక్కబడియున్నవి. ముఖ్యముగా ఈదుర్గనిర్మాణామతి కీలకప్రాధాన్యమైన వారి దూరదృష్టిని దెలుపుచున్నది. ఈ ప్రాంతము జేరవలెనన్న వారు ఎరనశిలాపంక్తుల నెన్నెని దాటియే, దుర్గ

---

గారు రాజగిరి నివాసులయి సకల భూవలయమును పరిపాలిస్తున్న రాయసము ద్రము సర్వభూత హితార్థముగాను తమ బిరుదాంకితము చేయించిన'

మారణ్య మధ్యము నుండియే పోవలసియున్నది. క్రిందిగల రామస్వామి ఆలయమొకటి సంస్కారమునకగలదు. వ్యవసాయమునకై వచ్చు లంబాడీలుదప్ప అక్కడమరి నిర్మానుష్యమే. శివరాత్రి పర్వసమయమున గొప్ప తిరునాళ్ళయొకటి జరుగుచుండును. ముఖ్యముగా ఆంధ్ర దేశమునగల చారిత్రక ప్రదేశములలో నిది నొకటియైనందున దర్శించువారి సౌకర్యమునకై మంచిబాట సౌకర్యమైనా కల్పింప వలసిన అవసరమున్నది.

**అనపోతానేని దిగ్విజయములు**

దుర్గ నిర్మాణపు వ్యవహారములన్నియు తీరినవెంట అనపోతానేడు ఓరుగల్లు ప్రాంతమును జయించుటకై బయలుదేరి యుండెను. ఓరుగంటిని పాలించుచున్న కాపానాయకునికి-పద్మనాయకులకు పిల్లలమఱ్ఱి విషయములో పూర్వ వైరము కొంత సాగుచుండుట ఈవరకు దెలుపబడియున్నది. విరోధమునకు కారణమదియైనను తెలుగునాడులో సర్వాధిపత్యము సాధించుటకే ఒకరినొకరు మించి ఉద్యమించుటయే కారణముగనున్నది. తెలంగాణమందున్న ఈ యిరువుర నాయకులు ఎవరికివారు 'ఆంధ్రదేశాధీశ్వరుల' మని సంభావించుకొండిరి. దానికితోడు కాపయనాయకుడు పిల్లలమఱ్ఱి సీమకే ఆక్రమించి వారి నణచివేయుటకు జూచియుండుటవలన ఈ ఇరువురిలో తీవ్రమైన శత్రుత్వము వృద్ధిగా సాగినది.

కాపానాయకుని మరియొక చర్యయును ఈ హిందూనాయకులలోగల సఖ్యతజెడుటకు కారణముగావచ్చును. దక్కను దేశములో తురుష్కరాజ్యస్థాపనకు కాపయనాయకుడు సహాయమందించుట కారణము గావచ్చును.[5] కాపయగావించిన ఈపనికి హిందూరాజు లెంతవర కంగీకరించిరో చెప్పజాలముగానిఅదివారిసమిష్టిభావమును తొలగించినదనియే భావింపవలయును. తుదకు కాపయనాయకుని బలముతోనే నిలబడిన ఆ బహమనీసుల్తాను, నామమాత్రమైనను కాపయ నాయకునికి కృతజ్ఞత జూపక ఆంధ్రదేశములో నధికభాగమును కొల్లగొట్టి పోయెను.

---

5 Briggs Ferishta Vol. II P. 298 Tarikh-i-Ferishta Luknow Text P. 286

బహమనీలచే ఓటమిజెంది బలహీనముగానున్న ఈ సమయములో కొండవీడు పాలించుచున్న అనపోతారెడ్డి అనవేమారెడ్లును కాపానాయకుని రాజ్యమైన రాజమహేంద్రవర ప్రాంతములను తమ రాజ్యమున గలుపుకొనసాగిరి.[6] సహజముగా ఈపరిణామములన్నియు అనపోతానేనిని ఉద్రేకపరచి యుండవచ్చును

తుదకు ఓరుగంటికి సమీపమునగల భీమవరముకడ అనపోతానేని సైన్యములు కాపయనాయకుని దాకినవి. కాపానాయకుడాయుద్ధరంగముననే ప్రాణములు విడిచి నేలగూలినట్లు గానవచ్చుచున్నది.[7] తరువాతనే గాని అనపోతానేనికి ఓరుగల్లు, భువనగిరి, సింగవరము మొదలైన ప్రాంతములు స్వాధీనమైనది. దీనికుదాహరణముగా 1369లో శ్రీజయప్రశస్తి విరాజిల్లుచున్న అయ్యనవోలిశాసన మొకటి వేయబడియున్నది.[8] పద్మనాయకుల చరిత్రకిది ముఖ్య శాసనము.

## కొన్ని ఆరోపణలు

అనపోతా మాదానాయకులు కాపయనాయకుని జయించుటలో పూర్వ చారిత్రకులు వ్రాసిన యంశములు కొన్ని సందిగ్ధముగానున్నవి. నిర్దుష్టమైన పరిశోధన లేకనైనా వీరుజేసియుండిన బాగుండెడిది. అట్లుగాక అది అవునో-కాదోయను సందిగ్ధభావమున, అనుమాన దృష్టితో వ్రాయబడినట్లు గనిపించుచున్నవి. ఇది ప్రమాదకర

---

6. అనపోతారెడ్డి కోరుకొండ శాసనము. EP. Coll- 44 of 1812. P. 68, ద్రాక్షారామ శాసనము క్రీ. శ, 358. S I. I. Vol. IV. No. 1387.

7. 'కాపభూపాలుని ఘన బాహుబలమెల్ల, నలభీమవరముకడ నణచినాడు' 'భీమవరముకడఁ గాపానేనిజంపి' వె. వం. 36_47.

8. 'శ్రీ సింగమనాయని అనపోతా నాయనింగారు ఓరుగల్లు, భువనగిరి, రాజుకొండ, సింగపురము మొదలైన తెనుంగు దేశమాచంద్రతార ముత్తరోత్తరాభివృద్ధిగాను ధర్మరాజ్యము చేయుచును దిగ్విజయ యాత్రా ప్రసంగానను అయ్యనవోలి తీర్థస్వామియైన మైలార దేవరను దర్శించి.
అయ్యనవోలి శాసనము. 1369 A. D. (H. A. S. 19. w. G. I. P. 119)

విధానము విజ్ఞులీ క్రింది విషయములలో గల యథార్థ మాలోచింప వచ్చును

1 అనపోతా నేడు కాపయనాయకుని జయించుటలో రహస్యముగా బహామనీలతో సంబంధము గలిగి యుండెనేమోనని ఒక ఆరోపణ గావించియుండిరి ఈ పోరు జరుగువరకును బహామనీ సుల్తానులకు పద్మనాయకులకు సంబంధమున్నట్లు ఎట్టి ఆధారము గనిపించదు బహామనీలతో ప్రప్రథమమున సంబంధము గలిగి యున్నవాడు కాపయ నాయకుడు మాత్రమే

2 హిందూరాజ్యవ్యతిరేకత హిందూ వ్యతిరేకతవంటి పదములు కొన్ని ఈ నాయకులపై యథేచ్ఛగా వాడబడియున్నవి దైవభక్తులు, సాహితీపోషకులు, మరియు సంస్కృతీపరులైన తెలుగు ప్రభువులపై వీరెట్లు సాహసించి వ్రాసిరో గాని ఈ ఆరోపణ మిక్కిలి నిరాధారమనియే జెప్పవలయును కారణమేమనగా హిందువు-హిందువు స్వంతవిషయములలో బోరాడుట ఒక క్రొత్త విషయముగాదు. చరిత్రలో అట్టి సంఘటనలెన్నో అసంఖ్యాకముగ నున్నవి ఈ సంఘటన లేమాత్రమును హైందవ వ్యతిరేకతయని మరియొకరు వ్రాసినట్లు గనిపించుట లేదు. వీరి విషయములోనే ఈ పదాలు వాడుట గానవచ్చుచున్నది అసలు హిందువులుగానివారు హిందువులపై బోరాడినపుడే ఈ పదము అర్థవంతము గాని - ఒక హిందువు మరియొక హిందువుతో బోరాడుటలో దాని ఉపయోగార్హము గానిపించదు ఈ విధానము మిక్కిలి శోచనీయముగు నున్నది

3 తెలుగు విజ్ఞాన సర్వస్వము వంటి ప్రామాణిక గ్రంథములో రాచకొండ వీరుల రణవ్యాపారము (రణము గుడుపుట) గురించి వ్రాయుచు 'ఈ యాచారము తెలంగాణాలోనే, రేచర్లవంశ్యులలోనే వాడుకలో నున్నట్లు కనుపించునని నొక్కి నొక్కి వ్రాసిరి ఇది అయథార్థము. కారంపూడి ప్రాంతములో (వీర భాగవతము) ఈ ఆచారమున్నట్లు కీ.శే. శ్రీ వెల్లాల సదాశివశాస్త్రిగారు వెలుగోటి వంశచరిత్రలో (1910) వ్రాసి యుండిరి తెలంగాణాలోనే, వీరిలో

ఈ ఆచారముండెనని ఆరోపణ జేయుటలో ఒక ప్రాంతమును ఎన్నిక జేసి చెప్పుటయగుచున్నది. దీనిలో గల ఔచిత్యమేమిటో గాన వచ్చుటలేదు

4. పాఠకుల దృష్టి మరల్చుచున్న మరియొక అంశము అనపోతానేనికి గల 'ఆంధ్రదేశాధీశ్వర' యను బిరుద విషయము. అనపోతానేనికీ బిరుదు శాసనములలో క్రీ శ 1365 నుండియే వాడబడుచున్నది. అంతకు పూర్వమూ బిరుదు వాడియుండిన యుండవచ్చును. కాని మనకు వివరముగా తెలిసినది 1365 నుండి మాత్రమే. ఈ విషయముగూడా ఆరోపకులకు తెలియును. విస్మరించునట్లుగా అనపోతానేనికి ఆ కాలమునకా బిరుదు లేదనియో త్రోసివేసిరి. ఈ బిరుదు ఎక్కడనో, అస్పష్టముగా వ్రాయబడియుండలేదు. అయిదు శాసనములలో స్పష్టముగా నున్నది. బహుశా కాపానాయకునికి పూర్వమూ బిరుదు వారికి లేదను ఉద్దేశ్యము గావచ్చును. ఈ అంశములలో గల ఉచితానుచితములు విజ్ఞులే నిర్ణయింపవలయును. గనుక ఈ నాటకమునకాధారమైన గ్రంథనామములు క్రింద ఈ అధోజ్ఞాపికలో తెలుపబడుచున్నది."

## కళింగ విజయములు

ఓరుగంటి స్వాధీనము తరువాత కొద్దికాలానికి అనపోతానేడు కళింగ దిగ్విజయానికి బయలు దేరినట్లు తెలియుచున్నది. ఈ యాత్రలో ఎవరెవరితో ఆతడు పోరాడెనో, ఏయే ప్రాంతములు స్వాధీనమైనవో తెలుసుకొనదగు సమాచారము లేదు. కాని అప్పటి కళింగాధిపతియైన వీరనరసింహదేవుని (1378–1409) అనపోతానేడు జయించగా ఆతడు సంధిగావించుకొని తన పుత్రికయైన కనకలక్ష్మీదేవిని అనపోతానేని పుత్రుడైన II అనపోతానేనికిచ్చి వివాహము గావించినట్లు తెలియుచున్నది. ఈ వివాహానికి పిమ్మటనే గావచ్చును ఈ కనకలక్ష్మీదేవి సింహాచలము వచ్చి, స్వామిని దర్శించి అక్కడ ఒక

౪. (a) విజ్ఞానసర్వస్వము. సం. ౩. పుట. 294, 295, 296, 305.
(b) రెడ్డిసంచిక. 1947. పుట. 21, 36, 43, 47.
(c) సమగ్రాంధ్ర సాహిత్యము. సం. 3. ఉపోద్ఘాతము.
(d) A Forgotten chapter of Andhra History 1945 P. 99.
[illegible] Kingdoms Chap. II P. 23–24.

శాసనము వేయించినది.[10] ఈ శాసనకాలము క్రీ. శ 1380 గనుక అంతకుపూర్వమే కళింగవిజయములు ప్రారంభమయ్యెనని అనుకొనవచ్చును

ఈ విజయము లన్నియు బూర్తియైన వెంట రాజ్యవిస్తీర్ణము పరిపాలనా సౌలభ్యము దృష్టిలో నుంచుకొని అనపోతానాయు సోదరుడైన మాదానేనిని దేవరకొండ ప్రాంతమున కధిపతిని గావించెను ఈ విభజన రాజ్యపంపకము గాదు కేవలం పరిపాలనా సౌలభ్యం - రక్షణకొరకు మాత్రమే. ముఖ్యనిర్ణయము లన్నియు రాచకొండ నుండియే జరుగుచుండెడివి అందరు గలసి నిర్ణయించియే పనులు జరిపెడివారు అంతేగాదు రాచకొండ - దేవరకొండ సంతతిలో కుటుంబవృద్ధి అమితముగా జరిగినను వారిలో ఏనాడైనను అభిప్రాయ భేదములు గలిగినట్లుగాని, ఐక్యత నశించినట్లుగాని ఒక్క సంఘటన యైనా గనిపించుటలేదు సామాన్యముగా రాచకుటుంబాలలో ఈ ఐక్యత గానుపించుట అరుదనియే జెప్పవలసియున్నది అది వీరి వంశమున కొక ప్రత్యేకత

సోదరులైన అనపోత-మాదానాయకులు గొప్ప సాహసికులు, సమరవీరులు పితృఋణము దీర్చుటలోగాని, ప్రతిష్ఠను నిలుపుకొనుటలోగాని, రాజ్యవిస్తీర్ణము బెంచుటలోగాని వీరు గనబరచిన ప్రజ్ఞా విశేషములు అసాధారణమైనవి దుర్గనిర్మాణము వంటి బృహత్తర కార్యకలాపములు వీరికాలముననే జరిగియున్నవి

సోదరుడైన మాదానాయకుని ప్రత్యేకముగా జెప్పవలసిన పని లేదు ఎందుకనగా అన్నదమ్ములలో ఎవరు ఎవరిని మించినవారనునది లేనేలేదు మాదానాయకునివైన మూడు శాసనములు నేటికి లభించినవి వానిలో ఉమామహేశ్వర శాసనము (1376) చారిత్రక ప్రాధాన్యము గలది. కావ్యశైలిలో జెప్పబడినది తక్కినవానిలో ఒకటి తన మాతృశ్రీ పుణ్యార్థమై 'జాతరరేవు'లో వేసినది[11] మరియొకటి

10. S I I Vol VI No 1081, మరియు ఆంధ్ర విజ్ఞానసర్వస్వము. సం. III. పుట. 270.

11. A P G R E 1965 No B 247.

పానుగల్లు శాసనము[12] ఈ పానుగల్లు శాసనము ఇటీవలనే లభ్యమై యున్నది. పద్యశాసన మిది దీనిలో ఈతని పరాక్రమము వర్ణింప బడియున్నది అనుబంధములో నిది జూడవచ్చును

**సాహిత్యపోషణ**

సోదరు లిరువురు ఇట్లుబిమ్మట తమ తమ ఆస్థానములందు కవి పండిత పోషణకు గడంగి విద్వల్లోకమందు తగు కీర్తి ప్రతిష్ఠల నార్జించిరి మహాకవియైన విశ్వేశ్వర కవిచంద్రుని - పశుపతి నాగనాథుని ఆదరించి తొలిసారి మనకు పరిచయము గావించిన ఈ సోదరులే ఇందులో పశుపతి నాగనాథుడు అయ్యనవోలుశాసనరచయిత. ఉమామహేశ్వర శాసనంలోగూడా కవిచంద్రుని పలుకుబడులు కొన్ని గనిపించుచున్నవి ఇక క్రమముగా వారి విషయ మరయుదము

## పశుపతి నాగనాథకవి

రాచకొండ కవుల చరిత్రలో, అనపోతానేని కాలంలో చరిత్రకు మొదట దెలిసినవారు పశుపతి నాగనాథకవి - పశుపతి నాగనాథుని గురువరేణ్యులైన విశ్వేశ్వరకవిచంద్రుడు వీరిరువురు అనపోతానేని ఆస్థానంలో జేరిన తొలి విద్వాంసులు వీరిలో నాగనాథకవినిగురించి అయ్యనవోలు శాసనంలో ఈ క్రిందిమాటలు జెప్పబడియున్నవి

"ఇతిశ్రీ కౌశిక బ్రహ్మర్షి గోత్రజనునాపశుపతి పండితపుత్రేణ నాగనాథకవినా లిఖితమిదం శాశ్వత ప్రతిష్ఠమస్తు"

పేరు దెలియుటలో నాగనాథునిగురించి శాసన సహాయము లభించియున్నను, ఆతని కావ్యాలలో ఏ ఒక్కటిగూడా చూచుటకు భాగ్యం గలిగియుండలేదు. కారణం ఈతడు రచించెనని జెప్పబడు చున్న ఆంధ్ర తొలి విష్ణుపురాణము, సంస్కృతమున మదన విలాస భాణమనునది ఒకటి అలభ్యము మరొకటి అముద్రితము ఉదాహరణ గ్రంథములలో తొలి విష్ణుపురాణంలోనిదని ఒక పద్యమిట్లు గానవచ్చుచున్నది.

---

12. పానుగల్లు శాసనము. అను II పు. 19-20.

"ఉ. మానసరమ్యమైనంత మధుమాసము పాంథ విలాసినీ జన
త్రాసము పుష్పభాణ నవరాజ్య విలాసము వల్లరీ వధూ
హాసము మత్తకోకిల సమంచిత పంచమనాద మంజిమ
వ్యాసము జీవలోక హృదయంగమ సౌఖ్యవిలాసమెంతయున్."
(ప్రబంధ రత్నావళి. 183.)

ఇంత చక్కని ధారగల ఈ పద్యం జూచిన తరువాత – ఆ గ్రంథం లభింపకపోయెనని ఎవరికైనా దిగులుగలుగక మానదు ఇక ఈతని రెండవ రచనమైన మదనవిలాసము భాణమొకటి సంస్కృత రూపకము భాణమనగా దశరూపములలో ఒక భేదము ఇందులోని దిగా ఒక గద్యమును మాత్రము కవితరంగిణీకారులు ఉదాహరించుచు ఈ ప్రతి లభ్యమేనని వ్రాసియుండిరి[1] కాని ఇది ఎక్కడ లభ్యమో వారు దెలిపియుండలేదు

"రేచర్లవంశ రత్నాకరేణ – శ్రీ సింగభూపాల పూర్వాచల ప్రభాకరేణ – కేసమాంబికాకల్ప ప్రసూనగుచ్ఛేన – శ్రీ యాన పోత భూపాలేన సతతసన్నిధీకృత కల్యాణనారాయణస్య వసంతో త్సవ – భారద్వాజాన్వయ పరిపూర్ణ రత్నాకరస్య గురుర్విశ్వేశ్వరకవి చంద్రస్య ప్రియ శిష్యో నాగనాథకవిః"– అనుటవలన ఈ నాగ నాథుడు విశ్వేశ్వర కవిచంద్రుని శిష్యుడని దెలియుచున్నది సింగ నాగనాథుడు తన ప్రభువుకు కావ్యమేదైనా అంకితమొసంగి యుండ వచ్చును

ఇక నాగనాథకవి కాలం దెలుసుకొనుటకు మార్గము ఒక్కటే అది అయ్యనవోలు శాసనము ఈ శాసనకాలమే గురు శిష్యుల వయసును – సుమారుగానైనను దెలుసుకొనుటకు సహాయపడు చున్నది. అయ్యనవోలు శాసనకాలం 1369 గనుక అప్పటివర కీతని వయసు కనీసం ముప్పది సంవత్సరాలైనా యుండవచ్చును. వయ

1. ఆంధ్రకవి తరంగిణి సం. 5. పుట_112, భారతివ్యాసం. జులై 1945. ఇందరుజూచియు ఈ ప్రతిగల తావు వీరు దెలుపలేదు.

సులో ఈతనికంటె విశ్వేశ్వర కవిచంద్రుడు పెద్దవాడై యుండును గనుక ఇరువది సంవత్సరాలెక్కువనుకున్నచో, శాసనకాలానికి వారి వయసు 30-50 గా యుండవలయును అనగా నాగనాథకవి 1340-1415 వరకు, విశ్వేశ్వరకవిచంద్రుడు 1320-1400 వరకును జీవించి యుండవచ్చును. ఇది ఇతరాంశములను బోల్చి చూచినపుడును ఈ వయసు సరిపోయినది

ఇక నాగనాథకవిని గుర్తించినవారెవరైనా గలరా యనున నాకతి జూతము రాచకొండ మంత్రులకు సంబంధీకుడైన కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో గల ఒక పద్యము దీనికి కొంత ఆధారముగనున్నది

“సీ. అనఘు పులిశెక్కి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరాజును
ఘను నాగరాజుఁ గవి సోమునిఁ దిక్కన సోమయాజిఁ గే
తన కవి రంగనాథు సుచిత్రజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజు సో
మన నమరేశ్వరుం దలతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్”

సి. ద్వా. అ 1. ప 12.

పై పద్యములో గానవచ్చుచున్న 'నాగరాజే' నాగనాథకవి గావచ్చునని విశ్వసింపబడుచున్నది కారణమేమన పినవీరనను పినరాజన్నట్లుగా నాగనాథుని నాగరాజనియు వ్రాసియుండవచ్చును గదా! ఇదంతయు ఈతని కావ్యములు బయటికి వచ్చినగాని తేటపడదు ముందైనా అవి వెలుగులోకి వచ్చునని యాశింతము

# సరస సాహిత్య లక్షణ చక్రవర్తి గౌరనార్యుడు

"ప్రణమ్య విద్వజ్జన పారిజాతం
కవీంద్ర విప్రార్చిత పాదపంకజం
విభుం ప్రభుం విశ్వ సృజం మహేశం
సంవక్ష్యతే లక్షణ దీపికేయమ్."

అని నుతులుగావించి, లక్షణదీపికవంటి శాస్త్రగ్రంథమును రచించి, జాను తెనుగులో, మధురమైన కవితతో, కమ్మని గ్రంథము లేరీతి వ్రాసియుండెనాయని గౌరనార్యునిగురించి ఆశ్చర్యపడవచ్చును. కాని దేశీఛందమైన ద్విపదకవితలోనె హరిశ్చంద్ర చరితము, నవనాథచరితముల వంటి జనరంజకమైన కావ్యములు రచించి ప్రఖ్యాతి వడసియున్నవాడు గౌరనార్యుడు.

గౌరనకుటుంబం ప్రసిద్ధమైన రాచకొండ మంత్రులకు చెందినట్టిది. గౌరన పెదతండ్రి పోతరాజు మరియు గౌరనతండ్రి అయ్యలమంత్రి దేవరకొండలోగల మాదానేనికి (1361-1384) మంత్రులుగ నుండిరి. గౌరనకుగల ఈ సంబంధము రాచకొండ ప్రభువులెనిక్క పరిచయాదరములకు బనికివచ్చినది. గౌరన రచించిన మూడుకృతుల లోను చారిత్రక విషయాలు కొన్ని వెల్లడియగుటచేత ఈతని జీవితకాలం వంటి ముఖ్యవిషయములు కొన్ని దెలుసుకొనుటకు చక్కని అవకాశము గలుగుచున్నది. గౌరన కాలము దెలుసుకోవలయునన్న ముందు పోతరాజు కాలమును దెలుసుకొనినగాని ప్రస్తుతాంశము సాధ్యము గాజాలదు ప్రస్తుతము గౌరన తన కావ్యములందు దెలిపియున్న అంశములు కొన్ని జూతము

1 హరిశ్చంద్ర చరితమున,

'సింగయ మాధవ క్షితిపాలమణికి
మంగళమూర్తికి మంత్రియై జగతిఁ

బాగడొందు పెద్దన పోతరాజునకుఁ
దగిన తమ్ముఁడు యశోధనుఁ డెల్లమంత్రి[1]
చెట్టబట్టంగ నోఁచిన భాగ్యవతికిఁ
జుట్టాల సురభికి సుందరీమణికి
ఘనుఁడు వల్లభ మంత్రి గంగాంబ గారి
కనిన పోచాంబకు గారాబుసుతుఁడ'

కావ్యంలో చివరి పంక్తులు,

సత్య సంధుఁడు హరిశ్చంద్రుని చరిత
నిత్య సత్కీర్తులు నెగడ రచించె
భ్రమరా ప్రసాద సంప్రాప్త కవిత్వ
సుమహిత సామ్రాజ్య సుఖ పరాయణుఁడు
చతుర సాహిత్య లక్షణ చక్రవర్తి
ప్రతివాది మదగజ పంచాననుండు
మతిమంతుఁ డయ్యల మంత్రిపుంగవుని
సుతుఁడు గౌరనమంత్రి సుకవిశేఖరుఁడు'

నవనాథ చరితమున,

'సింగయమాధవ క్షితిపాల మంత్రి
పుంగవుఁడై యొప్పు పోతరాజునకు
నను జాతుఁడగు నయ్యలాత్మకూర్మి
భ్రమరాంబికా వరప్రాప్త విచిత్ర
విమల సాహిత్య ప్రవీణాధికుండు
ననఘచిత్తుఁడు గౌరనాహ్వాయ ఖ్యాతుఁ'

లక్షణ దీపిక ఉపక్రమంలో,

అస్తి ప్రశస్తావని పాలమాళి
రత్నావళి రంజిత పాదపీఠః
రేచర్ల వంశాన్వయ పూర్ణచంద్రో

---

1. వ్రాయసగాండ్ల పొరపాటో లేక కవిగారి అశ్రద్ధయో – అయ్యలమంత్రి యనుటకు బదులు ఎల్లమంత్రియని చేరినది. అది ఒక్క పర్యాయమే. దీనిని సవరించుటకన్న గుర్తుంచుకొనిన చాలునని తోచుచున్నది.

మహాబల సింగయ మాధవేంద్రః
ఆ సీత్తస్య మహామాత్యః స్వామికార్య ధురంధరః
పోతరాజ ఇతిఖ్యాతో రాజనీతి యుగంధరాః
మంత్రి చూడామణే స్తస్య సోదర న్యాయ్యాలు ప్రభోః
గౌరనార్య ఇతిఖ్యాత స్తనయో నయకోవిదః
సోఽహం సోమకళామాళి ప్రాసాదాద్గత కల్మషః
ప్రణమ్య పింగళం నామ కవిపుంగవ ముత్తమం
ఉదాహరణ రత్నాని లక్షణ గ్రంథ సింధుషు
సమాకృష్య సతాం భూత్యై ప్రవక్ష్యే లక్షణ దీపికాన్

పై మూడు కృతులలో సింగయమాధవునితోబాటు మంత్రి పోతరాజు ప్రస్తావన జేయబడి యున్నది అంతేగాక పైనజెప్పిన 'బొగడొందు పెద్దన - మంత్రిపుంగవుడై గొప్ప' అను పదములు కవి వ్రాయుచున్న నాటి వర్తమాన కాలమును దెలుపుచున్నవి గనుక కావ్యములు రచించుచున్న నాటికే పెద్దన మంత్రిత్వము కొనసాగుచుండి యుండవచ్చును పోతరాజు మంత్రిత్వ విషయమును గురించి దెలుపుచున్న మరొక సాక్ష్యము సింగయ మాధవుని ఉమామహేశ్వర శాసనము. కాలము క్రీ శ 1376 దీనిలో పోతరాజు ప్రస్తావన విరివిగా జెప్పబడినది.[2] కనుక ఈ రెండంశములు దృష్టిలో నుంచుకొని కాలము నిర్ణయింపవలసి యున్నది

2. 'మంత్రీ పోతనామాసీ త్సర్వశాస్త్ర విశారదః
యశ్యామాత్య శిఖామణేః కవివరస్తోత్రైక పాత్రీకృతాం
మత్వావాక్పతి రిద్ధనీతి సుభగాం వాగ్వైఖరీం లజ్జతే
సోయం పెద్దనమంత్రివర్య తనయః శ్రీ పోతరాజోన్వహం
దేవస్యాస్య మహోపకార రచనాం సమ్యఙ్మదాచీకరత్'

శ్రీ గిరినాథాయనమః

శ్రీ శ్రీ శ్రీ పెద్దిరాజు కొడుకు పోతురాజు వ్రాలు.

(ఉమామహేశ్వర శాసనము క్రీ. శ. 1376) H. A. S. 19. M. N 35. P. 73.

పూర్వము గౌరన కాలము గనిపెట్టుటలో 1429 లోనున్న మరొక సింగయ మాధవుని శాసనములు కొన్ని జూచి పొరపాటు బడుట జరిగియున్నది. ఎందుకన రాచకొండ ప్రభువులలో 'మాధవ' నామము గలవారు పెక్కండ్రు గలరు. ప్రస్తుతము మనకు గావలసిన వాడు సింగయ మాధవునికి చెందిన పోతరాజు గనుక – ఆ పోతరాజు ప్రస్తావన గౌరన కృతులందును – ఉమామహేశ్వర శాసనమందును చేర్కొనబడియున్నది గనుక, 1429 లోనున్న మాధవుని విషయం వీరికి సంబంధింపజాలదు ఇది ఇప్పటికైనను గుర్తించినట్లు గాన వచ్చుటలేదు[3]

ఇక మనకు గనపడిన ఆ సింగయమాధవుని కాలము 1361–84, ఉమామహేశ్వర శాసనకాలము 1376 ఈ రెండిటిలోను శాసనకాలము మాత్రము ఖచ్చితమైనది గనుక – దానిననుసరించి మంత్రి పోతరాజు కాలము, మరియు గౌరన కాలము నిర్ణయింపవలసియున్నది. పై శాసనకాలము 1376 గనుక, ఆ నాటికి మంత్రి పోతరాజు వయసు ఏబది వత్సరములనుకొని యున్నచో ఆతని సోదరుడైన అయ్యలమంత్రి వయసు నలుబది అయిదు సంవత్సరములైనా యుండవలయును. ఇక గౌరనకవి ఆనాటికి 25 సంవత్సరాల వయస్సు ఉండదగునని గ్రంథసాక్ష్యము తెలుపుచున్నది. పై అంశముల ననుసరించి శాసనకాలమునకే గౌరన వయసు 25 సంవత్సరాలైన, ఆతని జననము 1351 ప్రాంతముగావలసియున్నది ఆ ప్రకారము 75 సంవత్సరాలైనను గౌరన జీవించెనని దలచినచో 1351 నుండి 1425 వరకు ఆతని జీవితకాలము అగుచున్నది ఈ కాలము తక్కిన అంశములకును భిన్నముగాజాలదు.

కాని ఈ గౌరనకాలమును కొందరు మహాకవి శ్రీనాథుని అంత్యకాలమునకు (1448) సమానమేమోనని భావించుచుండిరి. అది సరియగునో – కాదో జూడవలసియే యున్నది.

---

3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం సం. V. పుట. 39

గౌరన తన ద్విపద కృతులను రెండింటిని శ్రీగిరి మల్లినాథున కంకిత మొసంగెను దానికి శాంతభిక్షావృత్తి యతీశ్వరులవారి ప్రోత్సాహముగలదు. ఆ శాంతభిక్షావృత్తి యతీశ్వరుల ముఖ్యభృత్యుడైన ముమ్మడి శాంతయకే శ్రీనాథుడు తన శివరాత్రి మహాత్మ్యమను కావ్యమును అంకిత మొసంగెను. కనుక గౌరనగూడా తన కృతుల నాసమయముననే - ఆ యతీశ్వరునకే కృతి నొసంగెనేమోనని - ఆ యాలోచన.

శాంతభిక్షావృత్తి యతీశ్వరుల నామము ఒక్కరిదిగాదు. వారిలో ఎవరెప్పుడు జీవించిరో దెలుసుకొనుటకు తగిన ఆధారములు లేవు. ఇక ఆ యతీశ్వర పదవులందున్న అనేకులలో గౌరన - శ్రీనాథకవులు ఎవరెవరికి సమకాలీనులో నిర్ధారించుటయు కష్టమైన విషయము. గౌరన కృతినొసంగిన కాలమునన్నున్న యతీశ్వరుడు, శ్రీనాథకవికి జెందిన యతీశ్వరుడు ఒకరైన గావచ్చుగాని - శ్రీనాథ కవి తన కావ్య మంకిత మొసంగిననాటికే గౌరన తన కృతులనిచ్చి యుండు ననుకొనుటకు తగిన ఆధారము గానరాదు. ఇక రసార్ణవ సుధాకరము, చమత్కార చంద్రికవంటి లక్షణ గ్రంథములనుండి గౌరన ఉదాహరణలు గైకొని యుండుటవలన - వాటికావలి కాలమున గౌరన జీవించి యుండవలయునుగదాయని కొందరి సందేహము.

పై కావ్యముల కాలములు దెలుసుకొనుటకు వీలుగానినాటి మాటయది ప్రస్తుతమా గ్రంథములు 1380 కి ముందే పూర్తియైనట్లు స్పష్టముగా దెలియుచున్నవి.[4] కనుక సందేహమునకు తావు గనిపించదు.

మరియొక అంశము 'అథ శ్రీ సింగభూపాలో దీర్ఘాయుర్వసుధామిమామ్, నిజాంసపీఠే నిర్వ్యాజం కురుతే సుప్రతిష్ఠితామ్' అని సింగభూపాలుడు వ్రాసిన శ్లోకమొకటి ఆతని దీర్ఘకాలజీవితమును

4 II. సంగమరాయల మంత్రి భోగనాథుడు 1387 ప్రాంతమున తాను రచించిన 'అలంకార సుధానిధి' యను కావ్యములో చమత్కార చంద్రికను బేర్కొని యుండెను. చూడుడు EP. Ind Vol. III. P. 21. F.

జూపునగదా యను విచారము మిగిలియున్నది. ఇది సహేతుకమైన ప్రశ్నయె. పైకిజూపిన సింగభూపాలుడు ఎక్కువకాలము జీవించినట్లే ఆ మాటలలో గనిపించును. కాని ఆతని కావ్యములు రెండును సింగభూపాలుడు అధికారము స్వీకరింపకపూర్వమే, యువరాజుగా నుండగా రచింపబడియుండి, అవతారికా భాగము మాత్రము తరువాతకాలమున పూర్తియై యుండవచ్చును. ఇది సామాన్యముగా జరుగుచున్న విషయమే పై చర్చలవలన దేలుచున్నదేమనగా - రసార్ణవసుధాకర, చమత్కార చంద్రికలు 1400 కు పూర్వమే బూర్తియైనవగుటచేత, గౌరన వాటినుండి యుదాహరణములు దీసుకొనుటలో ఆతని చివరికాలమేమాత్రము 1425 నకు దాటి ముందునకు బోజాలదనియు స్పష్టమగుచున్నది. కనుక గౌరన కాలము 1351 నుండి 1425 వరకని నిర్ణయింపవచ్చును ఈ కాలమువరకు శ్రీనాథుని కితడు సమకాలీనుడనుటలో సందేహములేదు.

## శైలి - రచనా విశేషములు

ద్విపద రచనలో గౌరన సిద్ధహస్తుడని, లక్షణవేత్తయని తానుగా జెప్పియుండకపోగాక - ఆతని కావ్యములు పఠించిన వారెల్లరికి అందలి సత్యము వేరుగా జెప్ప పనియుండదు. సత్యహరిశ్చంద్ర మూలకథనీతడు తీర్చిదిద్దినరీతి, అందలి కవిత్వశైలి, పోకడలు, కథా చాతుర్యము, బహుళఖ్యాతి నందుకొనుటే దానికితగ్గ నిదర్శనము. ఆంధ్రదేశమునందీ కథకొక చక్కనిరూపు - మిక్కిలి ఊపు గలిగిన వన్నచో అది గౌరన సరస కవితాశక్తియనియే జెప్పవలయును. పురాణ ప్రసిద్ధుడైన హరిశ్చంద్రునికథ లోకమందెంత ప్రసిద్ధమో - గౌరన అందు కల్పించిన నక్షత్రక పాత్రయు అంత ప్రసిద్ధము. సన్నివేశములన్నియు మిక్కిలి సహజాతములు ముఖ్యముగా నేడు నక్షత్రకుడులేని హరిశ్చంద్రునికథను నమ్మమనినను నమ్మజాలరేమో! ఆ పాత్రతో ఆ కథ యట్లు వ్యాప్తికొచ్చినది. మరియు జనులలో 'పీడ నకు పర్యాయపదముగా నక్షత్రకుని పేరు వాడుట జూడగ - కవి కల్పిత విషయమైనను కొన్ని కొన్ని సన్నివేశములు జనులయందెట్లు

ముద్రవైచుకొనునో దీనినిబట్టి గ్రహింపవచ్చును శైలి దెలియుటకై కొన్ని భాగములు ఉదాహరింపబడుచున్నవి.

హరిశ్చంద్రుని పొగడ్త,

'దనువెల్ల సత్యంబు తలపెల్లఁ గరుణ
పనులెల్ల ధర్మంబు పలుకెల్లఁ బ్రియము
బొంకు నాలుకకు జేర్చుట కాని వావి
యింక నన్ని జెప్పనేమి కారణము
వారిజగర్భుని వ్రాఁత దప్పినను
వారిజాప్తుఁడు దూర్పువంకఁ గ్రుంగినను
మేరువు గ్రుంగిన మిన్ను వ్రాలినను
ధారుణీ చక్రంబు తలక్రిందు పడిన
వారిధులింకిన వజ్రాయుధంబు
దారితప్పిన మాట తప్పఁడా రాజు'

పుట. 51_240

మాయామృగ వర్ణన,

'ముత్తెంపుఁ జిప్పల మురళించుమోముఁ
గ్రొత్తనీలపు రంగు గులుకు కన్దోయి
పగడంబు నునుఁగెంపుఁ బచరించు చెవులు
ధగధగమను పైఁడి తళుకులమేను
దఱచు వజ్రములతోఁ దడఁబడు తొడలు
మెఱుఁగు పచ్చలడాలు మీఁసు గొర్సెలును
నొఱపు వెన్నెలఁగాయు నుదిరంబు గలిగి
వెఱచిన గతి దిశల్ వీక్షించి కొనఁగఁ
జెలువును బలువును నిగియును బిగియు
బలమును జలమును బఱు లంఘనములు'

పుట. 62. 580.

శబ్దవైచిత్రితము,

'మందార మంజరీ మంజుమరంద
నంద దిందిందిర నందనారామ

కమనీయ వికసిత కనకారవింద
కమలనీతట లతాగార లతాంత
రచిత శయ్యాతల రతిరయ గళిత
కచభర సురపుర గణికా కపోల

పుట. 86,1266.

మాతంగకన్యల వర్ణన,

'మించుటద్దములతో మెఱయు చెక్కిళ్ళు
మంచివెన్నెలవంటి మందహాసములు
సలలిత శ్రీకార సన్నిభ కర్ణములు
నలుపు శంఖముల కౌఁగిలవడు మెడలు
బిసకాండములఁ దలపించు బాహువులు
కిసలయంబుల సొంపు గెలుచు హస్తములు
కరికుంభముల చెన్నుగల చనుఁగవలు
నసుదారఁ బిడికిట నడఁగు మధ్యములు'

పుట. 70. 800.

వారే తుదకు,

'వాఁడిన మోములు వన్నెయుఁ దూలి
వీడిన వలువలు పిరపిరఁబోయి
తూలెడు మేనులుఁ దునిసి ముత్యములు
రాలెడు సరులును రాగంబు దొఱఁగి
వ్రేలెడు పెదవులు విభ్రమం బెడలి
సోలెడు సొంపులు జొబ్బిల్లఁ గరఁగి'

పుట 78_1040.

హరిశ్చంద్రుని వర్ణన,

'నీ చంద మీయొప్పు మీ రాజసంబు
నీ మూపు నీ యేపు నిట్టి తేజంబు
నీ పెంపు నీ సొంపు నీ ప్రతాపంబు
నీ పోఁడి మీ దాడి మీ భుజబలము
నెందు నెవ్వరి యందుఁ నెన్నఁడు గాన'

పుట. 138,310.

శృంగార ఘట్టములు,

'జాతి నీలపురంగు జడిపించు కురులు
లేఁత చందురుఁ బిసాళించు నెన్నుదురు
మద చకోరములతో మలయు నేత్రములుఁ
గొదమ లేళ్ళకు సిగ్గుగొలిపెడు చూపు ...
సుందరిగాదిది సొబగురాయంచ
యంచగాదిది నడపారు క్రొమ్మించు
మించుగాదిది రాచమెచ్చుల ప్రతిమ
ప్రతిమగాదిది పచ్చి పగడంపు లతిక
లతిక గాదిది నవలావణ్య సరసి
సరసి గాదిది పుష్పచాపుని శరము
శరము గాదిది రతి నవరించుచిలుక.'

పుట. 139_140.

మాధుర్యము చిందించే జాను తెనుగు పదసాహిత్యంలో, చక్కని వర్ణనలతో పండిత పామరుల నందరినీ హర్షింపజేసినశృంగారనార్యుడు కనుక తననుగురించి యాతడు సుమహిత సామ్రాజ్య సుఖపరాయణమనినను, చతుర సాహిత్య లక్షణ చక్రవర్తి యనినను ఆతని కది తగియున్నది.

# II సింగభూపాలుడు - వేదగిరినాయుడు

I అనపోతానీనికి సింగభూపాలుడు, ధర్మానేడనువారు, దేవరకొండ మాదానాయునికి వేదగిరినాయుడు అను పుత్రులు గలిగిరి. వీరిలో 'కుమార' అను ఉపనామము సింగభూపాలునకు, పెద అను ఉపనామము వేదగిరినాయునికి వాడుచుండుట గలదు.[1] దీనికి కారణము I వ సింగమనేని జీవించియుండగనే II సింగభూపతి జనించియుండుటయు వేదగిరినాయునికి 'పెద' అను ఉపనామము తరువాత సంతతి వలన ఏర్పడియుండవచ్చును.

సింగభూపాలుని తండ్రి I అనపోతానేని కాలముననే రాచకొండ రాజ్యవిస్తీర్ణ మెంతయో జరిగి సామాన్యస్థాయినుండి యది రాజ్యస్థాయికి చేరుకొనినది. శాసనములందు జెప్పినట్లు ఇంచుమించుగా నది యిప్పటి 9 జిల్లాల తెలంగాణా ప్రాంతము వీరి యాధీనమందున్నది.[2] కర్నూలు, గుంటూరు జిల్లాలలోని కొద్దిభాగములేవైనా తాత్కాలికముగ వీరి యాధీనమునందున్న యుండవచ్చును. జాతరరేవు - ఉమామహేశ్వరములందున్న శాసనములు దీనిని బలపరచుచున్నవి. సింగభూపాలుడు 1365 ప్రాంతమునుండియే యువరాజుగానుండి తండ్రితో బాటు రాజ్యవ్యవహారములను జక్కజేయుచునుండి అనుభవమును గడించెను. తండ్రి అనపోతానేడు యుద్ధయాత్రలందున్నపుడు తాను రాజధాని యందుండి రాజకార్యముల జక్కజేయుచు, ఆస్థానమందున్న కవి పండితుల నాదరించుచు, విద్యావినయ సంపత్తుల

---

1. 'కుమార శ్రీ సింగే జలధిరశనాం శాసతిమహీమ్.' (చమత్కార చంద్రిక)
'కుమారసింగభూపే లక్ష్యలక్షణవేదినా.' (అమరకోశ వ్యాఖ్య)
2. 'ప్రత్యర్థి గాయ గోవాళ సోఽయం సమరసాత్యకిః, శ్రీశైల వింధ్యమధ్యోర్వీమండలం పరిపాలయన్ (26)- (ఉమా: శాసనము. 1376)
'వింధ్య శ్రీశైల మధ్యక్ష్మామండలం పాలయన్ సుతైః, వంశప్రవర్తకైరర్థాన్ భోగపురంధరః' )రసా. సుధా. అవతారిక)

నార్జించెను ముఖ్యముగా విశ్వేశ్వర కవిచంద్రుని - పశుపతి నాగనాథుని మరియు బొమ్మకంటి అప్పయాచార్యులవంటి కవి సత్తముల కీతడు గలిగించిన ప్రోత్సాహము సంస్కృత భాషాసాహిత్యమునకు వన్నెనిచ్చుచున్నదనిన అతిశయోక్తిగాదు

ఇంతకు దీనికి కారణము ఈతనికిగల విద్యాభిమానము. గీర్వాణమందు తాను స్వయముగా రసార్ణవ సుధాకరము, రత్నపాంచాలిక కందర్ప సంభవము, సంగీత రత్న సుధాకర వ్యాఖ్యానములవంటి యుత్కృష్టమైన కావ్యములు రచించి తనకుగల భాషా వైదుష్యమును వెల్లడి గావించెను కనుక పండితాభిమాని - పండిత ప్రభువునైన ఈతని చరిత్ర రాచకొండ చరిత్రకే యొక నూతనాధ్యాయమని జెప్పినను జెప్పవచ్చును

## దిగ్విజయములు

సింగభూపతి యువరాజుగనున్నపుడే కల్యాణి (గుల్బర్గా) దుర్గము నాక్రమించి తండ్రికి యుద్ధకార్యములందును దోడ్పడుచుండెను [3] 1384 లో ఈతడధికారము జేపట్టియుండగనే విజయనగరాధీశులతో నొక పోరాటము జరుపవలసివచ్చినది కారణములు దెలియవుగాని కర్నాటమును పాలించుచున్న II హరిహరరాయలు (1377-1404) రాచకొండ భూభాగమైన కొత్తకొండ (మహబూబ్ నగరం జిల్లా) పైకి సాళువ రామదేవుని యాధిపత్యమున సైన్యమొసంగి బంపియుండెను బహుశా బహమనీ సుల్తానులతో రాచకొండవారు సఖ్యతగానుండుట జూచి తమకేదైనా ప్రమాదము గలుగునని వీరు భావించి యుండవచ్చును కొత్తకొండలో రాయల సైన్యమునకు రాచకొండ వారికి తీవ్రమైన పోరాటము జరిగి రాయల సైన్యమచట యోటమిజెందినట్లు గానుపించుచున్నది.[4]

3. 'మండలీకృత కోదండో రణే కల్యాణభూపతిః
కరకంపిత కల్హారో మీ నాయంక ఇవరాజతె
కల్యాణే క్షణచేష్టయా ప్రకటిత స్తంబ ప్రతిష్ఠాక్రమే
(చమత్కార చంద్రిక తృ. విలా. A. S. P. P. Vol. 30. 2-3.)

4. EP. Corn. Vol. 12 CK. 15. V. o. P. 121.

## కళింగ విజయములు

సింగభూపాలుని అధికారకాలములో ప్రథమ విజయము కొత్తకొండ పోరాటము. దాని తరువాత కళింగ దిగ్విజయములకై సింగభూపతి పయనించి యుండవచ్చును ఈ దిగ్విజయములలో గోదావరి ప్రాంతములందున్న వేములకొండ, బెండపూడి మొదలైన పెక్కు దుర్గములు ఈతనికి వశ్యమైనట్లు 'వంశావళి' దెలుపుచున్నది దేవరకొండ పెదవేదగిరి నాయుడును ఈ సమయమున సింగభూపాలునితో కలిసి అనేక విజయములు సాధించియుండెను. బహుశా ఈ దిగ్విజయమునకు సంబంధించినదేమో—1387 లో సింహాచలమందు సింగభూపతి శాసనమొకటి కానవచ్చుచున్నది[5] చమత్కారచంద్రిక ననుసరించి ...డగా కళింగాధిపతియైన IV వీరనరసింహదేవుడే సింగభూపతిచే యోటమిపొందిన ఉపాయనముగా తన కుమార్తెను సమర్పించి, సంధిగావించుకొనినట్లు చెప్పబడుచున్నది[6] పూర్వము అనపోతానేని దిగ్విజయములందును ఈ ప్రస్తావన వచ్చియున్నది గనుక 'కన్యారత్నమును' సమర్పించిన విషయము వేరువేరు గాకపోవచ్చును. మొదటి దిగ్విజయములో ఈ భూపతి ఉమాపతియైన II అనపోతానేనికి కనకలక్ష్మిదేవినిచ్చి వివాహము గావించినట్లు చెప్పబడియున్నది గనుక పండువకాని తన కూతురును సింగభూపాలునకొసంగుట పొసగునదిగాదు. దీనికి చారిత్రకాధారములేమైన లభించునేమో తెలుసుకొనవలసియున్నది."

---

5. S. I. I. Vol. IV. No. 1086 & Vol- VI No. 1081
6. సింగక్షోణి భుజః కళింగకుభజే క్రుద్ధశ్య తస్మిన్ క్షణే
దత్తాం తత్తనయా ముపాయనతయా లోకోత్తమాం పశ్యతః
వ్యావృత్తాధనుషః కటాక్షసరణి స్తద్భ్రూలతా లోకినీ
దృక్కోణం పరిహృత్య రాగమహిమా చిత్తే పరంచేష్టతే.
చమత్కార చంద్రిక. A S. P. P. Vol. 30-1-2

సామోల్లాసిని పారసీక నృపతౌ సంధాను సంధాయకే
కన్యారత్న సమర్పణాత్ గజపతౌ సంబంధ గంధస్పృశి

కళింగ విజయములవెంట సింగభూపాలునకు పదివత్సరముల పాటు చక్కని ప్రశాంతత జిక్కియున్నదేమో స్థిమితముగా [illegible] రాజ్యవ్యవహారములు జూచుచు కవిపండిత విద్యాగోష్ఠులతో నిరంతరమాతని విద్యాపీఠమిట్లు శోభిల్లజేసెనట 'సరసమానుష్య వాచా స్ఫుట పటహాది పాఠక ఘుమఘుమరవములతోడను, కవిరాజపండిత భాగవత దైవజ్ఞాది గాయకాది పణిహారి కలితరవములతోడను, రతి రాజ రాజేంద్ర రాజపణ్యాంగణల చరణ నూపురముల ఝుళం ఝుళి రవములతోడను హృద్యమమైన మంగళ వాయిద్యములతోడను నిరంతరమా విద్యా మండపము శోభిల్లునట్లు దెలియుచున్నది

1397 వరకు సింగభూపతికి ప్రశాంతముగా గడిచినను చివరి కాలమట్లు కొనసాగియుండలేదు విజయనగరాధీశులు తమ పూర్వ పరాభవమునుదలచి తిరిగి రాచకొండ ప్రాంతమైన పానుగల్లుకోట (మహాబూబునగరుజిల్లా) నాక్రమించుటకై హరిహరరాయలు తన కుమారుడైన II బుక్కరాయలకు సైన్యమొసంగి దాని నాక్రమించుటకు బంపెను కర్నాటసేనలు 1397 లో ఈ కోటను దాకియున్నవి. ఇరుపక్షముల కచట రెండు సంవత్సరములవరకు పోరాటము తీవ్రస్థాయిలో కొనసాగియుండెను రాచకొండ సేనలిట్లు దీర్ఘకాలము రాయలసేనలెదిరించి పోరాడినను తుదకు 30వ, డిశంబరు 1398నాటికి ఆ దుర్గము II బుక్కరాయల వశముగాక దప్పినదిగాదు [7] కర్నాటా

---

రేచర్లాన్వయ శాఙ్ఞిణం నరపతిం ద్రష్టుం రణే సాహసం
సంభావ్యం సహిగౌతమీ పరిసర క్షుద్రక్షమా భృద్గణే.
చమత్కార చంద్రిక. విలా. 5.

(The Madras Govt or. Mss. Lib R. No. 2679. P 114.)

7. శాకాబ్దేషునిధీన్దు వహ్నిశశిభిః సమ్మిశ్రితేష్వీశ్వరే
వర్షే మాసే సహస్యనామని తథావక్షే వలక్షే దినే
శంభోర్భాస్కర వారభాజి విజితా శ్రీపానుగల్లుః పురీ
తేనానేక తురుష్కవీరవిజయ శ్రావావలీ వేల్లితా
ఇమ్మడి బుక్కమహీపతి తనయోనన్త క్ష్మాపతిర్జయతి।
Ep Ind. Vol. XXVI. P. 36. F. N. 4.

నిర్వాహకులు ఎవరైనను : చివరకో అసలు కామపొనగుననున్న తెలుగురాజ్యము నకే అంతము ఏర్పడినట్లు గోచుచున్నది. పానుగల్లు పోరాట మొదలైనప్పు డనుకూలించగనే, విశేషముగా రాచకొండ సేనలీయుద్ధమున చిన్నమనాడే ఎఱకృష్ణరాయని యాధిపత్యమున మరియొకసేన దేవరకొండ నాక్రమించుటకు రాయలు బంపియుండెను కాని దేవరకొండలో ఆ సైన్యమును II కుమార మాదానేడెదిరించి కర్ణాటకుల సైన్యాధిపతియైన యఱకృష్ణరాయని సంహరించివేసెను [8] తమ సైన్యాధిపతి మరణించుటచేత రాయల సైన్యములు వెనుదిరుగవలసి వచ్చినది చివరకీ యుద్ధములన్నియు 1397 నాటికి సమాప్తమైనవి. సింగభూపాలుని వృద్ధాప్యమువలననో లేక అనారోగ్య కారణమో ఆతని తమ్ముడు, ఆతని కుమారుడైన II అనపోత భూపాలుడు రాజ్యమునకు వచ్చెను. మొత్తముమీద 14వ శతాబ్ది చివరి సంవత్సరము నుండియు సింగభూపాలుని చరిత్రము తెలియవచ్చుటలేదు

## సింగభూపాలుని పాండిత్యము

సింగభూపాలుని చరిత్రలో మిక్కిలి కొనియాడదగినది ఆతని పాండిత్య ప్రతిష్ఠా విశేషములు. ఇది యాతని రాజ్యమునకే అపారమైన కీర్తిప్రతిష్ఠలను గడించియున్నది. విద్యావైదుష్యము గల ఈ ప్రభువు గీర్వాణభాషలో రసార్ణవసుధాకర మనెడు లక్షణగ్రంథ మొకటి, రత్నపాంచాలిక యను నాటిక యొకటి, శార్ఙ్గదేవకృతమగు సంగీతరత్నాకరమునకు 'సుధాకర' మనెడు వ్యాఖ్యాన గ్రంథమొకటి రచించియుండి పండితులందరి నోహో యనిపించెను [9]

8. ఉ. దేవరకొండ యొద్ద నతితీవ్ర పరాక్రమ విక్రమంబునన్-
జేవదలిర్పఁగా జయము చేకొని యా యఱకృష్ణరాయనిన్,
భూమి నుతంబుగా నతికి భూతగణంబుల కుత్సవంబుగా,
వావిరిఁజేసెనార ! కులవర్ధనుఁడైన కుమారమాదఁడున్"

వె. వం. పుట. 3౬. ప. 102

9. మొదటి రెండు కావ్యములు పూర్వపు పీఠాపుర సంస్థానాధీశ్వరులు, చివరిది మద్రాసులోని అడయారు లైబ్రరీవారు వ్యాఖ్యానసహితముగ ప్రచురించి యుండిరి.

సింగభూపాలుని విద్యాభిమానమునకు నిదర్శనముగా జెప్పవలెనన్న ఆతని యాస్థానమందున్న కవీశ్వరుల నెన్నవలసియుండును. కాశీవిశ్వేశ్వర మిశ్రుని శిష్యుడైన విశ్వేశ్వరకవిచంద్రుడు[10], బొమ్మకంటి అప్పయాచార్యుడు ఈతని ఆస్థానమందుగల కవివతంసులు. సింగభూపాలుని పాండిత్యమును ఆతని కవితాశిల్పమును సమకాలీనులైన ఈ పండితప్రకాండులు వేనోళ్ళ జాటియుండిరి. ముఖ్యముగా విశ్వేశ్వరకవిచంద్రుడు ఈతని సాహిత్యవైభవమును జాటుటకే యనునట్లు చమత్కారచంద్రిక యను నొక అలంకారశాస్త్ర గ్రంథమును రచించియుండి, సింగభూపాలుని యీ మహాప్రబంధ సామ్రాజ్యమున కధిపతిని గావించి బహుధా అతని సౌజన్యశీలగుణము లిట్లు గొనియాడెను

'రూపకం దశధా ప్రోక్తం నాటకాది విభేదతః
మహాప్రబంధ సామ్రాజ్య మధికర్తుమిదం క్షమం
సింగభూపాలరచితే రసార్ణవసుధాకరే
అస్య ప్రపంచో విజ్ఞేయః కేతధా వక్తుమీశతే.'[11]

సామాన్యముగా కవులు తమ్మాదరించు ప్రభువుల నధికరాగముగా బొగడువారైనను, వారియందు తగిన ప్రతిభావిశేషములు, మరియు సంస్కారము లేనిదే యిట్లు బొగడుట జరుగనేరదు. సింగభూపాలుని ఈ కవిచంద్రుడిందు 'సాహిత్యశిల్పావధి' యని యుగ్గడించియుండెను

'సంగీతక్రమ చంక్రమప్రియసఖీ శృంగారసంజీవనీ
సౌజన్యద్రుమసారణీ చతురతాసామ్రాజ్య సింహాసనమ్।
శ్రీ సింగక్షితిపాలశేఖరమణే ర్వైయాత్య ఘంటాపథ
శ్చాటువ్యాహృతి వైఖరీ విజయతే సాహిత్య శిల్పావధిః'[12]

10. 'తథాచోక్తమస్మదాచార్యైః కాశీశ్వర మిశ్రైః రసమీమాంసాయామ్.'
(చ. చం. 5. విలా. A. S. P. P. Vol. 30. 1–2.)

11 & 12. చమత్కార చంద్రిక. విలా. 3_4. A. S. P. P. Vol. 30. 1-2.

సింగభూపాలునికి వివిధ శాస్త్రములందుగల పాండిత్య మపార మని జెప్పవచ్చును. ఆతనికి వ్యాకరణశాస్త్రమందేమి - సంగీత శాస్త్ర మందేమి - రసాలంకార నాట్యశాస్త్రములందేమి అసాధారణమైన ప్రజ్ఞగలదనుటకు ఆతని కావ్యములే యుత్తమ ప్రమాణములు. శైలినరయుటకై ఒకటి రెండు శ్లోకములు నిచట జూపబడుచున్నవి.

రసార్ణవ సుధాకర అవతారికలో దుర్గుణములగు కాఠిన్యాదులను వర్ణించుచున్న శ్లోక సూక్తమిది.

'తస్మిన్ శాసతి సింగభూమిరమణే భూమన్న పోతాత్మజే
కాఠిన్యం కుచమండలే తరలతా నేత్రాంచలే సుభ్రువామ్
వైషమ్యం త్రివలీషు మందపదతా లీలాలసాయంగతే
కౌటిల్యం చికురేషు కిం చ కృశతా మధ్యే పరంలభ్యతే.'
(ర. సు. అవ. 43)

సింగభూపాలుని సౌజన్యమునకు తార్కాణమైన మరొక శ్లోకము.

'నిద్రాణేంగాసు సుధాకరః కిము తమస్సంఘాత మున్మూలయేత్
జ్యోత్స్నా కిం న చకోర పారణకృతే తత్రాపి సంశోభినీ
ప్రాలేయః కిం కమలాకరాన్ దినమణి ర్నోల్లాసయే దజ్ఞసా
తత్సం ప్రకృత్యైవ మహాదృశామపి స్యాదేవ సత్ప్రీతయే'
(ర. సు.)

రత్నపాంచాలికయను నాటికయందీ ప్రభువరేణ్యుడు ఆశీః పూర్వకముగా నీ శ్లోకముచెప్పి వైదికమార్గ సంవర్ధనమే తన యాశయమని జాటియుండెను.

'కల్యాణమస్తు జగతాం సతతం ప్రజానాం
సంవర్ధితో భవతు వైదిక ఏవమార్గః
సారస్వతాని సరసాని కవీశ్వరాణాం
మాత్సర్య దగ్ధహృదయా న కలంకయంతు'

## సర్వజ్ఞ బిరుదము

సింగభూపాలుని 'సర్వజ్ఞ' బిరుదమునుగురించి పండితులలో ఇదివరకు విశేషమైనచర్చలెన్నో జరిగియున్నవి. అవన్నియును దాని పరిశీలనాత్మక ధోరణినే జాటుచున్నవి. అయినను అందలి సందిగ్ధాంశములు సరిగా తేటపడినట్లు గానవచ్చుటలేదు. సింగభూపాలునికిగల పాండిత్య విషయములో, ప్రజ్ఞానిరతిలో నెట్టి సందేహములకు తావను నది లేనేలేదు. ఆతని సార్వజ్ఞమూర్తిత్వ మీ వరకే విబుధకవి వతంసులే గొనియాడియుండిరి. ఈ బిరుదము కేవలమాతని ఉత్కృష్టకు తార్కాణము మాత్రమే. అయినప్పటికి ఆతని కాకాలమున దీనిని వాడుట జరిగియున్నదాయని చారిత్రకముగ దీనిని జూడవలసి యున్నది

అట్లు జూచినచో చారిత్రకముగ III సింగభూపాలుని కాలముననే శాసనములందు ఈ బిరుదు గానవచ్చుచున్నది.[1]; కాని అంతమాత్రమున ఈ ప్రభువుకీ విశేషము వాడలేదని చెప్పుటకును సాధ్యముగాదు. కొంతవరకైనను సమకాలికులైన బొమ్మకంటి అప్పయాచార్యులు శ్లేషమూలకమున దీనిని జాటియుండెను. అది జూడదగియున్నది.

శ్లో 'విద్యాద్వైవత తాత తావకగురో సర్వజ్ఞ చూడామణే
స్తోతవ్యోఽసి మనీషిణాం త్వ మధవా మధ్యో జవాక్షైరలం
ఇత్థం సింగమహీపతిం గురుజనోఽప్యాభాషితే దో - ష్ణస్త
త త్తత్పద్ధతి ధర్మమర్మణి పరిచ్ఛేదావి సంవాదికమ్'

(అమరకోశ వ్యాఖ్యానము Madras Govt OL R. No. 2672 P 59)

'జైవాతృకం బుధగురుం నిలయం కలానాం
సర్వజ్ఞ మూర్ధమణిమాశ్రిత శుద్ధ పక్షమ్
శ్రీ బొమ్మకంటియప పదాంకిత మప్పయార్యం
సర్వేప్సితో పితసురం ద్విజరాజ మాహుః'

మొత్తముపై యిక్కడ వాచ్యముగనే జెప్పబడినను సంగీత సుధాకర వ్యాఖ్యానమందది స్పష్టముగానున్నది.[14] ఏమైనను కేవల మీ బిరుదుతోనే ఆతనిని గొలువదగినదిగాదు. అది యాతని సాహిత్య మూర్తిత్వము ననుసరించి అంతకురెట్టింపుగానే జెప్పదగి యున్నదనినను అతిశయోక్తిగాదు

## విశ్వేశ్వరకవిచంద్రుడు

II సింగభూపాలుని ఆస్థాన కవీశ్వరుడైన విశ్వేశ్వరకవి చంద్రుడు పాండితీవృద్ధుడు పశుపతి నాగనాథకవికి కవిచంద్రుడు గురువు. అయ్యనవోలు శాసనమువలన పీరిరువురి కాలము సుమారుగా గుర్తించుటకు అవకాశముగలిగియున్నది గనుక, ఈ కవిచంద్రుని జీవితకాలము 1320–1380 ప్రాంతమై యుండునని భావింపవచ్చును.

విశ్వేశ్వర కవిచంద్రుడు – పశుపతి నాగనాథ కవియు I అనపోతానేని ఆస్థానకవులుగా బనిచేసి యుండిరి అనగా నాటి సాహిత్య వ్యాసంగమంతయు యువరాజుగానున్న II సింగభూపాలుని అధ్వర్య ముననే సాగియుండవలయును ఇందుకు ప్రబలనిదర్శనము భోగనాథుడు రచించిన 'అలంకార సుధానిధి'లో ఈ కవిచంద్రుని చమత్కార చంద్రికను బేర్కొని యుండుటే – పై అలంకార సుధానిధి 1380 ప్రాంతమున పూర్తి జేయబడినది[15] దీనినను సరించి 1380 కి ముందే చమత్కార చంద్రిక, అంతకుముందు సింగభూపాలుని రసార్ణవ సుధాకరము బూర్తియైనట్లుగ దేలుచున్నది. కనుక 'అథశ్రీ సింగ భూపాలో దీర్ఘాయు ర్వసుధామిమామ్' అను రసార్ణవసుధాకర శ్లోకము యువరాజత్వ కాలమును గలుపుకొనినట్లుగనే భావింప వలసి యున్నది.

---

14. 'అతి గంభీరే విషయే కతిపయ వేద్యేత్విహ గ్రంథే
సమ్యగ్వ్యాఖ్యాన కుశలః సర్వజ్ఞ సింగభూప ఏకైకః'
(సంగీతరత్న సుధాకర వ్యాఖ్యాన అవతారిక –
History of the Reddy Kingdoms. chap. IX P 48.)

15. EP. Ind. Vol. III, P. 21. FF.

విశ్వేశ్వర కవిచంద్రుడు రచించిన చమత్కార చంద్రిక కావ్యాలంకార శాస్త్ర గ్రంథము సింగభూపాలుని యిందు నాయకునిగా జేసి కవిచంద్రుడు అలంకారములకు పెక్కు ఉదాహరణము లిచ్చియుండెను. చారిత్రకవిషయములకును ఈ గ్రంథము మిక్కిలి ప్రాముఖ్యము వహించుచున్నది నేటివర కిది ముద్రణభాగ్యమందు కొనకపోవుట విచారకరమనియే జెప్పవలసివచ్చుచున్నది.

ముఖ్యముగా విశ్వేశ్వరకవిచంద్రుడు సింగభూపాలుని పాండిత్యగుణమును గీర్తించుటలో విశేషాభిమానయౌదార్యముల నెంతో గనబరచియుండెను సందర్భానుసారముగా ఈవరకే ఈ కవి చంద్రుని పెక్కుశ్లోకములు చేర్కొనబడి యున్నవి ప్రస్తుతము ఒకటి రెండు మాత్రమిచట యుదాహరింప బడుచున్నవి

సింగ భూ పా లు ని దానదయాగుణముల నీ కవిచంద్రుడిట్లు చేర్కొని యుండెను

'దానేన కర్ణోదయయా దిలీపో
నయేన కావ్యో వినయేన రామః
యది ప్రసిద్ధం దధతా మమీాభిః
శ్రీ సింగభూపో నిఖిలై ప్రసిద్ధః'

మరొక ముఖ్య శ్లోకము

'సౌగంధి కేచ ఘనసారణి చందనేచ
బింబాధరేచ సుదృశాం వదనేచతాసాం
శ్రీ సింగభూప రచితే చ గిరాం కదంబే
కోవాన నందతి జనో జగదేక సారే[16]

చమత్కార చంద్రికయేగాక ఈ కవిచంద్రుడు సింహభద్ర విజృంభణము, కందర్ప సంభవము మరియు కనకాకంవళ మను కావ్యములు రచించినట్లు చమత్కారచంద్రికలో జెప్పుకొనియుండెను. పండితులెందరో చమత్కార చంద్రిక నుగ్గడించుట జూచి దానిని

చారిత్రక విశేషములుగల కావ్యము. శైలి దెలుసుకొనుటకై కొన్ని శ్లోకములిచట బొందుపరచబడుచున్నవి.

'ఆద్యో వేదవిదాం కణాద కపిల వ్యాసాహి రాడంఘ్రి ద్వి
క్పాణిన్యాది సమిష్టిమూర్తి రవధి స్మార్తక్రియా వేదినామ్।
వ్యాచష్టామరసింహనాథరచితం గ్రంథం నిఘంటూత్తమం
ఖ్యాతం శిష్యహితార్థ మప్పయ సుధీ శ్రీమారపోతాభిధః।

Madras Ori. Lib R. No 1041

'రేచర్ల వంశ సంభూతే రాస్థాన్యాం సింగభూపతేః
బొమ్మకంటప్పయాచార్య మూర్త్యా జాగర్తి శారదా।[18]

'కుమారసింగభూపేన లక్ష్యలక్షణ వేదినా
శోధితశ్చేదయం గ్రంథః కిం శోధ్యం శోధకాంతరైః।

'కావ్యాలంకార నానార్థతత్త్వ భావితమానసః
కుమారసింగభూపాల ఏక ఏవాస్తి నా పరః!

'కుమార సింగభూపేన యః కదాపి న శోధితః
సగ్రంథః శోధితోఽప్యన్యైః కిం బుధైః ర్వ్యవహ్రియతే।

(Ibid R. No. 1041 R. N 1170

## పెదవేదగిరినాయుడు-అయ్యలార్యుడు

పెదవేదగిరినాయుడు II సింగభూపాలుని పినతండ్రియైన మాదానాయకుని పుత్రుడు సింగభూపాలునికి సమకాలీనుడు ఈతడు దేవరకొండ రాజ్యమున కధిపతియై 1384 నుండి 1410 వరకు బరిపాలించినట్లు దెలియుచున్నది రెండవ సింగభూపతికాలమునను రెండవ అనపోతానేని కాలమునను ఈతడు పెక్కు యుద్ధములలో పాల్గొని విజయములు సాధించియుండెను. ఈ వేదగిరికి సంబంధించినట్టి శాసనములు కొన్ని 1405, 1407 నాటివి సింహాచలము మరియు శ్రీకూర్మములందు గానవచ్చుచున్నవి.[19]

18 A. S. P. P Vol. No 30 (1.2)
19. S. I. I. Vol. V. 1242. Vol VI. 1100.

వేదగిరినాయుడు తండ్రి మాదానాయుని వలెనే సాహిత్యాభిమాని. శాకల్య అయ్యలార్యుని ఆదరించి అసంపూర్ణమైన భాస్కర రామాయణమును నితనిచే పూరింపజేసినట్లు దెలియుచున్నది. భాస్కర రామాయణమునందు అయ్యలార్యుని రచన యుద్ధకాండము నుండి మొదలగుచున్నది.[20]

అయ్యలార్యుని గురించి ఆతడు జెప్పుకొనిన కొద్దిమాటలే దప్ప 'కవి జీవితముల' గురించి ఏమాత్రమైనను దెలియకపోవుట దురదృష్టమే. భాస్కర రామాయణమందు (వావిళ్ళ) గాన్పించు మాటలవలన ఆతడు వేదగిరినాయుని యాస్థానమందున్నట్లు ఈ క్రింది వాక్యములు ఆధారముగ నున్నవి.

'ఇందాకా భాస్కరుడు చెప్పిన రామాయణం ఇటుమీద వేదగిరినాయనింగారు అయ్యలుభట్లచేత చెప్పించిన రామాయణము యుద్ధకాండశేషము.[21] మరికొన్ని ప్రతులలో—ఇంతపర్యంతం భాస్కరుని సన్మార్గఘటన ఇటమీందికథ వేదగిరినాయనింగారు శాకల్య మల్లనార్యుని* మనుమడు అయ్యలుభట్లచే రచన చేయించిన 'యుద్ధకాండశేషము' అని గలదు.[22]

అయ్యలార్యుడు యుద్ధకాండము చివరలో జెప్పిన పద్యము నందలి యంశము లివి

'చ అమర గురుశ్రీకి భాస్కర మహాకవి జెప్పగనున్న యుద్ధకాం
డము తెనుగాయి చెప్పి వికట ప్రతిభాషణుండు ఒప్పలార్య సు

20. భాస్కర రామాయణ సంక్షిప్త ప్రచురణ — సాహిత్యఅకాడమి, హైద్రాబాదువారి (1969) ప్రచురణలో రచయితను గుర్తించు అంశములు జూపియుండలేదు. అకాడమీవంటి సంస్థలే ఇట్టి పనికి బూనినచో పాఠకులకు వాటివలన గలుగు లాభమేమియు నుండదు.

21 & 22. Madras Govt. Ori. Lib. 10-1-12 Leaf 229 b. and T/416 Leaf 119 G.

* శాకల్య మల్లనార్యుడు మరియు వేదాంత దేశికుల కుమారులైన వరదాచార్యులవారును మతవిషయములపై సంవాదము గావించినట్లు దెలియుచున్నది.

త్తమసుతుఁ డయ్యలార్యుఁడు కృతస్థితి నాద్యులు మెచ్చునట్లుగా
హిమకర తారకా రవిమహీవలయ స్థిరలక్ష్మి చేకుఱన్'

యు. కాం. 2698.

భాస్కర రామాయణ యుద్ధకాండములో ఈ పద్యము తరువాత అయ్యలార్యునిరచన ప్రారంభమగుచున్నది.

"ఉ. ఇంక బలీముఖుల్ బలసిరెక్కడి రావణుఁ డేటిలంకఁ బొం
డింకెను మేఘనాధు నగరీ పెనుమంటలతోడ చిచ్చుల
భ్రంకష శాత కుంభశిఖరంబగు మోసలఁగంటి రెల్లు నా
వంక జలింపదగ్నియని వారి విభీషణు పుణ్యగేహమున్'

పుట. 492. ప. 1139.

## అయ్యలార్యుని రచన ప్రారంభము

"ఉ. శ్రీనుత మూర్తియైన రఘుశేఖరు తేజముఁ బోలెఁ బర్వుచున్
భానుసహస్రమండల విభాసి సమగ్రతర ప్రకాశుఁడై
మానుగమింటితో నొఱయు మంటలుదిక్కుల నుగ్రమూర్తియై
శ్వానరుఁ డేపుతో నెసఁగె వానరరోష సముత్థుఁ డోయనన్'

పుట. 492 ప. 1140.

అయ్యలార్యుని శైలి దెలియుటకై కొన్ని పద్యాలు ఇంద్రజిత్తుమరణానికి రావణుడు దుఃఖించుట

"ఉ. హా జగదేకవీర హా కులసాగర పూర్ణచంద్రమా
హా జితలోకపాలగణ హా భుజగేంద్ర లసన్మహాభుజా
హా జనిత ప్రభావయుత హా సమరార్ణవ కర్ణధారకా
తేజము విక్రమంబు ఘన ధీరతయుం దెగటారె నక్కటా.[23]

పుట. 521_ప. 1395.

---

23. దీనిని బోలుచున్న పోతనగారి పద్యమొకటి జూడవచ్చును.

'ఉ. హా వలరాజ హా మదన హా మధురాయత చారులోచనా
హా విటలోక మానస నిరంతర తాపలసత్ప్రతాప
హా వనజాతనేత్ర తనయా యెట డాఁగితి నాకుఁజెప్పుమా
పేవితమైన నీ బలము చెల్వము మంటలలోనదాగెనో.'

వీరభద్రవిజయము. పుట. 76. పు. 116.

మరికొన్ని,

'ఉ. అన్నకు మ్రొక్కి నిల్చి వినయంబున రాఘవు నాజ్ఞ నెంతయున్
బన్ననయించి పిష్టపు సుపర్ణుని నెక్కిన మాడ్కి వేడ్కతో
బన్నగ వాయు సూతుపయి భాతిఁ దనర్చుచు లక్ష్మణుండు మే
రూన్నత శృంగ దేశమున నొప్పు మృగేంద్రుని శ్రేణిసేయుచున్'.
పు 512. వ 1315.

'ఉ. అత్తరి రాము గన్గొని సమరాంగణ దారుణిఁ గూలి నెత్తుటన్
జొత్తిలి ధూళి బ్రుంగి వివశుండగు తమ్ముని జూచి నెమ్మనం
బుత్తలపాటు నొంది మదినోర్వక ధైర్యము దూలిపోవఁగా
నత్తిన పెల్లు నెవ్వగల నిట్లనుచున్ విలపించె దీనుఁడై.'
పు. 545. వ. 592.

## VIII

## II అనపోతానేడు

II సింగభూపాలునికి పుత్ర సంతతి ఆరుగురు గలరు. వారిలో (కుమార అనపోత యనెడి పినఅన్నము) అనపోతానేడు మరియు రావు మాదానేడు ఈ తరమునందు ప్రసిద్ధులు దేవరకొండలో నున్న II మాదానేడు రామచంద్రానేడులు వీరికి సమకాలికులు. సోదరులందరిలో అనపోతానేడు పెద్దవాడుగనుక సింగభూపాలుని తదనంతర మీతడు అధికారమునకు వచ్చెను

అనపోతానేని రాజ్యాధికారమందున్న సమయంలో తెలుగుదేశమందెచ్చటను పరిస్థితులు సరిగాలేవు ఎక్కడజూచినను కలహ పరిస్థితులు గలుగుచున్నవి. ఎవరికివారు తమ స్వంత కూటముల నేర్పరచుకొనుచు రెండవవారిపై కయ్యమునకు గాలుదువ్వుచుండిరి. అనపోతానేనికివి గొప్ప సమస్యలు. పోయిన పానుగల్లు దుర్గము నీతడు సాధింపవలసి యుండుటగాక దురాక్రమణదారుల నెదిరించి తన రాజ్యమును నిలుపుకొనవలసి యున్నది. అందుకు విజయనగరాధీశుల నెదిరించుటకన్న మార్గములేదు.

అనపోతానేడిందుకై మొదట మెదకు ప్రాంతములనుండి కర్ణాటులను దరుమ నిశ్చయించుకొని యా (మెతుకు) దుర్గమును

దాకి రాయల సైన్యము నందుండి దరిమివేసెనని తెలియుచున్నది[1] దీనిననుసరించి జూచినచో రాయలసైన్యములు పూర్వము ఓరుగంటిని దాటియు బైకిపోయినట్లు జెప్పవచ్చును ఓరుగంటికడ రాయల సేనానాయకుడైన గుండయదండనాథుని పెదవేదగిరి నాయుడు దాకి సంహరించివేసెను[2] 1404లో ఈ విజయములు సాధించునాటికి విజయ నగరాధీశుడైన II హరిహరరాయలు మరణించియుండెను ఆ సింహాసనమునకై అతని కుమారులు తమలో తాము కలహించుచు రాజ్యవిషయమై శ్రద్ధవహింపలేకపోయిరి అనపోతనాయుడీ అదను జూచి విజయనగర రాజ్యమున ప్రవేశించి వారి సామంతులైన పంబెటసోముని – సరిపల్లి, తిమ్మని యోడించి చెన్నపట్టణము వరకును జయించుచు బోయెను ఈ ప్రాంతములన్నియు కొండవీటికి పైన నున్నట్టిభాగములు అనపోతానేనికి ఈ సమయమున కొండవీటి రాజ్యమండలి అంతర్విప్లవములు తోడుపడియుండును ముఖ్యముగా కొమరగిరిరెడ్డి అంత్యకాలములో రెడ్డిరాజ్యపరిస్థితులు క్షీణించి రాజ్య విభాగమునకు కారణమైనది ముఖ్యముగా రాజ్యభ్రష్టుడైన అన్న చోడ దేవునివంటి వారికిది చక్కని అవకాశము ఇతడు పద్మనాయకుల సహాయముతో రాజమండ్రి రాజ్యమును తిరిగి రాబట్టుటకై జూచుచుండెను ఈ పరిస్థితులలో విజయనగరాధీశులొకవైపు, బహమనీ సుల్తానులు మరియొకవైపు, రాచకొండవారింకొకవైపు తమ తమ రాజ్య విస్తీర్ణములు పెంపొందించుటకై జూచుకొనసాగిరి

## పెదవేదగిరి నాయుడు – అన్నచోడదేవుడు

రెడ్డిరాజ్యములో పరిస్థితులుమారి అవకాశముగలిగిన వెంటనే అన్నచోడదేవుడు తన రాజ్యము సంపాదించుటకై పెదవేదగిరి నాశ్రయించి సహాయమునుగోరెను ఈతడీ సహాయము గోరుటకుముందు రాజ్యభ్రష్టుడెట్లాయెనో స్పష్టముగా దెలుసుకొనవలసియున్నది సూర

1. వె. వం. పు 59. ప. 151.

2 ఏకశిలానగర సమీప శాత్రవ రాజన్యవనదహన.

'గుండ్రదండ్రాయుని ఖండించి సన్నుతిగాంచు వేదగిరి నిన్గన్నతండ్రి'

వె. వం. పు. 37. ప. 9౹, ప. 100.

వరము (నూజివీడు ప్రాంతము) పూర్వము అన్నదోడ దేవుని పైతృకరాజ్యము మొదటినుండియు మీగ రెడ్డిరాజ్యమునకు లోబడక ప్రక్కలోని బల్లెమువలె మెలగుచుండెను.

ఈ చోడమండలమును ఏ విధముగనైనను తమ రాజ్యమున గలిపివేయవలయునని కొండవీటి ప్రభువులు తీవ్రప్రయత్నములు జేసి యుండిరి. కాని ఆ ప్రయత్నములు అన్నదోడదేవుని తండ్రియైన భక్తి రాజు చివరికాలమువరకు సాగియున్నదిగాదు చివరకు అనవేమా రెడ్డి తనకుమార్తెయైన వేమాంబికను అన్నదోడదేవుని సోదరుడైన దోడభీమునికి వివాహముగావించి యాతనిని రాజ్యాధిపతి గావించెను[3] తత్ఫలితముగా అన్నదోడదేవుడు తన రాజ్యము గోల్పోవుట జరిగెను. అప్పటినుండియు ఆతడు వివిధ ప్రాంతములు దిరుగుచు చివరకు వేదగిరినేనిని యాశ్రయించెను.[4] వేదగిరి నాయుడే అన్నదోడ దేవునికి వాగ్దానమొసంగి ఆతనికి రాజ్య మిప్పించుటకై సహాయముగా వెడలి యా పనిని సాధించెను[5] కాని వేదగిరినేని అచ్చటనుండి తిరిగి వచ్చిననంటనే కాటయవేమునితనిని గార ద్రోలివేసెను.

చివరకు ఆ వేదగిరినేని కుమారుడైన మాదానాయకుడు మరికొంత సైన్యమును గైకొనిపోయి అన్నదోడదేవుని తిరిగి రాజ్యమందు నిలిపి[6] యాతనికి రక్షణగా మూడు సంవత్సరములవరకు

---

3. 'భరిత శ్రీ నిధి యమ్మహీరమణుఁ డొప్పెం జోడభక్తి క్షితీ
శ్వర సూనుండగు భీమలింగమనుజేశశ్రేష్ఠు సత్పుత్రి భా
స్వర కారుణ్య దశాజనావన విధాసంధాత్రి వేమాంబికన్
వరియించెన్ బతిభక్తి గౌరవధృతవ్యాపార సత్యాంబికన్.'
(శివలీలావిలాసము. నిశ్శంకుకొమ్మన. 45)

4. 'నలచోడ భక్తీంద్రు ననదేవరాజును బెంపారగాచె మీ పిన్నతాత
వె. వం. పు. 44. వ. 122.

5. 'అన్నచోడ దేవుని ద్రాక్షారామ శాసనం.1404 A.D.S.I I.Vol. IV - No. 1347-1348. వేదగిరినేని శాసనములు. సింహాచలం – శ్రీ కూర్మములలో 1405–1407. S. I. I. Vol. V 1242, Vol. VI. 1100.

6. S. I. I. Vol. VI. No. 1100.

అక్కడనేవుండి రాజధానికి మరలి యుండెను.[7] కాని ఈ పర్యాయము కాటయవేముడు తిరిగి అన్నచోడదేవుని రాజ్యమునుండి తరిమివేసియుండెను

## కాటయవేముడు - I దేవరాయలు

కాటయవేమారెడ్డి అన్నచోడదేవుని తరిమివేసెనేగాని, ఆతనిని తిరిగి రాకుండునట్లు జేయుట కతనికి సాధ్యమైనదిగాదు మరొకవైపు రాజమంద్రి రాజ్యమును లాగివేయుటకై కోమటి వేమారెడ్డియు తీవ్రప్రయత్నములు జేయుచుండెను. ఈ ప్రమాదములిట్లు వెన్నంటియుండుటవలన కాటయ తానొక మిత్రకూటమి నేర్పరుచుకొన్నగాని దీనిని గడచుట సాధ్యముగాదని దేవరాయలతో నొక యొడంబడికగావించుకొనెను ఈ సందర్భమేనేమో - కాటయవేముడు అహోబిల క్షేత్రస్వామిని దర్శించి యొక శాసనము వేసియుండినది[8] కాటయవేమారెడ్డి ఈ కూటమికిగూడా మరొక కారణము దోహదమైయుండును విజయనగరాధీశుడైన II హరిహరరాయల కూతురు హరిహరాంబతో ఈ కాటయవేమారెడ్డి సంబంధమందుకొనినట్లు ఒక యైతిహ్యమువలన దెలియుచున్నది రాజకీయ పరిస్థితులపై ఇంతకుపూర్వమే యిట్టి వివాహములు జరుగుచుండుట సుప్రసిద్ధవిషయము. ఇదిగూడా అట్టిదైనగావచ్చునేమో. ఏమైనను కాటయవేముని ప్రయత్నము ఈ సంబంధమువలననో, లేక రాజకీయ కారణముల చేతనో ఫలించియేయున్నది దేవరాయలు వెంగికి తగు సైన్యమునిచ్చి రాజమహేంద్రవరమునకు సహాయముగా బంపెను కాటయ వేమునికీ మిత్రసైన్యములవలన రెండు విధముల లాభము జరిగియున్నది. ఈ సమయములో కొండవీటికి జెందిన ప్రాంతములు కొన్ని రాయలసైన్యము లాక్రమించి పెదకోమటి

7. అన్నచోడదేవుని ప్రోలవరశాసనం. (1408) EP. Coll. No. 293,1920.

8. అహోబిల శాసనం (1410) EP. Coll. No 84. 1915.

వేమారెడ్డివలన గలుగుచున్న వత్తిడిని ఆతనికి దగ్గించివేసిరి ఇందు కుదాహరణముగా బాపట్లతాలూకాకు జెందిన ఇంకొల్లు మొదలైన చోట్ల దేవరాయల శాసనములుకొన్ని గాన్పించుచున్నవి.[9] విజయనగరాధీశులు తమ స్వార్థలాభమును జక్కగా జూచుకొనియుండిరి

## అన్నచోడ దేవుడు - ఫిరోజ్‌షా మైత్రి

రాచకొండవారి సహాయము అన్నచోడ దేవునికి రెండుసార్లు లభించినను కాటయవేమునివంటి బలవంతునిముందు అది పనిచేయలేదు. ఇప్పుడాతనికి బలమైన మిత్రకూటమియు లభించియుండుటచే ఇక సామాన్యముగా అతని నెదిరించుట సాధ్యముగాదు కనుక విజయనగరమునకు శత్రువైన బహమనీ సుల్తానైన ఫిరోజ్‌షా నాశ్రయించి - ఆతనికి విజయనగరము వారితో జేర్పడిన 'సాగర్' యుద్ధమునందు దోడ్పడియుండి విజయము సాధించెను[10] ఇందుకు కారణము సుల్తానుల వత్తిడివలన రాజమండ్రికి బంపు సైన్యసహాయ మాగిపోవునని భావించియుండును సాగర్‌లో లభించిన ఈ విజయము నవకాశముగా దీసుకొని అన్నచోడదేవుడు రాజ్య విషయములో గనుక సహాయపడవలసినదని ఫిరోజ్‌షా సుల్తాను నర్థించెను ఆసన్నరాజ్య విస్తరణకే ఎదురుచూచుచున్న ఆ ఫిరోజ్‌షా సుల్తాను హిందూరాజ్యముల విషయంలో జోక్యము పెట్టుకొనుటకు తనకు లభించిన అవకాశము జారవిడుచుకొనలేదు అన్నచోడదేవునికి సహాయముగా సైన్యములు దీసుకొని కాటయవేమునిపై అత్తిలి, కాకరపర్తి అనుచోట ఆతనిని దాకెను.

మరియొక అంశమేమనగా ఈ యుద్ధంలో రెండవ వైపునుండి పెదకోమటివేమారెడ్డియును బాల్గొనియుండి కాటయవేముని యెదిరించినట్లు గానవచ్చుచున్నది రాజమండ్రి మ్యూజియంలోగల

---

9. ఇంకొల్లుశాసనము (1411). E. P. Coll. No. 798 1922.

10. Briggs : Ferishta, II. P. 370 & I. A. XXVIII. P. 186.

శాసనము దీనిని కొంతబలపరచుచున్నది[11] ఈ శాసనములో అన్నచోడదేవుడు 'తన మిత్రుని గాపాడుటకుగాను (బంఘువేమా) పినఉండిరాజు అధ్వర్యుడుగను, కన్నడులు మొదలైన శత్రువులు యజ్ఞపశువులుగ జేసి తానొక వీరయజ్ఞము జేసినట్లు' దెలుపుచున్నను చివరకు కాటయవేముని యుద్ధములో పెదకోమటివేమారెడ్డి తరపున బోరాడినట్టి 'గుజ్జారావు తిప్పనివలన' హతుడైనట్లు కొప్పునోలువారి వంశప్రశస్తి దెలుపు చాటువువలన దెలియుచున్నది ఈ గుజ్జారావు తిప్పడు వెలుగోటి రాయపనాయనింగారికి సంబంధించినవాడు గుంటూరు మండలములో ఇతని శాసనములు కొన్ని గానిపించుచున్నవి[12]

కాటయవేముడు 1414 లో మరణింపగా రాజమండ్రి నగరము అన్నచోడదేవునికి చేజిక్కినను ఎంతోకాలమాతని చేతిలో అది నిలచియుండనేలేదు తుదకు అల్లాడరెడ్డితో బోరాడి 1416 మధ్యలో ఈ అన్నచోడదేవుడు హతుడైయుండెను అల్లాడరెడ్డి వేయించిన

11. యవనులగెల్వడే యంబరాయలు మూడ
నెట్లయిన కంబము మెట్టబెట
పరపంథియోధులఁ బరపఁడే వాడియై
నుద్దండవృత్తి కోనూరియొద్ద
కాటయవేము భూకాంతు సైన్యంబెల్లఁ
గొట్టఁడే యలగుండు గొలనిక్రేవ
చమడపామాత్యుని సాచితాఁ గొట్టఁడే
కొండవీడా పెద్ద కొండగవిని
ప్రబల రణరంగ జయభేరి బాంకృతుండు
రాయచేకోలుగండ ధరావిభుండు
రామరఘురామబలభద్ర రామనిభుఁడు
ధీప్రబలుఁడైన గజరావు తిప్పమనుఁడు॥

Mac. Mss 15–4–3 PP. 112-113.

12 Ep. Coll. No. 145 of 1917 and Ibid No. 825 of 1923, No 512 of 1928–29, No. 23 of 1929 and Ep Coll. No. 173 of 1913.

**(శాసనకర్తల మూలవంశం రేచర్లవారిది. ప్రస్తుతం వీరికీ – రాచకొండకు గల సంబంధమేమిటో దెలుసుకొనవలసియున్నది.)**

సమయమున కృష్ణానది నానుకొనియున్న వేదాద్రి - వాడపల్లి యను స్థలములలో నివసించినట్లు దెలియుచున్నది 1417 కాలమునాటి వారి శాసనములు కొన్ని అక్కడ గలవు.[18]

ఫిరోజ్‌షాకు రాజమండ్రిలో గలిగిన యోటమి తెరువాతగాని విజయనగరమువారి చేతిలోనున్న పానుగల్లుదుర్గపు ప్రాధాన్యము గుర్తునకురాలేదు ఈ దుర్గము రాచకొండ భూభాగము దైనను అది రాయలచేతిలోనున్నది. విజయనగరమునుండి రాజమహేంద్రవరమునకందు సహాయమంతయు ఈ వైపునుండే జరుగుచుండెను కనుక దాని నాక్రమించి విజయనగర సైన్యముల నిలువరించవలెనని ఫిరోజ్ షా 1417 లో పానుగల్లుపైకి బయలుదేరియుండెను. పెదకోమటివేమా రెడ్డికిని దీనితో సంబంధముండవచ్చును రాజమండ్రికి జేరుగున్న విజయనగర సహాయమాపుట వేమా రెడ్డికి మిక్కిలి అవసరము. కనుక సుల్తానుకు సహాయముగా తనసోదరుడైన మాచారెడ్డిని సైన్య మొసంగి బంపియుండెను [19] ఇది రెడ్డిరాజ్యమునకు - వెలమరాజ్యము నకు మధ్య తీవ్రపరిణామములకు దారితీసియున్నది.

## అనపోతానేడు - దేవరాయల మైత్రి

పెదకోమటి వేమారెడ్డికి, ఫిరోజ్‌షాకు నూతనమైన మైత్రి సంఘటించినంతనే రాచకొండవారి పరిస్థితి మిక్కిలి సందిగ్ధమగు బడినది బహమనీసుల్తాను తమతో మైత్రినెరపుచున్నట్లే యుండి, తమకు విరోధులైనవారితో మైత్రిని గలిగించుకొని, తమ భూభాగము నందే సేనలుంచుచు, తమపై గనపరచుచున్న విధానము మిక్కిలి అసంతృప్తికి కారణమైనది. ఇది వారియునికికే ప్రమాదము ప్రమాదకరము గావచ్చును ఈ పరిస్థితులలో తామిక విజయనగరాధీశులతో శత్రుత్వము వహించుట లేక వారి సైన్యముల నెదిరించుట ప్రమాదకరమని దలచియుండిరి. ఇంతకుపూర్వమే ఈ పరిస్థితులను జాగ్రత్తగా గమనించుచున్న దేవరాయలు రాచకొండతో సఖ్యత నేర్పాటు జేసుకొనుటకై ప్రయత్నము లారంభించియుండెను. ఇది జరుగుచుండగనే

18. Ep. Coll. No 306–307. 1924.
19. History of the Reddy Kingdoms. Chapter IX P. 165.

పానుగల్లుకోటలో పోరాటము తీవ్రమైనది. కోటలోనున్న కర్ణాటసేన లకు బయటిసహాయము తగినంత అందకపోయినందున వారిపరిస్థితి విషమముగా మారజొచ్చినది ఈలోగా ఏర్పాట్లు యేమిజరిగినవో, దేవరకొండలోనున్న పినవేదగిరినాయుడుధరణికోటపై ముట్టడి గావించి మాచారెడ్డిని సంహరించివేసెను. ప్రత్యేకించి దీనికెట్టి కారణములు తెలియవుగాని సుల్తానువైపున మాచారెడ్డి పానుగల్లు యుద్ధమున పాల్గొనియుండుటయే గావచ్చును ఈ సంఘటనలో దేవరాయల ప్రోత్సాహము రాచకొండవారికి లభించియుండవలయును. కారణ మేమనగా అప్పటి పరిస్థితులలో దేవరాయల సహాయమే లేనిచో, సుల్తానుతో సఖ్యతగనున్న కొండవీటి నెదిరించుటయు అసాధ్యమైన కార్యము కనుక వెంటనే వారికి మైత్రి గానగూడి అది స్థిరపడ సాగినది.

దేవరాయలతో మైత్రి స్థిరపడుటయేమి, పానుగల్లు పోరాట ములో తీవ్రమైన మార్పులు గలుగుటయేమి ఒక్కసారి ఆ యుద్ధ రంగమును మార్చివేసినది సుల్తానుసేన లీపర్యాయము రెండువైపుల నుండియు వచ్చిన మిత్రసేనల చేతిలో చిక్కుకొని కొంతవరకు బోరాడి నను సర్వనాశనమైనవి రాసులకురాసులే ఆ యుద్ధరంగమున తురు ష్కుల తలలుదెగి ప్రోగుపడినవట కొందరు సర్దారులాయుద్ధరంగమున ఈ సమయమున పోరాటమునకు దిగవలదనియు సుల్తానుకు దెలిపినట్లు గానవచ్చుచున్నది. చివరకు ఫిరోజ్‌షా సహిత మా యుద్ధరంగముననే తీవ్రగాయములకు లోనై బ్రతికి బయటపడుటే కష్టమైనది [20] 1417లో ప్రారంభించిన ఈ పోరాటము రెండు సంవత్సరముల వరకు దీర్ఘముగసాగి, 1419లో గాని సమాప్తము గాలేదు దీనితో విజయ నగరాధీశులకు రాచకొండ వారికి మైత్రి దృఢతర మైనది

రాచకొండవారి విజయోత్సాహముతో దిరిగివచ్చియుండిరో, ఇంకా లేదో, వారు మరొక తీవ్రపరిస్థితి నెదుర్కొనవలసి వచ్చినది.

20. Briggs Ferishtha. PP 390-91 of The Burhan-i-Ma'asir (I. A. XXVIII P 188) the Tabaquat i- Akbari (bib-Ind) iii PP 17-18 The Muntakhab-al-Lubab (Bib-Ind) iii PP 63-64
Ep Ind Vol. XXVI - I PP. 36 ff.

మాచారెడ్డి మరణముతో ప్రతీకారమునకై నిరీక్షించుచున్న పిన కోమటివేమారెడ్డి దేవరకొండ ప్రాంతముపై దాడి యొనరించి యొంటరిగా వచ్చిన పినవేదగిరిని సంహరించివేసెను. ఈ యుద్ధరంగ మునకు తావైనస్థల మేదో తెలియుటలేదు వేదగిరి మరణముతో రాచకొండ వారికి పిడుగు పడినట్లైనది. తాము పెదకోమటివేమా రెడ్డిని యెదిరించుటయో లేక అధికారమును గోల్పోవుటయో యనునం తటి తీవ్రపరిస్థితి గలిగినట్లు భావించిరి. పానుగల్లునుండి తమ సైన్య ములన్నియు జేరిన వెంటనే అనపోతానేడు పినవేదగిరి సోదరుడైన లింగమనేనిని– సర్వజ్ఞసింగమనాయని తోడుగా గైకొని కొండవీటిని దాకి యుండెను. దేవరాయల సహాయముగూడా వీరి కందియున్న యుండవచ్చును.

కోమటివేమారెడ్డికి ఈ పోరాట ఫలితమునుగురించి పెద్దలంతకు పూర్వమే కుమారవేదగిరినేనిని జంపవలదని హితవు జెప్పిరి.[21] కాని యాతడది పెడచెవిని బెట్టియుండెను. చివరకీ యుద్ధరంగమున లింగమనే డీతనిని జెరబట్టి సంహరించినట్లు గానవచ్చుచున్నది.

వెలుగోటి వంశావళిలో పెదకోమటివేమారెడ్డిని గురించి జెప్పిన అంశములు ఒకటినిమించి యొకటి గనిపించుచుచున్నవి. వీటిలో గల విషయభేదము ననుసరించి యుద్ధరంగముననే పెదకోమటి వేమారెడ్డి బడియుండక పోవచ్చునని దోచక మానదు. కాని ఉంగా మాత్రమున వా రీతనిని వదలియుండరని తలచుట కవకాశములేదు. చేజిక్కిన శత్రువు విషయములో రాచకొండవారు దాక్షిణ్యభావము నెప్పుడు జూపియుండ లేదు. మొత్తముపై 1420 లోనే, ఈ యుద్ధ

21. సురదాను మన్ననఁ జూచు కొంటివిగాని
వారితో దొరయుట వలవ దనవు
అనుపమంబుగఁ గొమర వేదాద్రి నిట్లు
ఘనతరంబుగఁ దమ్మ పక్షమునఁ బెట్టి
కొరల బుద్ధులవిని యిటు దొరలఁబడియు
మన్నబడితివి పెదకోమటన్నమవే.

వె. వం. పు. 39. ప. 108.

కారణముననే పెదకోమటివేమారెడ్డి గూలియుండుననుటకు సందేహము లేదు[22] ఆ తరువాత యాతని శాసనములును గానుపించుట లేదు. 1420లో కొండవీటి రాజ్యమును కొంత విజయనగరమువారు, మరికొంత గజపతులు నాక్రమింప, మిగిలిన కొద్ది భాగమును రాచవేమారెడ్డి పాలించి యుండెను[23]

అనపోతానేడు రాజ్యమునకు వచ్చినది మొదలుకొని చివరి వరకును ఆతనికి ప్రశాంతత జిక్కినదిగాని, సుఖపడినదిగాని గనుపించుట తక్కువ. పూర్తిగా యుద్ధరంగములందే కాలము గడుపవలసి వచ్చియున్నది దానికి అప్పటి పరిస్థితులే ముఖ్యకారణ మని జెప్పవచ్చును. తుదకు వారు విజయనగరాధీశులతో మైత్రిగావించుకొనినను బహమనీ సుల్తానులతో శాశ్వతమైన విరోధమునకే గురిగావలసి వచ్చినది.

అనపోతానేని చివరికాలము సరిగా స్పష్టమగుటలేదు 1423లో ఓరుగంటి జరిగిన పోరాటమువరకును ఈతడు జీవించి యుండవచ్చునని చరిత్రకారుల విశ్వాసము. ఈ చివరికాలముననే అనపోతానేని సోదరుడైన రావుమాదానేడు సోదరుని తరపున రాజ్యభారము వహించి పరిపాలింప దొడగెను.

---

22. (a) అనవేమారెడ్డినిఁ గొట్టి తమ్ముపడిగానఁ బొదిగించి.
    (b) భువిలోన ననవేమభూపాలు జెరపెట్టి యతనిని వేడ్కతో నంపినాఁడు.
    (c) పురమిని నాకాశంబునఁ బిడుగుకరణి రావుసింగ పృథ్వీశుఁడు దా బొడు పొడుమని వెనుదగిలిన వెడవెడ జగనొబ్బగండ వేముడు పారెన్.
    (d) బిట్టుతలాటంక బల్లరగండడై యనవేమరెడ్డిని నాజిఁదునిమె.

    వె. వం పు. 39, 48, 57_60.

    (e) Ibid C0. V. 155.
23. గుంటూరు తాలూకా పొత్తూరులో దేవరాయల శాసనము. 1420 A D.
    Ep Coll. No 1250-1917.

రావుమాదానేడు - రాఘవీయము

II అనపోతానేని తరువాత అతని కుమారులు చిన్నవారై నందున అనపోతానేని సోదరుడైన రావుమాదానేడు రాజ్యమునకు వచ్చెను. రాచకొండ సంతతిలో మాదానేని పేరుగల వారిలో ఈతడే ప్రథముడు తక్కిన వారిలో మాధవ నామముగల వారందరును దేవరకొండ సంతతికి జెందినట్టివారు రావు మాదానేనికి సమకాలికులైనవారిలో దేవరకొండ యందు మరియొక II మాదానేని పేరుగల వారింకొకరు గలరు. వంశవృక్షము ననుసరించి వీరిని గుర్తించుకొనిన గాని ఈ అన్వయము బోధపడ జాలదు.

రావుమాదానేడు II సింగభూపాలుని వలెనే గొప్ప విద్వాంసుడు శాసన పూర్వకముగా యొక ప్రభువు పాండిత్య విషయము, ఆతని కావ్యరచన, కృత్యాది సమర్పణములు తెలియ వచ్చిన వారిలో ఈతడే ప్రథముడని జెప్పవచ్చు రావుమాదానేని విద్యాభూషణము — కీర్తి ప్రతిష్ఠల గురించి రెండు శాసనములు జక్కగా దెలుపుచున్నవి వానిలో నొకటి రాచకొండలోను మరి యొకటి దానికి సమీపముననే గల 'నాగారం' అను గ్రామంలోను వేయబడి యున్నవి ఈ మాదానేని శాసనములు మరిరెండు గన బడుచున్నవి వాటిలో 1421 కాలమునకు జెందిన తామ్రశాసన మొకటియు,[24] 1422 కాలమునకు జెందిన తొల్లూరుస శాసన మొకటియు,[25] మొత్తము నాలుగు శాసనములు గనిపించుచున్నవి.[26]

రాచకొండలో నున్న మొదటి శాసనములో ఈ మాదానాయుడిట్లు వర్ణింపబడి యుండెను దీనిలో కాలము ఉదాహరింపబడలేదు.

---

24. Ep. Ind Vol. No XIII. 13 – P 237·
25. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. సం. III.
26. **రాచకొండ శాసనములు ముఖ్యముగా మాదానేనివి చాలాకాలమైనను ముద్రణయై యుండలేదు.**

“కీర్త్యా కాంతి సుతాయతే . . హం సాయతే తేజసి
స్వర్లక్ష్మీశ మహాయతే వితరణే భోగే శచీశాయతే
సంగీతే భరతాయతే సుకవితా భాగే చ భాషాయతే
చాతుర్యం కిము రామమాధవవిభో స్తత్ర జన్మ శ్రీనిధే”
“శ్రీచల్లాన్వయ మౌళిమండన మసౌ తస్మిన్ విహారస్థలే
రాజా నాగనగరే ప్రశాసతి సతా మంత్రధత్తమా మండలమ్
భోగశ్రీ ... గిరి స్థిరతరం శ్వేతాద్రి నాథాఖ్యయా
సీతారామ మభివ్యదత్త స కుజే సానంద మాఘే జయే”

1921 నాటి తామ్రశాసనములో ఈ మాధవనేడు తొల్లూరు అను గ్రామమును ‘శ్రీరంగపురాగ్రహార’మని పేరిడి, దానిని ఆ శ్రీరంగనాథునకే, నిత్య నైవేద్యంగరంగభోగ జీర్ణ ప్రాసాద గోపురాది సమారాధ్యసేవా సముచిత కైంకర్యార్థమై, దానమొసంగినట్లు తెలిపియుండెను.

1422 నాటి తామ్రశాసనమున శ్రీశైల వంశమునకు చెందిన రామానుజాచార్యుల పుత్రుడైన వెంకటాచార్యులవారి కితడు శిష్యుడైనట్లును తాను చెప్పుకొని యుండెను

రామమాధవనేని ఖ్యాతి విశేషముగా వెలుగుచున్నది నాగారం శాసనము. ఇది ఇతని ధర్మపత్నియైన నాగాంబికాదేవి ‘నాగసముద్రమును’ తటాకమును త్రవ్వించి అక్కడ ఒక శాసన ప్రతిష్ఠ గావించెను. శాసన కాలము 1429. ఈనియందే నాగాంబికాదేవి తన భర్త వాల్మీకి రచించిన రామాయణమునకు ‘రాఘవీయ’ మను వ్యాఖ్యానము రచించి 1427 లో దాని నా శ్రీరామచంద్రమూర్తికే యంకిత మొసంగినట్లు తెలిపియున్నది[27] కాని దురదృష్టమున ఆ కావ్యమింకను బయటపడలేదు బయటపడునను యాశగల్పించు కొన్ని వార్తలు వెలువడుచున్నవి నాగాంబికాదేవి నిర్మించిన యా తటాకము

27. శాకాబ్దేనిధి వారిరామ శశిగే ప్లవంగే శుభే, మాసే ప్యాశ్వయుజే రఘూద్వహపదే మోరాఘవీయాహ్వయామ్, టీకాముద్ర పటు ప్రబోధ ఘటనా మాణిక్య పుష్పాంజలిం, కృత్వా రాజతి రామమాధవ నృపో రామాయణస్య శ్రియే.
A catalogue of Ins, up to 1964. No. 308. A. P.

ప్రాచీన నిర్మాణములలో మిక్కిలి ప్రసిద్ధమైనది. నేటికి యది చెక్కు చెదరక ఆ ప్రాంతవాసులకది సమృద్ధిగా సేద్యమునకై నీరొసంగు చున్నది.

పై శాసనముల ననుసరించి ఈ మాధవభూపాలుడు 1421 నుండి 1430 వరకును రాజ్యమును పాలించి యుండవచ్చునని తెలియు చున్నది. సర్వజ్ఞ రావుసింగభూపతియు ఈ సమయమున యువ రాజుగా నుండి యుండును.

మాదానేడు రాజ్యమునకు వచ్చినవెంటనే విజయనగరాధీశు లతో పూర్వస్నేహమునే పాటించుచు వారికి బహమనీసుల్తాను లతో జరుగుచున్న యుద్ధములందు మిక్కిలి సహాయము గావించెను 1422 లో ఫిరోజ్‌షా మరణించిన వెంటనే యా రాజ్యమునకు అహ్మదుషా (1422–35) రాజయ్యెను ఆతడధికారము చేపట్టిన వెంటనే పానుగల్లు యుద్ధమున తమకు గలిగినట్టి పరాభవమునకు చింతించి విజయనగరముపై దండయాత్రకు బయలుదేరి తుంగ భద్రానది కీవల తన సైన్యములు నిలిపియుంచెను

తురుష్క సేనల వార్త యందినవెంటనే దేవరాయలు తన మిత్రసేనల నాహ్వానించి శత్రుమూకలపైబడి దరుముకొనుచు బోయి బాదామి, తోరగల్లువంటి దుర్గములు బట్టుకొని మునక పోరార్జునుని జయించి, యాదవకొండ నాక్రమించెను. తురుష్క సేనలీ మిత్రసైన్యముల నెదిరింపలేక ఛిన్నాభిన్నమై పారిపోయినవి. రాచకొండ నుండి సహాయముగా వచ్చియున్న తెలుగు సేనలకు మాదానాయక లింగమనేడులు నాయకత్వము వహించి యుండిరి. చివరకు ఆ తురుష్కాధిపతి లొంగిపోయి విజయనగరము వారితో సంధి గావించుకొనెను గుల్బర్గావెపు సాధించిన ఈ మిత్రసైన్య ముల విజయముగూర్చి 'ముడుబిదిరె' శాసనము (1429–30) కొంత సమాచారము నిచ్చుచున్నది [28]

నాగాంబికాదేవి శాసనము తరువాత రావుమాదానాయుని ప్రసక్తి మరి గానవచ్చుటలేదు

28. S. I. I Vol. No. 202. (Ep. coll No. 330 of 1901)

## IX

# III సర్వజ్ఞ రావుసింగభూపాలుడు

రాచకొండను పాలించిన తెలుగు ప్రభువులలో చిట్టచివరి వాడు సర్వజ్ఞ రావుసింగభూపతి. సింగభూపాల నామధేయులలో ఈతడు మూడవవాడు గనుక, మూడవ సింగభూపాలుడని లేక ముమ్మడి సింగభూపాలుడని ఈతని పేరు వాడుచుండుటగలదు పిన అన్నమనేనిని జెప్పబడు II అనపోతానేని కుమారుడీ సింగభూపతి. అనపోతానేనికి సింగభూపతితోపాటు వసంతానేడు, కేశవనాయుడు మరియు రావుసర్మానేడు అను ముప్వురు పుత్రులుగలరు. వీరిలో పెద్దవాడీ సింగభూపతి

సింగభూపాలుని చరిత్రలో గానవచ్చుచున్న కొన్ని ముఖ్య సంఘటనలు యాతని శౌర్యపరాక్రమములకన్న – ఆతనికిగలపాండిత్య విశేషము–రాసిక్యతనుగూర్చి దెలుపుచున్నవి. ముఖ్యముగా యితడు పండిత వంశములోని ప్రభువు ఈతని తాతగారైన II సింగభూపతి పినతండ్రియైన రావుమాదానేడు సకలశాస్త్ర విద్యాపారంగతులు- ఉత్తమకావ్య నిర్మాతలు. చిన్ననాటనే ఈతనికి పూర్వీకుల సంస్కారము కొంత యబ్బియుండును. గురుజన సంపర్కము ఈతనికి సహాయముగనున్నందున సహజముగనే ఈతనికి కొంత సాహిత్యాభిలాష గలిగియుండవచ్చును. కనుకనే కవిసార్వభౌముడైన శ్రీనాథుడీతనిని దర్శించుట, మహాకవి పోతనామాత్యుడీతని యాస్థాన మలంకరించుట మొదలైన యుజ్వల ఘట్టములు ఈతని చరిత్రలో ప్రథమస్థానము జేసుచున్నవి ఈతనికిగల సర్వజ్ఞబిరుదము శాసనపూర్వముగా దెలియుట యొక విశేషము లభించిన సాక్ష్యము స్వల్పమైనను పాండిత్యమానం దీతడు ప్రతిభావంతుడే యనుటకు దగిన అవకాశములు గలవు

### కాలము

చారిత్రిక పరిణామములలో జరుగుచుండు వివిధ సంఘటనలు, వివిధ వ్యక్తులనుగూర్చి సమగ్రముగా దెలియవలెనన్న నో ఆ యా కాలములు సరిగా దెలియుట చారిత్రక కథనమునకు ముఖ్యావసరమై

యుండును సింగభూపతి నామధేయులలో ముగ్గురు వ్యక్తులు ప్రముఖులైనవారుండిరిగనుక - వారేయే కాలములో ఉండిరో తెలుసుకొనుటకు అవకాశము లేనప్పుడు పూర్వము కొంత గందరగోళమేర్పడియుండినది వాదప్రతివాదములు జరిగినవి ఆ చర్చలన్నియును చారిత్రక కాలమునకు సరిపడి యుండనందున గనుక ముందు సింగభూపాలుని కాలవిషయమై లభించుచున్న సాక్ష్యమేమిటో తెలుసుకొనవలసియున్నది సింగభూపాలుని పేరములో లభించుచున్న శాసనాధారము క్రిందివిధముగానున్నది

1. చినకంజీవర శాసనము (చెంగల్పట్టుజిల్లా) [illegible]. శ 1437. సింగభూపతి సోదరుడైన వసంతానేనిచే [illegible] [illegible] దేవాలయమున వేయబడినది.[1]

2 ఉల్లంకొండ శాసనము క్రీ శ 1453 నృసింహస్వామియాలయమున సింగభూపాలుడు స్వయముగా వేయించినది[2]

3 శాయింపేట శాసనము (వరంగల్లుజిల్లా) క్రీ.శ 1464. సింగభూపాలుని సోదరుడైన రావుధర్మానేడు వేయించెను [illegible] కనేక అగ్రహారములిందు దానముగా ఇవ్వబడినవి[3]

4 తిరుపతిశాసనము క్రీ శ. 1475 [illegible] కానుక లొసంగుచు సింగభూపాలుడు స్వయముగా వేయించిన శాసనమిది ఈ శాసనమందితడు '[illegible]' [illegible]జ్యాలుపనియు, దేశాంతరాళ విశ్రాంతియశస్కుడని [illegible] ను వర్ణింపబడెను అంతేగాక వీరి పూర్వీకుల [illegible] ఖండనోద్దండ కేసరి, ఖడ్గనారాయణ, [illegible] పనదేశిక, గాయగోవాళాది ప్రసిద్ధమైన [illegible] చారిత్రకముగా ఈ శాసనము మిక్కిలి [illegible][4]

1 EP. Coll No 634 of 1919.

2 V R Inscriptions of the Madras Presidency, II Gt, 767.

3. తెలంగాణాశాసనములు. నం. 2. (H A. S 19- W. G 18 P. 161 to 166)

4. T T D. EP. Series Vol. II. No 58. P. 109. ఈతనిసోదరుడైన కేశవనాయుని శాసనములు మరిరెండిచ్చటగలవు. కాలము_1475.

పై శాసనములలో 1437 నాటి వసంతారాయుని శాసనము, 1475 నాటి సింగభూపాలుని తిరుమతిశాసనము ఆతని కాలము గను గొనుటకు మిక్కిలి సాయపడుచున్నవి. కారణమేమనగా సింగభూపతి సోదరుడైన వసంతారాయుని శాసనకాలము 1437 నాటికే యుద్ధ రంగమున పాల్గొనదగిన వయసులోనున్నవాడని తెలియుచున్నది. భోగినీ దండకమునందు, వసంతావనీనాథ సంసేవితాంచత్పదాం భోజాదని ఆతడు పేర్కొనబడియుండెను అనగా శాసనకాలముననే ఈ సోదరులిద్దరు 32–30 వయసులో నుండవలయునని తెలుచున్నది. ఇక తిరుమతి శాసనము (1475) ఆతని చివరి కాలపుదగునని చెప్పవచ్చును. కనుక పై యాధారముల ననుసరించి ఈ మహాశయుని పాలనము 1405 నుండి 1475 వరకని నిశ్చయింపవచ్చును. దీనిలో నొకటి రెండు తేడాలున్న యుండవచ్చునుగాని అది సంవత్సరములు దాటియుండదు

పరిపాలన

సింగభూపాలుడు పరిపాలనకు వచ్చునాటికి ఆంధ్రదేశమునగల రాజకీయ పరిస్థితులు మిక్కిలి గడ్డుస్థితిలోనున్నవి. తమకు మిత్రులను కొన్న విజయనగరాధీశులు తమ యిరువురికి సమాన శత్రువులైన బహామనీ సుల్తానులతో సంధిగావించుకొని కేవలము తమ స్వలాభాపేక్షనుమాత్రమే గూర్చుకొనుచుండిరి విజయనగరమువారి ఈ స్వార్థచింతన రాచకొండపై బహమనీసుల్తానులు రెచ్చిపోవుటకు అవకాశము గల్పించినది సుల్తానులకు యెదురుతిరిగి – విజయనగరాధీశులకు సహాయము చేసినందుకు, రాచకొండ యధిపతులపై పగబూని అహ్మదుషా ఓరుగంటిపై బడి దానినాక్రమించెను ఈ యుద్ధమున ఓరుగంటిలోనున్న దుర్గాధిపతి ఎవరో మరణించెనని మహమ్మదీయ చరిత్రలు కొన్ని చెప్పుచున్నవి[5] అనపోతానేడేమోనని కొందరి భావన కాని కొందరు చరిత్రకారులట్టి సంఘటననుగూర్చి వ్రాసియుండలేదు[6] ఏమైనా యిది సందేహాస్పదమైన విషయము

5 Briggs Ferishta, II P 405.

6 The Burhan-i-Ma'asir, I A XXVIII P 210.

అహ్మదుషా ఓరుగంటి నాక్రమించిన వెంటనే సింగభూపా లుడు పినతండ్రియైన మాదానేని, లింగభూపాలుని వంటి వీరులు గలసికొని 'ఆజిమ్‌ఖాన్' మొదలైన తురుష్క సర్దారుల నోడించి తిరిగి యా దుర్గమును వశము గావించుకొనిరి 1425 లో ఓరుగంటి దుర్గము స్వాధీనమైనవెంట సింగభూపాలుడా సింహాసన మధిష్ఠించి యుండెను

సింగభూపతి రాజ్యమునకు వచ్చిన వెంటనే ఓరుగంటిలో సాంస్కృతిక జీవితము తిరిగి వికసింప నారంభించినది పండిత హృద యము గలవాడు గనుక తన యాస్థాన విద్యాపీఠమున తగిన విద్వాం సుల జేర్చుకొని వారినెంతో సత్కరించు చుండెను పదుచుదనమున నున్న బమ్మెరపోతనకవియును సింగభూపాలుని యాహ్వాన మందు కొని ఆతని కొలువులో జేరియుండెను దాదాపు పది సంవత్సరము లైనను సింగభూపతి విద్యాపీఠము కళకళలాడియున్నది.

## చిక్కులు

సింగభూపాలుని దురాదృష్టముగావచ్చును, ఇంతలోనే ఆతనికి కొన్నిచిక్కులు దాపురించినవి మాళవగుజరాతు దేశములతో పోరాడు చున్న అహ్మదుషా యెట్లో వారితో సంధిగావించుకొని తిరిగి ఓరు గంటిపై దండయాత్ర గావించెను సింగభూపాలుడు ఆయత్తమై లేకనో లేక యుద్ధమనిన విముఖుడో గాని ఆ తురుష్క సైన్యము నెదిరింపకనే వారితో సంధిగావించుకొని యుండెను ఇది యాతని అపజయమునకే నాందివాచక మైనది కాని పరాక్రమ హీనుడని మాత్రము జెప్పుట కవకాశము గనిపింపదు.

అహ్మదుషా యును రాజధానికి మరలిపోవుచు తనకు స్వాధీన మైన 'భువనగిరి' దుర్గమును 'సంజర్‌ఖాన్' అను సర్దారు వశము గావించి తెలంగాణా యంతయు స్వాధీనము గావించుకొన వలసినదని ఆతని నాదేశించి వెడలిపోయెను. సుల్తాను మరలిపోయిన వెంటనే సంజర్‌ఖాన్ తిరిగి సైన్యముల సిద్ధముజేసి 1435లో ఓరు గంటి నాక్రమించినట్లు దెలియుచున్నది.

మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన వ్రాతలు జూచినచో అప్పటికే సంజర్ ఖాన్ రాచకొండవంటి దుర్గముల నాక్రమించినట్లు వ్రాసియుండిరి.[7] కాని అందు కాధారములు గనిపించుటలేదు. అదే నిజమైనచో సమరకేసరి యైన లింగభూపతివంటి వాడు తక్షణమే వానిని నెదుర్కొని యుండును. కాని యాతడు ఇతర ప్రాంతములందు పెక్కు విజయములు చేయుచుండుట వలననే, తగిన సైన్యములు లేని కారణమున సుల్తాను నెదిరింపలేక సింగభూపతి అలక్ష్యమును గావించె. ఇది యీ రాజ్యవినాశనమునకు దారితీసియున్నది.

1435 సంవత్సర కాలములో రాచకొండ పరిస్థితులు మిక్కిలి యల్లకల్లోలములైనవి. గద్దెపైని నామమాత్రముగ నైనను సింగభూపాలు డప్పకాలమున గలడో లేదో తెలుసుకొనుటకు దగిన అవకాశములు లేవు. 1455 నాటి ఈతని శాసనమొకటి బెల్లంకొండలోనున్నది గనుక అంతకు పూర్వ మెప్పుడో యాతడు రాచకొండను వదలి యుండవచ్చును. ఆ సంవత్సరము ఈ భూపతి చరిత్రయంతయు లింగమనేనితో గలిసిపోయియున్నది. దేవరకొండ యుద్ధమున (1458) సింగభూపతి పాల్గొనియుండెనేగాని అందాతని వివరములు దెలియుటలేదు.

సింగభూపాలుని చివరికాలము సహితము చిక్కులకే లోనైనట్లు దెలియుచున్నది. గజపతి మూలమున గలిగిన చిక్కులవలన ఈతడు విజయనగరాధీశుల కొలువులో జేరి పురుషోత్తమగజపతి నెదిరించవలసి వచ్చినది. ఆ సందర్భమే నేమో – పురుషోత్తమగజపతి సామంతుడైన తిమ్మభూపాలుడను వాడు సింగభూపతి నెదిరించి పరాభూతిని గావించినట్లు దెలియుచున్నది. ఈ గాథను గురించి దెలుపుచున్న కావ్యములు రెండు గానవచ్చుచున్నవి. ఒకటి విష్ణుభక్తిసుధాకరము. మరియొకటి ఉషాభ్యుదయమను కావ్యము. ఇవి ముద్రణ గాలేదు. వీనిలో మొదటి కావ్యమందు రావుసింగభూపాలుని సంగరరంగమున పరాభూతుని గావించెనని, మరియొక దానిలో

---

**7. Briggs : Ferishta, II. PP. 412, 423. Ibid (I.A XXVIII. P.215, 216, 237) The Burhan-i-Ma'asir (I. A. XXVIII P. 215 to 217.**

సంగరరంగమున దునిమెనని పరస్పర విరుద్ధముగా నవి వ్రాయబడి యున్నవి. మరి ఇందేది నిజమో నిర్ణయించుట కష్టము. ఏదైనా 1475 తరువాతనే అట్టి సంఘటన జరిగియుండవచ్చును.

సింగభూపతికేగాని ఆతని సోదరులకు గాని సంతతి గలదో లేదో బొత్తిగా తెలియదు. ఏమైనను రాచకొండ ప్రభుత్వమునకు తుదిచిహ్నమైన యీతని చరిత్ర దీనితో సమాప్తమగు చున్నది.

## శ్రీనాథుడు - సర్వజ్ఞ సింగభూపాలుడు

శ్రీనాథకవి సింగభూపాలుర విషయంలో చిరకాలమునుండి వినవచ్చు గాథ లేగాక యీతడు దర్శించినది రాచకొండ భూపతి యైన మూడవ సింగభూపతినే యని చారిత్రిక యాధారముల ననుసరించి చెప్పవచ్చును. దీనిని బలపరచు వానిలో మొదటి సాక్ష్యము కొండవీటి యాస్థానమున శ్రీనాథకవి చేరియున్న కాలము. అది 1404 ప్రాంతము. ఈ కాలమునకు రసార్ణవసుధాకర కర్తయైన సింగభూపతి జీవించియే లేడు. కనుక రెండవ సింగభూపతిని శ్రీనాథుడు దర్శించెనని యాలోచింప అవసరము గనిపింపదు.

ఆ తరువాత చెప్పదగినది కొండవీటి—రాచకొండ రాజ్యముల యొక్క సంబంధ వ్యవహారములు. ఈ విషయములో మొదట

---

8. త్రిభువన రాయాంక దీపితు రావుసిం
గనపు బరాజితుగా నొనర్చె
నని శరణన్న బాహాతి ఖానునిఁ గాంచెఁ
బటుశక్తిచే నోడవల్లి గానియెఁ

—విష్ణుభక్తి సుధాకరము.

త్రిభువనరాయ బిరుద ప్రదీప్తుఁడైన
రావుసింగని సంగరరంగమందుఁ
దునిమెఁ బెదవీటిచెంత సద్వినతుఁ డగుచుఁ
గలన శరణన్న బాహాతిఖాను గాంచె.

—ఉషాభ్యుదయము.

Further Sources of Vijayanagara History. Vol. II P. 66-67.

నుండియు ఈ రెండు రాజ్యములకు నడుమ సామరస్యము లేదు. పెదకోమటి వేమారెడ్డి కాలమునుండి ఈ సంబంధము పచ్చగడ్డిలో నిప్పు వేసిన మంటవలె నున్నది. రాజ్యసాధన విషయంలో సుల్తాను ఫిరోజ్‌షాతో స్నేహసఖ్యత గావించుకొనినందున రాచకొండవారి కని యాగ్రహకారణమైనది. దీనితో అప్పటి రాజకీయ పరిస్థితు లన్నియు తారుమారైనవి. కనుక 1404—1420 వరకు శ్రీనాథుని పర్యటన కాలము అనుకూలముగాదు.

ఇక సింగభూపాలుని దర్శించుటకు పూర్వమే కనకాభిషేకము జరిగినట్లు శ్రీనాథుడు చెప్పియుండుటచేత ఆ కాలమును ముందు తెలుసుకొనవలసి యున్నది. కనకాభిషేక ఘట్టమును గురించి వెలుగోటి వంశావళి సాక్ష్యమేగాక కాశీఖండములోని యొక పద్యము దీనిని చక్కగా వెల్లడి చేయుచున్నది[9]. అయితే దీనికి ముందు మరికొన్ని అంశములను చూడవలసి యున్నది. రాజమహేంద్రవర కాటయవేమారెడ్డి 1410 లో విజయనగరాధీశుని సహాయమునకై వెడలి వచ్చియున్నవాడు గనుక[10] పెదకోమటివేమారెడ్డియును సుహృద్భావ సాధనకై (రాచకార్యమేమో) శ్రీనాథుని యాకాలము నకు విజయనగరము బంపియుండవచ్చునేమో యని కొందరు దలచు చుండిరి. కాని అప్పటి కా పర్యటన జరిగి యుండదని, ఆ తరువాత సంఘటనలు కొన్ని తెలుపుచున్నవి. కాటయవేముడు వెనుదిరిగిన వెంటనే ఆతనికి సహాయపడుటకై విజయనగర సైన్యములు బంపబడి యున్నవి. రాజమండ్రికి బయలుదేరిన ఈ సైన్యములు కొండవీటి రాజ్యమైన బాపట్ల తాలూకా 'ఇంకొల్లు' ప్రాంతము నాక్రమించుటలో పెదకోమటివేమారెడ్డికి విరుద్ధముగనే ఈ సహాయక చర్యలు ప్రారంభింపబడినవని తెలియుచున్నది[11]. కనుక శ్రీనాథుని విజయ

9. 'కర్ణాట క్షితిపాల మౌక్తిక సభాగారాంతరా కల్పిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్య చారిత్ర' కా. ఖం.
10. కాటయవేముని అహోబిల శాసనము. (1410) Ep Coll. No. 84 – 1915.
11. దేవరాయల ఇంకొల్లుశాసనము (1411) Ep. Coll. No. 798-1922.

నగర పర్యటన 1420 లోపుగా జరిగియుండుట కవకాశముగలుగదు అది యీ పిమ్మటనే అనగా భీమఖండకృతి సమర్పణ తరువాతనే, రాజమహేంద్రవర రాజ్య ప్రాపకము సంపాదించిన తరువాతనే[12] విజయనగర రాజ్యమునకు లోబడియుండగా, 1424—1430 మధ్య కాలమున జరిగి యుండవలయును శ్రీనాథుని పర్యటనకు ప్రతిబంధకములేని కాల మిదియే గానవచ్చుచున్నది

## బలపరచు సాక్ష్యములు

భీమఖండ కృతిసమర్పణ నాటికి (1428) కవిసార్వభౌమ బిరుదమును శ్రీనాథుడు వాడకపోవుట జెప్పదగినట్టి విషయము. అప్పటి పూర్వ గద్యములలో ఈ విధముగా జెప్పుకొని యుండెను. సుకవిజనవిధేయ శ్రీనాధనామధేయ, సుకవిజన విధేయ సకల విద్యాసనాథ శ్రీనాధనామధేయ' అని మాత్రమే వాడుకొని యుండెను ఇది 1435లో కాశీఖండ కృతిసమర్పణ నాటికిగాని మార్చి కవిసార్వభౌమ బిరుదమునందు జేర్చుకొనియుండెను అనగా 1428—1435 మధ్యకాలముననే, డిండిమవిజయము, కనకాభిషేకము జరిగిన తరువాతనే, కవిసార్వభౌమబిరుదము వ్యాప్తిలోనికి వచ్చెనని దేలుచున్నది. కనుక శ్రీనాథుని పర్యటన కొండవీటి నుండిగాక రాజమహేంద్రవరము నుండియే జరిగియుండునని జెప్పదగియున్నది

ఇక 'నందికంత పోతరాజను కరారి కథ' ననుసరించి శ్రీనాథుని రాచకొండ పర్యటన దెలుసుకొనుట కవకాశము గలదు. కనకాభిషేక క్రమము తరువాతనే ఈ విషయ ముదాహరింప బడినట్లు పూర్వము జెప్పబడియున్నది దేవరకొండలో నున్న లింగమనేనిని శ్రీనాథుడు దర్శించునపుడు 'అల్లయ వేముని గెల్చినట్లు' ఆతని నొక పద్యమున జెప్పియుండెను[13] అల్లయ పుత్రుడైన ఈ వేమారెడ్డి రాజ

---

12. తెలుంగురాయల సింహాచల శాసనము (1420) S.I I, Vol, No. 905 దేవరాయల'మడు బిదిరె శాసనము (1429) S.I.I. Vol. VII No 202, (EP Coll, No. 33 of 1901, History of the Reddy Kingdoms Chap. XI, P. 191.

13. (a) భీర యల్లయవేముని పరంగుమింత. పు. 40

మహేంద్రవరములో 1423-1434 రాజ్యమందున్నవాడు. లింగమనేని పూర్వవిజయయాత్రలలో 1428 నాటికి రాజమహేంద్రవర సింహాచలములను సాధించినట్లు తెలిసియున్నది కనుక ప్రాయికముగా రాజమహేంద్రవర యాజమానులు లింగమనేనితో సామరస్యమునకై ప్రయత్నించియే యుందురు. శ్రీనాథుడే ప్రయత్న భావమాననే లింగమనేనిని దర్శించి యుండవచ్చును

శ్రీనాథుడు ముందు రావుసింగని దర్శించి యా పిమ్మటనే లింగమనేని కడకు బోయియుండ వలయును

సింగభూపాలుని దర్శింపబోవుచు శ్రీనాథుడు శారదాంబను ప్రార్థించిన పద్యము.

సీ. గీర్వాణ టంకాల దీర్ఘమాడించితి
దక్షిణాధీశు ముత్యాల శాలఁ
బలుకుతోడ్తో తెలుగ్ర భాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను
బగులగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషక్రియా శక్తిరాయల యొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
ఇంతకాలము వలెఁగాదు ఏంతరీతి
నెట్లు మెప్పించెదో కదా యింకమీద
రావుసింగాంక భూపాలు దీవిశాలు
సకలసద్గుణ నికురుంబు శారదాంబ! వె. వం.పు. 63.ప. 60.

---

(b) చటులోగ్రగతి రాయశరభమై యవలీలఁ
దిరుగ సింహాద్రి సాధించినాడు. పు. 48

(c) గంగసాక్షిగ మీఱి కదిసి రాజమహేంద్ర
వరము చూఱలుగొని వచ్చినాడు. పు. 49

(d) వీరభద్రుని దొడ్డవిభు వేమనృపతుల
రట్టడ్డై కాలందెఁ బెట్టినాఁడు. పు. 52

-వెలుగోటి వంశావళి

(శరా। అను ఊతపదము శ్రీనాథుడు దొడ్డారెడ్డిపై వాడియుండెను.)

ఈ పద్యము శ్రీనాథుని రచనయేనని శివరాత్రి మహాత్మ్యమున గల కొన్ని పలుకుబడులును దెలుపుచున్నవి

'ముదితసజ్జన నికురంబ ముమ్మడాంబ' 1-24

'యుజ్వల ద్గుణనికురంబ గొమ్మడాంబ' 1-40

శ్రీనాథుడు సర్వజ్ఞుని దర్శించుటకు శారదాస్తుతి చేయవలసినంతటి పండితుడు గాడేమోనని- పద్యములో సర్వజ్ఞబిరుదము లేదని కొంద రాలోచనలు జేసియుండిరి ఈ క్రింది పద్యమునగల స్వారస్యమెట్టిదైనను సర్వజ్ఞ బిరుదముగల సింగభూపాలుని శ్రీనాథు దర్శించెననుట నిజమని జెప్పవచ్చును తిరుపతి శాసనములో సర్వజ్ఞబిరుదము పేర్కొనబడియున్నది

కం. సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ భూపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞుండనుట కుక్క సామజ మనుటే

ఇక శారదను స్తుతించుటలో శ్రీనాథుని చూపు సభనుద్దేశించిగాని కేవల ప్రభుమాత్రము గాదేమోనని జెప్పవచ్చును శ్రీనాథుడిట్టి దేవతాస్తుతి జేయుట పూర్వమొక సందర్భమునను గానవచ్చుచున్నది[14] ఇవన్నియును కేవలము ప్రయత్నసాహసములేగాని వానిబట్టి ప్రభువుల పాండిత్యము నిర్ణయించుట సరియైనదిగాదు

రాజకీయ కల్లోలములలోబడి ప్రజ్ఞావిశేషములు చూపుటకవకాశము లేని చిక్కులెన్నో ఈతనిని జుట్టుకొనిన రావుమా సింగభూపాలునిది అంతమాత్రమున నితడు పండితుడు గాడని నమ్ముట సహేతుకముగా గనిపించదు తిరుపతిశాసన మీ విషయమును జక్కగా దెలుపుచున్నది

---

14. కుల్లాయుంచితిఁ గోకసుట్టితి మహాకూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్తవడ్డింపగాఁ
జల్లా (?) యంబలిఁ ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా? నేను శ్రీనాథుఁడన్.

(ఒక చాటువు)

ఉదారుడు, రసికుడు, సర్వజ్ఞమూర్తియునైన రావుసింగభూపాలుని శ్రీనాథుడు దర్శించినంతనే యాతడు మెచ్చుకొని, సంభావించి ఘనమైన సత్కారము చేసెనని, యావదాంధ్రుల అభిప్రాయము. ఆ విషయమున నికి సందేహము లేదు

## పోతన - సర్వజ్ఞ సింగభూపాలుడు

శ్రీ కైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్ మహానందాంగ నాడింభకున్ — అని ఆంధ్రులందరికి మోక్షసాధనమైన భాగవతమును నొక మహా కావ్యమందించి శ్రీ కైవల్య పదము జేరిన బమ్మెర పోతన రాచకొండవారి విద్యా పీఠములో పేరెన్నికగన్న గొప్ప మహాకవి. తెలుగు నేర్చుకొనిన ప్రతి యాంధ్రుడికి ఆయన వారి, ఆయన పవిత్ర నామముసు పరిచిత విషయములు అన్నో భాగవత కావ్యములో గల సింగభూపాలుని నామము, భోగినీ దండకము, అప్పటి రాజ్య పరిస్థితులు మరికొన్ని తప్పక గుర్తుకు రాగలవు

**పోతన కాలము**

బమ్మెర నివాసియైన పోతనమహాకవి జీవితకాలము తెలుసుకొనుటకు ఆయన కృతులేవియు సరిగిన సమాచారము తెలుపుటలేదు కావున ఇతరాధారములచేత ముందాతని కాలమును గ్రహింపవలసియున్నను ఇందుకు గానవచ్చుచున్న ముఖ్యసాక్ష్యము చరిగొండ ధర్మనామాత్యుని చిత్ర భారతమను కావ్యము ఈ చిత్రభారత కావ్యము ఓరుగంటి సీమను 1503–1514 లో బరిపాలించిన సీతాపతి (చితాపఖాన్) మంత్రియైన ఎనుములపల్లి పెద్దనామాత్యున కంకిత మీయబడినది కావున తెలిసినంతలో పోతన మహాకవిని పూర్వకవిగా పేర్చి మొట్టమొదటిసారిగా నుతించినవాడు ఈ ధర్మనామాత్యుడే[15] నల్లింకలపాంభట్టు మరికొంద రీతనిని చేర్కొని

15. సీ. వాల్మీకి ముని కభివందనం బొనరించి
బాదరాయణునకుఁ బ్రణతిసేసి
బాణమయూరుల పాదంబులకు మ్రొక్కి
కాళిదాసునకుఁ గెంగేలు మోడ్చి (Contd)

యున్నను దగ్గరి సాక్ష్యమీ ధర్మనామాత్యునిదే యగుచున్నది. ధర్మనామాత్యునిచే రచింపబడిన చిత్రభారతకావ్యము 1505 నాటికే కృతిసమర్పణ జరిగియున్నది కనుక ధర్మనామాత్యుని కాకాలమునకు సుమారు ముప్పది సంవత్సరముల వయస్సుండునని యెంచితిమేని ఆప్రకార మాతని జననకాలము 1475 ప్రాంత మగు చున్నది అంతకు పూర్వుడైన పోతన కాలము సుమారుగా అది చివరి తిథి గావలసియుండును. కృతిసమర్పణ నాటికి పోతన నీతఁడు పూర్వకవిగా నందు బేర్కొని యుండెనేగాని సమకాలీన కవిగా జెప్పి నట్లు తార్కాణములేదు కనుక దీని ననుసరించి పోతన మహాకవి 1405–1480 కాలమున జీవించియుండెనని గట్టిగా జెప్పవచ్చును. ఇంతకుమించి పోతన కాలము మరి ముందునకు బోవజాలదు.

ధర్మనామాత్యుడు చిత్రభారతములో సీతాపతి బలపరాక్రమ ములను విశేషముగా వర్ణించి యుండెను ఈ సీతాపతి శాసనమొకటి ఓరుగల్లులో నున్నది దాని కాలము 1503 ఓరుగల్లు నాతఁడు జయించినది అంతకుపూర్వమే ఈ సీతాపతి రాచకొండ దుర్గమును స్వాధీన పరచుకొనియుండెనని శాసనమున గలదు.[16] చారిత్రక సమా చారమున కీ కావ్యము ముఖ్యమైనది మరియు నమ్మకమైనది.

---

మామల్లదేవీ కుమార భారవి మాఘ
జయదేవులకు నమస్కార మొసఁగి
ఘను నన్నపార్యుఁ దిక్కన సోమయాజుల
వర్ణించి వేములవాడ భీము
తే. నాచనామాత్య సోము శ్రీనాథుఁ జిమ్మ
పూఁడియమరేశు బమ్మెర పోతరాజు
శంభుదాసు హుళక్కి భాస్కరుఁడు నాది
యైన సుకవులకెల్ల నెయ్యమున నెరఁగి.

చిత్రభారతము – పు. 2, ప. 8.

16. రాజాద్రి ప్రముఖాని దుర్గమ శిలా దుర్గాణి భగ్నాశ్రయః (19) సితాబు ఖాన్ శాసనము 1503. A D.

## ఆస్థానకవితాపదవి

ఓరుగంటిలో సింగభూపాలుడు 1425 లో సింహాసన మలంకరింపగనే పోతనామాత్యుని తన యాస్థానమునకు ఆహ్వానించి యుండును దీనికి గానవచ్చుచున్న ముఖ్యాధారము భోగినీ దండకము. భోగినీ దండకము పోతన మహాకవి రచించెననుటకు అందుగల శైలి పదస్వామ్యములు వీరభద్రవిజయ భాగవత కావ్యములందు నధికముగా నవి జేరియుండుట యుదాహరణముగా నున్నది దండకము చివర యొక పద్యమిట్లు పోతన కర్తృత్వమును గూర్చి దెలుపుచున్నది.

ఉ. పండిత కీర్తనీయుఁడగు బమ్మెరపోతన యాసుధాంశు మా
ర్తాండ కులాచలాంబు నిధితారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదాన విహర్తకు రావు సింగభూ
మండల భర్తకున్ విమతమానవనాథ మదాపహర్తకున్.

ఈ పద్యమువరకు పోతన కర్తృకము గాదని పండితులలో నొకయభిప్రాయము గలదు మరికొందరు పోతన భాగవత దండకములు దప్ప తక్కినవేవియురచింపలేదని బేర్కొనుచుందురు. మూడవవర్గము భాగవత కావ్యముదప్ప పోతన మరేదియు రచింపలేదనియే ఘంటాపదముగ జెప్పుచుందురు.[17]

పోతనమహాకవి కృతుల విషయములో భిన్నాభిప్రాయములు గలుగుటకు భాగవత కావ్యమునకు ముందవి తీసికట్టుగా నుండుటయే

---

17. 'ఇవేవి వచ్చనివారు ఒక్కొక్క కవిని 10–15 శతాబ్దములమధ్య వెనుకకు ముందునకులాగి బీభత్సముజేసి, వాడు మాప్రాంతమువాఁడే యనియు, మావాఁడే యనియు ముప్పుతిప్పలుపడి గోవలు గోవలు పడవ్రాసి అచ్చుగొట్టి పెట్టినారు. పాపము ఓరుగల్లు పోతన్నను లాగుకొనిపోయి కడప మండలములో స్థాపించినారు. మహబూబు నగరములోనున్న అప్పకవిని గోదావరిలో వేయుదమా కృష్ణలో నుంచుదమా, లేక గుంటూరులో నాయని తగవులాడినారు.' పోతన రచనలు మొదలుకొని ఆయన స్థిరనివాసమును గురించి యింత రగడ జరిగియున్నది. వీటి ఫలితముగా కవి జీవితములన్నియు చాలావరకట్టి తత్వములకే లోనై యున్నవేమోనను భావమొకటి పాఠకులకు గలుగ చున్నది.

గోలకొండ కవుల సంచిక 1934. ప్రస్తావన. పు. 19–20.

1. 'సీమంతినీ మానసారామ వాటీవసంతున్, వసంతావనీనాథ సంసేవితాం చ శ్రీపదాంభోజు – సింగభూపాలు' P 1

2. కుమారాన్నపోతావనీనాథసూనున్ వధూ చిత్త విత్తాపహారా వధానున్ – సర్వజ్ఞసింగక్షమానాథు నీ సన్నిధానంబునన్ జెప్పిరో[6] P.8

3. రాయ చౌహత్తిమల్లున్ వధూటీ సరోజాతభల్లున్ మహారాజ వేశ్యాభుజంగున్ హయానేకప గ్రామ హేమాది నానా మహాదానచంగున్ వధూలోకపాంచాలు సర్వజ్ఞసింగక్షమాపాలు గైకొంట తప్పే? P 13

4 రాయ గోపాంగనా బృంద గోవిందుపై సంతతానందుపైఁ బోచమాంబా లసద్గర్భసంజాతుపై లోకవిఖ్యాతుపై, సింగభూపాలుపై P 14

5 పోమ్మంచు 'రా'మ్మంచు 'నో'చెల్ల రేచర్ల గోత్రోద్భవున్నానతో నందు సూ యన్నతా! యుర్వ్యాలజ్జేర లేనంచు P 15

6 మనోభూ సమానున్ ఘనున్ రావుసింగక్షమానాథ పౌత్రున్ సమీచీన రేచర్ల గోత్రాంబు జాతాత్మ మిత్రున్ మహోదార సాగిత్యసు సర్వజ్ఞసింగ ర్వరాశ్యక్షు సీక్షించి దండప్రణామంబు సాసేక గావించి హస్తాబ్జములో్మడ్చి దేవా!

పై అంశములు ననుసరించి ఇందు వర్ణింపబడినవాడు రావు సింగభూపాలుని పౌత్రుడని, కుమారాన్నపోత భూపాలుని తనయుడని, పోచమాంబ గనినవాడనియు, వసంతావనీ నాథునిచే (సోదరుడు) సేవింపబడువాడని, రేచర్లగోత్రోద్భవుడనియు III సింగభూపాలునిపై జెప్పబడియున్నది. కనుక సింగభూపతి కాలము, పోతన మహాకవి కాలము సమకాలముగా సమానమనియే జెప్పవచ్చును

## భాగవత శైథిల్యవృత్తాంతము

ఆంధ్ర దేశములోగల ప్రసిద్ధ కావ్యములు, ప్రసిద్ధ కవులపై ఎన్నెన్ని కథలు వ్యాప్తి నున్నవో, ప్రచారమొల్లు సాగియున్నదో తెలుగు పాఠకులకు ప్రత్యేకించి గుర్తుజేయు నవసరముండదు. పరిశీ

లించి జూచినచో మనకుగల ప్రసిద్ధకవులు, వారికావ్యములు నొకే యొరవడిలో బుట్టినట్లు గానవచ్చును. నన్నయకవి భారతారంభముతో ప్రారంభించి భాస్కరునిరామాయణము, రంగనాథ రామాయణము, చివరకు మహాభాగవతకావ్యమును ప్రారంభించిన కవులతో బూర్తియగుట తటస్థింపనేలేదు. పలు శైథిల్యపు వృత్తాంతములు వీటిపై గానవచ్చుచున్నవి.

భాగవతకావ్య విషయంలో శైథిల్యమునకు కారణము కృతిపతిత్వపు రగడ యని కింవదంతి యొకటి పుట్టియున్నది. ఈ గాథను మొట్టమొదట గ్రంథస్తముజేసినవారు 18 వ, శతాబ్దిలో నున్న కూచిమంచి తిమ్మకవియొకరు.[19] అంతకుపూర్వము దీని వృత్తాంతమెక్కడను గోచరించుటలేదు

దీనినాధారముగ గైకొని మంచి చెడ్డల నిమిత్తమే లేక, చారిత్రక యసత్యమైనను, పరమభక్తులు, పండితులు, పండితపోషకులునైన రాచకొండ సింగభూపాలురపై ఈ ప్రవాదునబడవేసిరి. ఈ గ్రంథములు జాలవన్నట్లే శబ్దచిత్రమొకటియు దీసి, దానినట్లు ప్రచారము గావించిరి కాని ఈ గాథ పచ్చి యసత్యమని పోతన సాక్ష్యమొకటి దెలుపుచున్నది

**ఈ కర్నాటకీచకు లెవరో ?**

'కాటుక కంటినీరు చనుకట్టుపయిం బడనేల యేడ్చెదో
కైటభదైత్య మర్దనుని గాదిలికోడల! యోమదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్మ భారతీ'[20]

---

19. 'ఘనుఁడు పోతనమంత్రి మనుభాగవతము
రచించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞ సింగయ క్ష్మావరుండది తన
కిమ్మని వేడిన నిడకయున్న
నలిగి యా పుస్తకం బవని, బాతించిన
జివికి యందొక కొంత శిథిలమయ్యె'
(సర్వలక్షణ సారసంగ్రహం పు. 265-66.)

20. పోతన చాటు పద్యము.

భాగవతంలో గల మరియొక పద్యము,

'ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే
సమ్మెట వ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్'
(భాగ. 1_11)

అని వాఙ్మయం ఘోషిస్తున్నది. మరి పై పద్యంలో గల బహు కర్ణాటకీచకులు తెలుగు ప్రభువులు గారుగదా! వారెవరు? పోనీ చాటు పద్యమని దీనిని పరిహరించినను భాగవతమందును ఈ 'మనుజేశ్వరాధములు' ప్రసక్తులే బడెను గదా![21] పోనీ ఇదిగూడా ప్రక్షిప్తమన్నను దేశమందున్న వ్రాతప్రతులన్నింటిలో ఈ పద్యము, ఇక్కడే వ్రాయబడియున్నదిగదా! కాదనుట సంభవమా! భాగవతమందును చాటువులలోను ఈ చర్చ చూచినచో కృతిని కోరిన వారెవరు అనునది గూడ స్ఫురించుచున్నదిగాని – పోతన మహాకవి కోరికలు తనివారగ నిక సర్వాంకితముగ జేయబూనలేదనియే తీర్మానింప వీలుగాదు. ముఖ్యముగా ఆయనను కర్ణాటులలోని కీచకులెవరో కష్టపెట్టియుందురు.[22] అందుకు అవకాశములు గలవు. కారణము కర్ణాటుల దయాభిక్షుకులైన రాచకొండ తెలుగు ప్రభువులు నడచుచున్నవారే గనుక,[23] ఆ ప్రవాదము నిష్కారణమైనను – సులభముముగా

---

21. 'బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర సీమల కందమూల గౌ
ద్దాలికులైననేమి నిజదార సుతోదర పోషణార్థమై' (పోతనచాటువు)
'బాలరసాల సాల–పదప్రయోగం భాగవతంలోను' గలదు. 3_7.3.

22. తనను పొగుడుచు కీర్తనలు వ్రాయమనిన వ్రాయలేదని అన్నమాచార్యులవారిని చెఱసాలలో బెట్టినవాడు సాళువ నరసింగరాయలు.

23. కర్ణాటాధిపతులు 1419 లో పానుగంటిలో విజయము పొందిన తరువాత వారికి అణకువగా నుండియే రాచకొండవారు ఆ రాజ్యమున పదవులు సంపాదించియుండిరి.

వీరిపైకి జేరియుండవచ్చును అంతేగాని తిమ్మకవి వ్రాసినదానిలో యథార్థమేమాత్రము గనిపింపజాలదు.

పోతన కాలమునుండి తిమ్మకవివరకు మూడున్నర శతాబ్దములలో దానిని దలచిన వారొక్కరైనను గానరారు గదా! ఆ కాలమున విద్వాంసులు గ్రంథములెన్నియో వ్రాసిరి. వారెక్కడైనను నిదిబేర్కొని యుంపలేదు పోతన పుత్రులైన కేసన-మల్లనకవులైనను యిది నిజమైన దెలుపకయుందురా? పోతనకాలము దెలుసుకొనుటకు సన్నిహితమైన చిత్రభారత కర్తయు నీ విషయమై దెలుపకపోవునా? చారిత్రకాంశములం దెన్నియో దెలిపియున్నవాడీతడేగదా!

భాగవతకృతిపతిత్వ మెవరుగోరినను, తుదకు కర్ణాటులైనను దానిని శాంతిపెట్టించుట యసంభవము అది యానాటి రాజకీయ కల్లోలములలోనో, యవనుల కిరాతకకృత్యములలోనో, పురుగులనో బడి చివికి గ్రంథపాతమై యుండవచ్చును. అంతేగాని చారిత్రక యాధారములులేని బలపడజాలని అసంబద్ధములైన పుక్కిటి గాథలనో నమ్ముట తగినపనిగాజాలదు

## రచనా సామ్యము

పోతన రచనలలో దండకము, వీరభద్ర విజయము మరియు భాగవత కావ్యములందుగల సంపథానాల రచనలేరీతినున్నవో, పోలికలేరీతి యుండునో జూచిన కర్తృత్వవిషయమై గల సందేహములు తొలగిపోవచ్చును ముందు భోగినీ దండకమునకు భాగవతమునకుగల పోలికలు జూపబడియున్నవి

భోగినీ దండకంలోని ఈ క్రింది భాగమునకు భాగవతంలోని అక్రూర దండకమునకు పోలికలు గలిగియున్నట్లు భావించుచుండిరి.

'కామానల జ్వాలలన్ వేగి చింతాభరాక్రాంతయై క్రాగి చింతించునింతిన్ బరీక్షించి బుద్ధిన్ విచక్షించి [illegible] మాయా పరాభూత జామాత మిథ్యావయోపేత విజ్ఞాన నానావశీకార మంత్రౌషధ వ్రాత లోకైకవిఖ్యాత వారాంగనాధర్మ శిక్షాది సంభూత

సమున్నాహితానేక రాజన్యసంఘాత వాచాలతాబద్ధ నానామహాభూతా యేతెంచి నీతిన్విచారించి శైలన్ గళత్కుంతల వ్రాతఫాలన్ గరాంభోజ రాజత్కపోలన్ సమందోష్ణ నిశ్వాసజాలన్ విపర్యస్త సన్యస్త చేలన్ మహాంగోళి ప్రేంఖిత స్వర్ణడోలన్ మృగేంద్రావలగ్నన్ దయావృష్టిమగ్నన్ మనోజాగ్నిభగ్నన్ విలోకించి బుద్ధిన్ విచారించి లోనంబరాయత్తయై చిత్తజాతాసి ధారా చలచ్చిత్తయై విన్నయై ఖిన్నయై భావంబు భావించి నెయ్యంబుఁ గావించి రావించి బాలా! జడత్వంబు నేలా? విచారింపవేలా? విలోకింపువేలా! వయోరూప సౌందర్యవారాల్ రిత్తగాఁ జేయు నీ వృత్తికిన్మెత్తురే

భో. ద. P. 6-7-

## అక్రూర దండకం

శ్రీమానినీ మానచోరా! శుభాకారా! వీరా! జగద్ధేతు ప్రకారా! సమస్తంబు నస్తంగతంబై, మహాలోల కల్లోల మాలాకులాభీల పాథోనిధిం గూలఁగా బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యంబటు ఖ్యాతి శోభిల్లు నీ నాభి కంజంబులో లోకపుంజంబులం బన్న విన్నాణియై యున్న యాబ్రహ్మ యుత్పన్నుఁ డయ్యెంగదా! పావకాకాశ వాతవనీ వార్యహంకార మాయా మహా మానసాద్యుల్ హృషీకాదులన్ నిత్యసందోహమై నీ మహాదేహమందుల్లసించున్ వసించున్ నశించున్ . . ... నమస్తే–నమస్తే–నమస్తే– నమః

భాగ. 10-1232

పోతన తనకు పూర్వుడైన పాల్కురికి సోమనాథుని రచనల నుండి మంచి భావముల నేరినట్లున్నది. కొన్ని దండకంలోను మరియు భాగవతంలోను గనిపించుచున్నవి.

**బసవపురాణంలో**

క్షీరాబ్ధిలోపల క్రీడించుహంస
గోరునే పడియల నీరు ద్రావంగ?
జూతి ఫలంబులు జుంబించు చిలుక
భాతి బూరుగు మ్రాని పండ్లగన్గొనునె?

రాకామల జ్యోత్స్నఁ ద్రావు చకోర
మాకాంక్ష సేయునె చీఁకటి ద్రావ?
విరిదమ్మి వాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బిలితసల?

బ. పు. అ. 3.32-41.

## భోగినీ దండకము

నేనా మరుండైన గౌరీవరుండైన వాణీశ్వరుండైన దేవోత్తముండైన నన్న్యేన్ మదిన్ గోరఁగా నొల్లనే! యుల్లసత్ఫుల్ల మందార రాజన్మరందంబు నందంబునన్ గ్రోలు మత్తాళి దుత్తూరమున్ గోరునే? హేమరాజీవ రాజీరజో రాజితాకాశ గంగానదీ లోల కల్లోల డోలా నట ద్రాజ హంసంబు శైవాల గండూపదీ భేక భేకీముఖీ సంకులాసార కాసారమున్ జేరునే? మండితాఖండలానీలమూర్తి నిర్యత్పయోధారలన్ ద్రావు సారంగి కుంభాంతరాంభః ప్రపూరంబులన్ ద్రావునే? మాధవోజ్జాత చూతాంకురాస్వాదు లీలాలసత్కోకిలేంద్రంబు ఝుల్లీరవ క్రూర భల్లాతకీశాఖకున్ బోవునే? సింగభూపాల బాహాపరీరంభ సంభోగమున్ గోరు యోషాశిరోరత్న మాశించునే నీచ సంభోగ? మంబా! కృతార్థావలంబా!

## భాగవతంలో

సీ. మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురితచకోరక
మరుగునే? సాంద్ర నీహారములకు

గీ. అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల?

భాగ. 7.150.

ఇక వీరభద్ర విజయంలోను భాగవతంలోగల పద్యములెన్నింటికో పోలికలనెత్తి జూపవచ్చును. దీనిని పోతనగాక మరెవరోరచించి యుందురని కొందరి భావన ఇదీ అసంబద్ధమే. అసలు పోతన భాగవత కావ్యమేగాక అంతకు తక్కువ శ్రేణిగల శతాధిక కావ్యములు వ్రాసినను కాదనవచ్చును లోపములెన్నవచ్చును. కాని మరియొక కవిని జూపింపగలమా? లేదు పోతనకు పూర్వం విశ్వేశ్వర కవిచంద్రుడు 'వీరభద్ర విజృంభణ' మను నొక కావ్యమును రచించెను. అదియు లభ్యముగాలేదు. లభ్యమైనయెడల మరికొన్ని వివరములు తెలిసియుండెడివి. వీరభద్ర విజయంలో ఆక్షేపణీయమైన దొక పద్యము గలదు.[24] అంతకుదప్ప అది పోతన కృతమనుట కెట్టి సందేహము లేదు

సీ. శృంగారములు సేయ శృంగారియొల్లదు
పువ్వులు ముడువదు పువ్వుఁబోడి
పలుకంగనేరదు పలుకనేరని భాతిఁ
జంచలత్వమునొందుఁ జంచలాక్షి
సరసుల గ్రీడింప సరసిజానన వోదు
మానంబుతో నుండు మానవిభవ
గంధంబు పూయదు గంధవారణయాన
చెలువలఁ బిలువదు చెలుల చెలియ

24. ఉ. భాగవత ప్రబంధమతి భాసురతన్ రచియించి దక్షదు
ర్యాగ కథా ప్రసంగమున నల్పవచస్కుఁడనైతి తన్నిమి
త్తాగతవక్తృదోష పరిహారముకై యజనైకశైవ శా
స్త్రాగమ వీరభద్ర విజయంబు రచించెద వేడ్క నామదిన్.
వీ. వి. పీఠిక 45.

తే ముకురమే ప్రొద్దుఁజూచెదు ముకురవదన
తనుణిమరియును సర్వకృత్యములు మాని
హరునితోడిదె గొండాటనైయె లతాంగి
యుగ్రతాపంబు సైరింపకున్నదెంచి

పి. వి. 1_202.

సీ మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ
జలముల నాడదు జలజగంధి
ముకురంబు జూడదు ముకురసన్నిభముఖి
పువ్వులు దురుమదు పువ్వుఁబోఁడి
వనకేళిఁగోరదు వనజాతలోచన
హంసంబు బెంపదు హంసగమన
లతల బోషింపదు లతికాలలితదేహ
తొడవులు దొడవదు తొడవుతొడవు

ఆ తిలకమిడదు నుదుట దిలకసీ తిలకంబు
గమల గృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొనవన
మాలిరాడు తగవు మాలియనుచు.

భాగ. 10_1729.

మానసిక రూపచిత్రణలతో మేలనిపింగనున్న కొన్ని పద్యములు వీరభద్ర విజయ–భాగవత కావ్యములందును గనిపించును.

కం వడవడ వడకుచు నుడుగుచుఁ
జిడిముడి మయిగొంది కలఁగి చింతాకులయై
వెడగుదనంబున నిలచుచు
గడువాడిన పువ్వు భంగిఁగాంతి దొఱంగన్

వీ. వి. 1_187

కం. పెదవులు నడపుచుఁ గొంకుచు
నదరుచు బెగడుచును నుడుగు లల్లన నిడుచున్
వదనము వంచుచు నడఁగుచుఁ
దుడినాలుక తొట్రుపడఁగఁ దొయ్యలి పగతోన్

వీ. వి. _108

భాగవతంలో,

కం. అడిగెదనని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడుగఁడని నడయుడుగున్
వెడ వెడ సిడిముడి తడబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్

భాగ. 8-103.

నాచన సోమని పద్యములకును పోతన కావ్యమునందు కొన్ని అనుకరణములు గనిపించుచున్నవి[25]

మ. పిలుజూపున్ వెలిజూపుఁ జురలన్ విశ్వేశ్వరుం జూచుఁగొం
డల మంకుం దలపోయఁ జొచ్చు గడిమిన్ దర్వీకరాలంకృతో
జ్జ్వల విభ్రాజిత నిత్య నిర్గుణ తపోవారాన్నిధిం జెచ్చెరం
గలఁ బం జూఁచుఁ గలంపలేక తలకుం గాముండు నిశ్చేష్టుఁడై

వీ. వి. 2-101

మ. పసుఁజూచున్ పసుఁజూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపుసొంపు బరఁగన్ జంద్రాస్త్రసందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్.

భాగ. 10-178

పోలిక లీవిధముగా ఇతరకావ్యములనుండియు, పరస్పరం పోతన కృతులలోను అనేకము జూపుట కవకాశములు గలవు ముఖ్యముగా వాటినన్నిటిని ప్రత్యక్షముగా జదివి సందేహములను దొలగించుకొనుట మేలగుచున్నది. ఇక శ్రేయః కావ్యము, అతి ప్రసిద్ధము నైన మరి రెండు పద్యములు పఠించి దీనిని ముగించుచు తక్కిన యంశములకు బోవుదము.

---

25. అరిఁజూచున్ హరిఁజూచు జూచుకములం దందంద మందారకా.

శ. హ. అ. 1-162

మ. తనవెంటన్ సిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్ దానివె
న్కను బక్షీంద్రుఁడు వాని పొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు వచ్చిరొ
య్యన వైకుంఠపురంబునం గలుగు వారాబాలగోపాలమున్
భాగ. 8_98.

మ. లలిత స్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్విజ శ్రేయమై
భాగ. 1_20.

## లింగమనేడు

దేవరకొండ తరములోనున్న II మాదానేని కనిష్ఠ పుత్రుఁడు లింగమనేడు కుమారవేదగిరికి ఈతడు సోదరుఁడు. రాచకొండ తరములోనున్న III సింగభూపాలునికి ఇతఁడు సమకాలీనుఁడు. రాచకొండ రాజ్యపు అంతిమ చరిత్రలో మెఱుపు మెఱసినట్లు మెఱసి ప్రతాప శౌర్యములను జూపినవాఁడీ లింగభూపతి. లింగభూపతి జూపిన యుద్ధపరాక్రమము, సాధించిన విజయములు లెక్కింప బూనినచో యదొక పెద్దపట్టిక గావచ్చును. ఏకదాటిగా ముప్పదిరెండు దుర్గములు ఒకేపర్యాన సాధించి[1] త్రిలింగదేశపు సరిహద్దులన్నియు జుట్టి వచ్చుట జూడగా రెక్కలుగట్టుకొన్న సమరసాహసమేమోనని యనిపించును. ఈ విషయమై ఈతని విజయప్రశస్తి జాటుచున్న సీసమాలిక యొకటి వెలుగోటి వంశావళిలో గాన్పించుచున్నది. చారిత్రకదృష్టి లేని రాచకొలువుగాండ్రిది గూర్చియుండిరేమో, అందలి యంశములన్నియు వ్యత్యస్తములుగా జేరియున్నవి. కాని యవి కొంతవరకైనను సమన్వయము గావింపవచ్చును.

1. దండియై ముప్పదిరెండు దుర్గంబుల, నేకధాటిగ నెక్కినాఁడు.
వె. వం, పు. 52.

మొదట లింగమనేని విజయములు ఆతని ఈ మిత్రకూటముల ననుసరించి లెక్కించినగాని తెలియుట కవకాశముండదు.

**ఆ కూటము లివి**

1. విజయనగరాధీశులతో మైత్రి కొనసాగుచుండగా సాధించిన విజయములు
2 సురధాను మైత్రితో సాధించియున్నవి
3 గజపతి 'హంవీర కుమారుని'తో గలసి సాధించియున్నవి.
4. స్వాతంత్రముగా జేపట్టిన విజయములు
5. సాగు నే యాధారములు గనుపింపక మిగిలిన కాలము

1455 to 482

పై వానిలో చిక్కువిడని అంశములు అధికముగానున్నవి. ఈ లింగమనేడు ద్వాదశవర్ష ప్రాయమున నుండగనే (పై బడిన వేమా) కొండవీటిపై బడి విజయము సాధించినట్లు అనపోతానేని ప్రకరణమున జెప్పబడియున్నది[2] ఆ తరువాత లభించిన విజయములలో మొదట జెప్పదగినది రాజమహేంద్రవర సింహాచలములు సాధించుట దీనికి ముఖ్యాధారము శ్రీనాథుని పర్యటనవలననే నిది దెలియవచ్చుచున్నది. నందికంత పోతరాజను కఠారి విషయమున శ్రీనాథకవి లింగమనేనిని దర్శించి యాతనిని అల్లయవేమారెడ్డిని జయించినట్లు స్తుతించి యుండుటచే ప్రాయికముగా ఈతని పూర్వవిజయములకు కొంతబలము జిక్కుచున్నది[3]

ఈ పర్యటనకు పూర్వమే 1428లో లింగమనేడు అల్లయవేమ వీరభద్రారెడ్లను యుద్ధమున నోడించి రాజమండ్రి నాక్రమించి, సింహాచలము సాధించెను[4] ఆ పిమ్మట వేములకొండ, మామిడాల, సప్తమాడియములు జేపట్టి ఆవంచ, గంగవరముల నాక్రమించి,

---

**2. 'వేదగిరినేని తమ్ముడు లింగమనేడే ద్వాదశవర్షంబులవాడై యుండి. తన బంధువర్గహితపరిజనంబుల గూర్చుకొని అమరులకు వెక్కసంబగు యుద్ధంబు జేసె'. వె. వం. పు 39.**

**3. Ibid P. 39.**

**4. చటులోగ్రగతి రాయ శరభమై యవలీల దిరుగ సింహాద్రి సాధించినాడు. V. V 148.**

కళింగపు హద్దులను దాకియుండెను. కళింగమును గెలిచియున్న వీరభానుదేవు డంతకుపూర్వమే రెడ్డిరాజ్యమునకు కలహ కారణముల వలన యీ రాజ్యము నందలి అధికభాగమును ఆక్రమించియుండెను. రెడ్డిరాజ్యములో గజపతుల ప్రవేశము, లింగమనేని విజృంభణ విజయనగరాధీశులకు కలవరము గలిగించియుండును. తానుగా నా రాజ్యమును గెలుపుకొన జూచుచున్న వారికిది యవరోధములు గలిగించును గనుక దేవరాయలు తక్షణమే తన సామంతుడైన తెలుంగు రాయలకు సైన్యమొసంగి సింహాచలముపైకి బంపియుండెను. తెలుంగు రాయల ప్రవేశముతో గజపతిసైన్యములు వెనుకకు మరలింపబడినవి. ప్రాయికముగా లింగమనేని సైన్యములును ఈ సమయమునకే వెనుకకు మరలియుండవచ్చును ఈ దండయాత్రా కాలమునాటి తెలుంగు రాయల శాసనమొకటి సింహాచలములో వేయబడియున్నది.[5] రాజమండ్రికి దేవరాయలు సైన్యములు బంపుటలో లింగమనేని సైన్యముపసంహరించుకొనుటలో భేదాభిప్రాయ మేమైనా యుండవచ్చును. దాని ఫలితములు ముందు ముందు దెలియవచ్చుచున్నవి.

మొత్తముపై రాజమండ్రిపై లింగమనేని విజయము సాధించియున్నందుననే యాతనితో సామరస్యము సాధించుటకే వేమ వీరభద్రారెడ్లు శ్రీనాథుని లింగమనేనికడకు బంపియుండవచ్చును. నందికంతపోతరాజును కటారికథ దీనికొక సాధనము. రాచవేము డంతకుపూర్వమే ఈ కటారికై శ్రీనాథుని బంపియుండెనని తెలుపుట యసందర్భము పద్యములోనున్న సాక్ష్యమందుకు వ్యతిరేకము. ఆ పద్యమిది.[6]

సీ. జగనొబ్బగండాంక సంగ్రామ నిశ్శంక
జయసిద్ధిరాయ వేశ్యా భుజంగ
అఖిలకోటల గొంగ యరిరాజ మదభంగ
మేలందు ధరణీశ మీనజాల

5. S.I.I. Vol. VI. No. 905 (Madras) Ep. Report. 2930 of 1899.
6. వె. వం. పు. 40.

మూరురాయరగండ మఱియు రాజులమిండ
యాభివృద్ధిరాయ చౌహత్తమల్ల
యరిరాయ గోవాళ కామినీపాంచాల
బ్రహ్మయు శశివంశ పరశురామ
దండిబిరుదుల సురదాణి గుండెదివ్వల
భళిర[7] అల్లయవేముని పరుగుమింప
రమణఁ బెంచిన మేదినీరావు బిరుద
సంగరదీప మాదయలింగ భూప

ఈ పద్యమునం శ్రీనాథుడు అల్లయవేముని గెలిచినట్లు దెలుపుచే, ఈ పర్యటన రాచవేముడు జీవించియుండగా జరిగినది గాన సి.శ. 1428 నాటి లింగమనేని పూర్వవిజయముల తరువాతనే జరిగియుండెననియు దెలియుచున్నది కనుక శ్రీనాథుని రాచకొండ పర్యటన 1428–30 మధ్యకాలముననే జరిగియుండు వలయును కవితరంగిణీ కారులీ సాక్ష్యమును తారుమారు జేసిరి[8] అందుకు కారణము పండితుడైన II సింగభూపాలుని కాలములో (దానిని బెంచిరి) మహాపండితుడైన శ్రీనాథుడు పర్యటించి యుండవలెననుట చారిత్రక సాక్ష్యమునకీ కవితరంగిణీకారులు వ్యతిరేకమని జెప్పుట అభిప్రాయముగాదు కాని తమకొక అభిప్రాయము గలిగినచో, అవసరమైనచో చరిత్రకు విరుద్ధముగనైనను దానినిమార్చి వ్రాయుటకు ఎట్లు ప్రయత్నించెదరో[8] తెలుపుటయే ఇచట ఉద్దేశ్యము ఈ విషయములో ప్రసిద్ధవాఙ్మయ కారులైన శ్రీ వీరేశలింగంపంతులుగారును ప్రసిద్ధ చారిత్రకులైన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారును 1428 ప్రాంతముననే శ్రీనాథుని పర్యటన జరిగియుండెనని నిర్ణయించిరి[9] చారిత్రక పండితులలో అధికులభిప్రాయ మీ విధముగనే యున్నది

ఇక సాహసిక శ్రీనాథునంతటి ప్రభువుల కోరికమేర లింగమనేనిని గూర్చి కూడా సప్పెంధుమని గోరి ఆతనిని తన పాండిత్యముచేత

7. భళిరా–బళిరా–యను పదములు శ్రీనాథుని వాడుకలో నున్నవి.

8. ఆంధ్ర కవితరంగిణి. సం. 5. పు. 122 to 125, 139 to 144.

9. History of the Reddy Kingdoms, Chap. IX, P 529-530

సంతసించునట్లు గావించెను. శ్రీనాథుని ప్రజ్ఞావిశేషములకు భూపతి మెచ్చుకొని కఠారినేగాక, అంతకుమించిన దేదియైనా గోరవచ్చిన దని దెలుప, అట్టివేవియు నాశింపక కఠారిని మాత్రమే కోరినట్లు ననియు, కవిసార్వభౌముని నిస్స్వార్థచింతనకు లింగభూపతి సంతసించి అత్యధికముగా నాతని గౌరవించి కఠారి నొసంగి బంపియుండెననియు కొన్ని యైతిహ్యములు గానవచ్చుచున్నవి[10] వెలుగోటి వంశా వళిలో దీనిని గురించి కొద్ది ప్రశంసయే చేయబడియున్నది. కాని ఆ నాటి విద్వద్గోష్టులు, సభాసత్కారములు వెలుగోటివారికి ఇతరాధా రము లేవియు లభించుట లేనేలేదు మొత్తముమీద శ్రీనాథుడు పాండిత్యమందును, మరియొకవైపు రాచకార్య నిర్వహణమందును ప్రజ్ఞావిశేషములు గలవాడని పెక్కు ఐతిహ్యములు తెలుపుచున్నవి.

లింగమనేని కళింగయాత్ర సాగుచుండగనే బహమనీసుల్తాను అహ్మదుషాహు విజయనగరముపై దాడిచేయుటకై బయలుదేరి వచ్చి భద్రానది కీవల తన సైన్యముల నిలిపియుంచెను. అప్పుడు రాచకొండవారు తమకుగల పూర్వసఖ్యత ననుసరించి మహమ్మదుషాహు విజయనగరాక్రమణము నాపుటకై తమ సైన్యములను జేరదీసి పయనమై విజయనగర సైన్యముల గలసికొనెను. సైన్యములిట్లు యుద్ధరంగమునకు సన్నద్ధమైనవి. కాని ఎంతకాలమైనను తురుష్కసైన్యములు నదిదాటివచ్చి యుద్ధమునకురాక నిలచిపోయినందున రాచకొండ నాయకులు పరిస్థితులిట్లు నిరీక్షించి తమ సైన్యముల నారంగమునుండి మరలించిరి.

రాచకొండవారు సైన్యములు పంపి సహాయించుటలో రాజకీయకారణము మరేదైనా యుండవచ్చును. అదే నిజమైనచో గజపతి రాజ్యమునకు సహాయముగా 1428లో విజయనగర సైన్యములు సింహాచలము జేరుట గావచ్చునేమో. ఈసైన్యముల ప్రవేశము జరిగిన వెంటనే

10. ధనరాజ్యంబులు మాని నెమ్మదిఁ బ్రమోదంబంది తన్గోరున
ట్టి నృపాగ్రణి కోర్కెతీర్చుట కకుంఠీభూత చేతస్కుఁడై
చని సాధించిన సత్కవిప్రవరు రాజన్యాగ్రణీ మాన్యునేఁ
బ్రణుతింతున్ బహుశైవ సంగదిత కుంభద్గాధు శ్రీనాథునిన్
నాగ్నజిత్తి పరిణయము— వల్లూరి నరసింహకవి.

లింగమనేడు ఆ రంగమునుండి వెనుదిరిగి యుండెను బహుశా ఈ చర్యయు నాగిరెడ్డి కీర్తిని కొంత భంగపరచి యుండును

బహామనీసేనల కిది మంచియవకాశము హిందూసేనలన్నియు నైకమత్యముగా నక్కచోట గలసియున్న వారి నెదుర్కొనుట కష్టము. అట్టికట్టి అనుభవము పానుగంటిలో గలిగియున్నది ఆ కారణమునచే, వారాలోచించిరేమో, సైన్యములు ముందుకు వదలనీయరైరి. తరువాత పరిణామములలో విజయనగరముతో సంధి జరిగినందున ఆ దండ యాత్ర నాపివేసి రాచకొండపైకి సుల్తానులు కత్తిదూసిరి

విజయనగరముతో సంధి జరుగుటవలన వెలమవీరులపై కాలుదువ్వుటకు బహామనీ సుల్తానుకు ధైర్యము చిక్కినది తెలుగు నాయకులపై పగలను పూర్వీకులు సాధించుటకు ఈ ఆవకాశము సరిగా లభించినది. తా మిప్పుడు రాచకొండతో బోరాడినచో విజయ నగరాధీశులు సహాయముగా రాజాలరు. సందర్భములన్నియు నిట్లను కూలముగా నుండుటచే 1433లో ఓరుగంటిపైకి అహ్మదుషాహు సైన్యములు నడిపి ఆనగర మాక్రమించెను పరిస్థితు లనుకూల ముగా లేనందున ఆ దుర్గమునగల సర్వజ్ఞసింగ భూపాలుడు తాత్కా లికముగా నాగిరితో సంధి గావించుకొని బంపివేసెను

బహామనీసుల్తానులు గావించుచున్న ఉపద్రవములు రాను రాను రాచకొండపై తీవ్రమగుచున్నవి క్రమక్రమముగా తమ రాజ్యమున గల కొన్నిప్రాంతములు వారాక్రమించి తినవేసికొని యుండిరి. ఈ అవాంతర పరిస్థితులన్నిటిలో నిస్సహాయముగా వారి నెదిరించి బోరాడుట కష్టమని భావించి లింగమనేడు కపిలేశ్వర గజపతి సహాయమును గోరియుండెను

కపిలేశ్వర గజపతి సామాన్యుడు గాడు. మహావీరుడు, మేధావి సమయానుకూలముగా రాజనీతి ఉపయోగించి సామదాన భేదోపాయ ములచే శత్రువులను లొంగదీయు సామర్థ్యముగలవాడు 1435లో రాజ్యమునకు వచ్చిన వెంటనే లింగమనేనికి చేయూతనొసంగి విజయ నగర రెడ్డిరాజ్యములలో నధికభాగమును కైవసము గావించుకొనెను.

## దక్షిణాంధ్రదేశ విజయములు

కపిలేశ్వర గజపతి సహాయమందిన వెంటనే లింగమనేడు దక్షిణాంధ్ర భూభాగములను జయించుటకు బయలుదేరినట్లు గానవచ్చుచున్నది ఈ విజయములు ప్రధానముగా కొండవీటి ప్రాంతమునకు జెందియున్నవి మరికొన్ని విజయనగర రాజ్యమునను జేరినవిగలవు లింగమనేడు ప్రారంభమున కోలిమల్లారెడ్డి పాలించుచున్న నాగార్జున కొండ గైకొని తంగెడను పాలించుచున్న శ్రీగాధిరాజును దరిమి వేసెను ఆ పిమ్మట శ్రీశైల మాక్రమించి, చెంచుమూకను గొట్టి సంబెటపిన్నని[11] సాళువతిప్పని[12] యోడించినట్లు దెలియుచున్నది

కర్నూలు ప్రాంతము జేపట్టిన వెంటనే లింగమనేడు గోపాల కృష్ణుని బారదోలి నెల్లూరితో సహా పరిసరదుర్గములు స్వాధీనము జేసుకొనెను లింగమనేని చివరి విజయములలో కంచియాక్రమణ ప్రధానమైనది ఆ సమయముననే ఈతని సోదరులైన సర్వజ్ఞసింగ భూపాలుడు వసంతానాయుడు కలిసివచ్చిగాని లేక విడివిడిగానే చేరిగాని అక్కడ వీరికి సమాగమమైనది. దీని కుదాహరణముగా వసంతానాయుని శాసనమొకటి 1437 చినకంజవరములో గానవచ్చుచున్నది[13] సింగభూపాలుని శాసనమొకటియు 1453లో వెల్లంకొండ నృసింహాలయమున వేయబడియున్నది[14]

## సుల్తానుతో సఖ్యత

దక్షిణ విజయములు పూర్తియైన వెంటనే లింగమనేడు రాచకొండ విషయమై శ్రద్ధవహించినట్లు గానవచ్చుచున్నది విజయనగరము వారి తాటస్థ్యమో లేక తమకు శ్రద్ధలేని కారణమో గాని

11. సంబెటపిన్న 1428 A D. Loc. Rec. XXXVI. P. 495. చలమర్తి గండుఁడై సంబెట పిన్ననిఁ బ్రౌఢుఁడెడుఁగను బట్టినాఁడు. కాత శిక్షవృత్తి జగ మెల్ల నెఱుఁగ శ్రీశైల పట్టంబు దా నేలినాడు. వె. వం. పు. వ. 48_51.

12. సాళువతిప్ప – 1433 A D. Ibid. Vol. XXXVII. P. 115.

13. Ep Coll No. 634 of 1919.

14. V R Inscriptions of the Madras Presidency. II Gt 767.

రాచకొండ ప్రాంతము లనేకము ఇంతకుముందు సుల్తాను చేజిక్కినవి. వాటి నెట్లైనా తిరిగి సాధించవలెనని లింగమనేడు దలచుచుండెను ఆ సమయమునందే సరిగా బహమనిసుల్తానులలోను అంతఃకలహములు సాగుచున్నవి. II అల్లావుద్దీన్ (1435-58) సోదరుడైన మహమూద్ ఖాన్ తన సోదరునిపైనను తిరుగుబాటుజేసి రాయచూరు, షోలాపూరు, మరియు బీజాపూరు మొదలగు దుర్గము లాక్రమించి యుండెను ఈ వార్తవిని బాలకొండ నేలుచున్న వీరి సామంతుడైన సికిందర్ ఖాన్, సుల్తానుకు మరియొక సోదరుడైన ముహమ్మదుఖాన్ గలసి స్వతంత్రము వహించుట గాక అల్లావుద్దీన్‌కు స్వాధీనమున గల సబ్బినాష్ట్రమును మరియు భువనగిరి ప్రాంతమును ఆక్రమించియుండిరి. ఈ తిరుగుబాటు దెలిసినంతనే అల్లావుద్దీన్ ఒక లక్ష ఎనుబది వేల జంగుతో బీదరునుండి బయలుదేరెను

లింగమనేడీ యవకాశమును గ్రహించి తన రాజ్యము తిరిగి సుల్తాను మెప్పుతోనైనా సాధించవలెనని ఆతనిపక్ష మవలంభించి తిరుగుబాటు దారుల నణచివేసి సుల్తాను సహాయముతో భువనగిరిని మరల సాధించియుండెను[15] కాని ఆ సుల్తాను లింగమనేని కెట్టి ప్రత్యుపకారము గావింపలేదు పైగా హిందువులకు విరుద్ధముగా దేవాలయములెన్నో బడగొట్టించి వాటిస్థానములో మసీదు లు గట్టించియుండెను.[16]

## మతయుద్ధముపై (జీహాద్) దెబ్బతీయుట

సుల్తాను అవలంభించిన ఈ విధానమునకు లింగమనేడు మిక్కిలి యసంతృప్తిజెంది అవకాశమునకై ఎదురు చూచుచుండెను. ఈ లోగా సుల్తాన్ అల్లావుద్దీన్ మరణింపగా యీ దేశమునకు హుమాయూన్ అనునతడు (1458-61) రాజయ్యెను ఈతడు కడు క్రూరుడు. దక్కను ముస్లింలకన్న పైదేశికులపై ఈతనికి ప్రీతి హెచ్చుగలదు. ఈ

15. గెంటించి బలిమి సికేంద్ర ఖానుని దోలి
యేలమి రాజ్యంబుఁ దా నేలినాఁడు. V. V. P. 49

16. విజ్ఞాన సర్వస్వము. సం. 3. పు. 361.

హుమాయూను పరిపాలనకు వచ్చినవెంటనే బాలకొండ నేలుచున్న సికిందర్‌ఖాన్ వెలమలతో మంచిచేసుకొని మరల తిరుగుబాటు గావించెను తిరిగి బాలకొండకడ హుమాయూన్‌కును సికిందర్‌ఖాన్‌కును ఘోరముగా నొక పోరాటముజరిగి ఆ యుద్ధమున సికిందర్‌ఖాన్ మరణించియుండెను

అంతటితో అది సమాప్తమైపోయినను హుమాయూన్ వూరు కొనలేదు దీనికంతటికి వెలమనాయకులే కారణమని హిందూవీరు లైన ఆ వెలమనాయకులపై మతయుద్ధము కొనసాగింప తన వారికి పిలుపు నందించెను[17] మతయుద్ధమును రెచ్చగొట్టుటలో హుమా యూన్‌నకు స్వలాభము గలదు మహమ్మదీయులను మత మనినచో నావేశము మెండు. వారి నీ కారణమున కదిలింప గలిగినచో తనకు విజయము లభించుటేగాక స్వజాతిలో దలయెత్తుచున్నట్టి దిరుగుబాటు లన్నియు నణగిపోవును

ఈ పథకము నాలోచించి హుమాయూన్ దేవరకొండపైకి నిజామ్‌ఉల్‌ముల్క్ ఖ్వాజాజహాన్ అను సేనానులకు గొప్పసైన్య మొసంగి యా కోట నాక్రమింప బంపి, తాను మరికొంత సైన్యమును గైకొని ఓరుగల్లు నాక్రమించుటకు బయలుదేరెను. సుల్తాను సైన్య ములు దేవరకొండ జేరుటకు మిక్కిలి ప్రయాస పడవలసి వచ్చినది. అడుగడుగునా వారు తెలుగుసైన్యములతో బోరాడుచు ఎట్లో కోట సమీపమునకు జేరుకొనగలిగిరి

ఈ ప్రమాదమును గ్రహించియే అంతకుపూర్వమే వెలమ నాయకులు బయటిసహాయమందనిదో లాభములేదని చింతించి తమ మిత్రుడైన కపిలేశ్వర గజపతికి కబురుపంపిరి హిందూజాతిపై జరుగు చున్న ఈ యుద్ధమును తుదముట్టించుటకై, జాతిక్షేమ మాలోచించి ఆ కపిలేశ్వరగజపతి తన కుమారుడైన హంవీరదేవునికి ప్రచండమైన సైన్యమిచ్చి దేవరకొండ బంపియుండెను. ఈ సైన్యములో పూర్వ

17 Briggs Perishta. II. P. 456, Ibid. II. P. 456. The Burhan-i-Ma' asir (XXVIII. P. 244 )

ప్రఖ్యాతులైన గుజ్జారాపుతిప్పడు, దామెర్లతిమ్మడు అను యోధులు గలరు.

హంవీరదేవుని సైన్యములన్నియు దేవరకొండ జేరుచున్న వార్త అందగనే – లింగమనేడు సింగమనాయకులు సింగములవలె కోటలో పొంచియున్న తమ వెలమవీరుల నందరినీ ద్వారములు విడదీసి తొక్కుమ్మడిగా ఉరికించిరి. వెలమసైన్యమిట్లు దూకగా హంవీరుని సైన్య మొకవైపునుండి తురుష్క సైన్యమును దాకి చీల్చి చెండాడ సాగినది. అడకత్తెరలో పోకవలె చివరకు తురుష్కసైన్యము రంగమున నిర్మూలనమైనది. హతశేషులైన యే కొందరో అచ్చటనుండి పారిపోగలిగిరి. వీరిలో సుల్తాను సర్దారులైన నిజాం ముల్ ముల్క్, ఖ్వాజాజహాన్ ఎట్లో ప్రాణములు దక్కించుకొని యీ వార్త హుమాయూన్ కెరిగింప ఓరుగంటికి పోయిరి.

అపజయ వార్త వారినోట విన్నంతనే హుమాయూన్ మండిపడి నిజాం ముల్ ముల్క్‌ను జంపివేసి, ఖ్వాజాజహాన్‌ను చెరవేసి తక్కిన వారిని చిత్రహింస జేసి తన రాజధానికి మరలిపోయెను.

## నష్టభాగములు సాధించుట

దేవరకొండలో తురుష్క సైన్యమును జయించినంతనే లింగమనేడు సంతోషపడి యూరకుండలేదు. హంవీరుని సైన్యముతో గలసి తెలంగాణాలో నష్టపోయిన దుర్గముల నొక్కొక్కటే తిరిగి సాధించుటకు బయలుదేరెను. తొలి విజయములో వీరికి ఖమ్మంమెట్టు,[18] భువనగిరి, ఓరుగల్లు[19] స్వాధీనమైనవి. నిజాంషాహు కాలములో (1351–65) తిరిగి తురుష్క పోరాటమునకు దిగగా ఈ సైన్యములు వారిని కౌలాస మొదలైన ప్రాంతములు దాటించి బీదరు నాక్రమించుటకు సహితము ముందుకు బోయినట్లు తెలియుచున్నది.

---

18. Mac, Mss. 15–4–3. pp. 112–113.

19. ఓరుగల్లు కోట ద్వారంపై యున్న హంవీరుని శాసనము.

"ప్రమాది సంవత్సర మాఘ శు ౧౦ వ గజపతి కపిలేంద్ర మహారాయల కుమారుండు రాచ్చిదేవకుమార మహాపాత్రుండు వారుంగ్వ కోటగొనెను.

A.P.G.R.E. 1965. No. 284.మరియు తెలంగాణాశాసనములు.సం.II.

కాని తురుష్కులా ప్రమాదమునెట్లో యిప్పటికి దప్పించుకొన గలిగిరి.

ఈ విజయముల తరువాతనే ఓరుగంటిసీమను సింగభూపాలుని సోదరుడైన రావుధర్మానాయుడు పాలించుచున్నట్లు శాయింపేటలో నొక శాసనము వేయబడినది దీనికాలము 1464.[20] దీని ననుసరించి చూడగా 1482 వరకు ఈ సీమ వారి యధీనమందేయున్నట్లు తెలియు చున్నది.

## తిరిగి చిక్కులు

గజపతుల సహాయముతో పశ్చిమాంధ్ర దేశమంతయు తిరిగి రాచకొండకు స్వాధీనమైనను 1468 లో కపిలేశ్వర గజపతి మరణించి నందున తిరిగి వీరికి కొన్ని చిక్కులు దాపురించి యున్నవి. కపిలేశ్వరుడు మరణింపగనే యీ సింహాసనమునకై యితని పుత్రుడైన హంవీర దేవుడు పురుషోత్తమ గజపతి తో పోరు ప్రారంభింపసాగిరి. సింహాసన మెట్లయినా దక్కించుకొనవలెనని హంవీరదేవుడు తనకు సహాయము జేయవలసినదని III మహమ్మదుషాకు కబురుచేసి, ఆ సింహాసనము తనకిప్పించిన తాను జయించిన కో తెలంగాణా సంపత్తును సుల్తానుకు వశము జేయుదునని వాగ్దానము సలిపెను. గజపతులకు లోబడియున్న వోరుగంటిచేత లింగమనాని స్థితి సంకటమున బడినది హంవీరునికి సింహాసనము లభింపజేయుట-తిరిగిపోవుట యొకసారి మహా సంక్షోభము. రాచకొండవారు తమ ప్రాంతములు వదల కున్నను ఇటు సుల్తానుతోను అటు పురుషోత్తమ గజపతితోను బోరాడవలసి వచ్చినది బహుశా ఈ సమయముననే రాచకొండ వీరులు విజయ నగరాధీశులవైపు జేరియుందురేమో. లింగమనేడు పొడిచేటి కోట యుద్ధరంగమున పొల్లెపల్లి బుక్కరాజును జయించి గజపతి మెచ్చగా గాపాడినట్లు జెప్పబడుచున్నది.[21] ఇదే నిజమైనచో ఈ బుక్కరాజు శాసనమొకటి 1482 కాలమున నున్నది గనుక యీ

20. H. A. S. 19. W. G. 18. P. 161. to 166. అనుబంధము II

21. **బుక్కరాజును బట్టి పొడిచేటి కోటలో గజపతి మెచ్చంగాం గాచినాండు. V. V. P. 51.**

కాలము వరకును లింగమనేడు జీవించి యుండవచ్చును.[22] క్రమక్రమముగా తురుష్కుల ప్రమాదము హెచ్చినాకొలది వెలమవీరులు విజయనగర రాజ్యమునకు దరలి పోవుటతో రాచకొండ సామ్రాజ్యము మరి నేలగూల సాగినది. నామమాత్రముగా లింగమనేని కుమారుడు దేవరకొండ రాజ్యమును పాలించుచున్నను అది పూర్వ స్వాతంత్ర్యమును గోల్పోయి మాత్రమె. ఆ తరువాతనే ఈ తెలుగు వీరుల చరిత్ర విజయనగర రాజ్యములో లీనమై పోయినది

రాచకొండను పాలించిన రేచర్ల తెలుగు నాయకులు మహావీరులు సమరాంగణ పరాక్రమశాలులు రాజకీయముగ వీరు కాకతీయ యుగమునందే పైకి వచ్చినను హిందూరాజ్య పునఃప్రతిష్ఠాపనా సమయమున స్వతంత్ర తెలుగు రాజ్యమును స్థాపించి, దేశమును యవనాక్రాంతము గాకుండునట్లుగా గాపాడిరి. 1 సింగమనేనితో మొదలైన రాచకొండ తరములో కొద్దిమంది దప్ప తక్కినవారు విశేష భుజపరాక్రమ సంపన్నులే ప్రజ్ఞావిశేషములు గలిగినవారే. రణవ్యాపార మనిన వారికదియొక క్రీడావిశేషము వంటిది కనుక కాకతి రాజ్యమున చిన్న నాయంకర రాజ్యముగానున్న వీరి భూభాగము 1 అనపోతానేని రాజ్యకాలమునకు అదియొక సామ్రాజ్య దశకు జేరుకొని యున్నది.

రేచర్ల వంశ్యులలో తక్కినచోట గానరాని యొక ముఖ్య అంశముగలదు. అది ఈ సంతతిలోగల ఐకమత్యభావము మచ్చున కొక్కసంఘటనమైనను అనైక్యభావము నెరపుటకు వీరి వంశములో అవకాశము గనబడుటయేలేదు

రాచకొండను పాలించిన భూపతులందరును సాహిత్యాభిలాషలో, కవిపండితపోషణలో సంస్కృతియందు భక్తిశ్రద్ధలు విశేషముగా గలిగియున్నవారని వారిచరిత్రలు పలువిధములుగ చాటుచున్నవి. ఆ యా ప్రకరణములలో జేర్చియున్న అంశము లిందుకు ఉదాహరణముగ నున్నవి.

---

22. Ep. Coll. No. 35 of 1933

రాచకొండ రాజ్యము క్షీణదశకు వచ్చి తురుష్కబలమునకది వశమగుటలో తుదిప్రభువులపై దృష్టి నుంచుట సహజ విషయము. కాని రాజ్యక్షీణతకు చివరి నాయకులలో గానవచ్చుచున్న చంచల స్వభావమే దీనికి కారణమని జెప్పుట సరిగాదేమో. అది యానాటి విజయనగర, గజపతి రాజ్యముల సామ్రాజ్యదాహమే తెలుగురాజ్యములలో నొక్కొక్కటి క్రమముగా నంతరించునట్లు జేసినదని తోచుచున్నది అందుకు తోడు యవనుల వత్తిడియు దీనికి కొంత ముఖ్యకారణమైనది

X

# పరిశిష్టము

సర్వజ్ఞ రావుసింగభూపాలుడు - లింగమనేని మొదలైన రాచకొండ భూపాలురు విజయనగరమువారి కొలువుజేరినవెంట దేవరకొండ ప్రాంతముదప్ప తక్కిన రాజ్యమంతయు తురుష్కుల వశమైనట్లు దెలియుచున్నది. రాచకొండ కోటలో సభామందిరమందున్న యొక స్తంభముపై పార్సీ శాసనమొకటి హిజరి 889 జూపుచున్నది. కనుక క్రీ శ 1470 పైవరకు ఆ ప్రాంతములు వీరి స్వాధీనమునందే గలవని జెప్పవచ్చును లింగమనేని తరువాత ఆతని సోదరుడైన సూరానేడు, లింగమనేని కుమారుడైన పర్వతరావు, పర్వతరావు కుమారుడైన కుమారలింగమనేడు ఈ రాజ్యమును పాలించిరి పర్వతరావు శాసనమొకటి దేవరకొండ కోటపై అగ్రస్థానమునందలి నొక గుండుపై జెక్కబడియున్నది

పై అంశములన్నిటికి యాధారమగుచున్న ముఖ్యసనదులు కొన్ని రావుధర్మారావు[1] రావుమాధవరావు, మరియు మాధవ రావులక్ష్మారావులవి యనుబంధమున జూపబడియున్నవి. ఈ సనదులలో అచ్యుతదేవరాయల (1530-42) ప్రసక్తము కొంత గానవచ్చుచున్నది. ఈతడు కృష్ణదేవరాయల తరువాత విజయనగరము

---

**1. ఈ సనదులో 'చాకునీయ పట్టణంబులని' సందిగ్ధాక్షరములందు కాలము జెప్పబడినది. అది ఇప్పటికిని దెలియదు.**

పాలించిన ప్రభువైయుండును. రాచకొండలో 7 వ, తరమందున్న II సింగభూపాలుడి సోదరుడైన ధర్మానేడును యాతని సంతతి వారును విజయనగర ప్రాంతములకు తరలిపోయి మిక్కిలి ప్రసిద్ధికి వచ్చిరి కర్నూలు ప్రాంతమునగల వెలుగోడులో కోటనొకటి గట్టి[2] వెలుగోడు వెంకటగిరి రాజ్యములు స్థాపించిరి ఈ సంతతిలోనే 9 వ, తరమందొక ధర్మానాయుడు 12 వ, తరమందొక ధర్మానాయుడు గానవచ్చుచుండిరి వీరిలో పై సనదుకు కారణమైన ధర్మానేడెవరైనా గావచ్చునేమో అది అచ్యుతదేవరాయలకాలము (1530–72) నకు జెందుచున్నది

ఈ ధర్మారావు సనదులో 'సిలగిరి దుర్గప్రతిష్ఠాపన నిమిత్తం నాకు కేశంపల్లి ([illegible]) ఘట్టుమీదికి బోయినట్లు నొకచోట వ్రాయబడినది ఇది నల్లగొండ దుర్గనిర్మాణమని కొందరు దలచిరి నల్లగొండ దుర్గము బహు ప్రాచీనము. అది ఈవరకే నిర్మింపబడినది. మొత్తముపై దేవరకొండ రాజ్యమును లింగమనేని సంతతి, ధర్మానేని సంతతి మరియు సింగమరావు సంతతియును 16 వ, శతాబ్ది చివరి వరకు పాలించుచున్నట్లు తెలియుచున్నది. లింగమనేని తరువాత దేవరకొండను పాలించిన కొందరు ముఖ్యుల పేర్లు ఆ యా సనదుల వలన తెలియుచున్నవి వారి పేర్లు జూడవచ్చును

1. సూరానేడు 2. పర్వతరావు 3. కుమారలింగమనేడు 4. వెంకట ప్రతాప సూర్యారావు 5 ధర్మారావు 6 మాధవరావు లక్ష్మారావు ఈ ప్రభువుల కాలముగాని వంశక్రమముగాని నిర్ణయించుట జరిగియుండలేదు చాలావరకివి నల్లగొండజిల్లాలోగల వీరి వంశీకుల కడను, కొందరు రెడ్డినాయకులవద్దను వీరి సమాచారము తెలుపు పత్రములున్నట్లు జూడ తెలియుచున్నది.[3] ఈ వంశీకులలో నేటి ప్రముఖులెవరైరో యని సేకరించు ప్రయత్నము జేయుట యుచితముగానుండును.

---

**2. 5వ, తరమందున్న సర్వజ్ఞరాయవనాయుడు 1530లో వెలుగోడుకోటను గట్టించియుండెను.**

**3. వెంకటంపల్లి జూపల్లివారు 2. కాపూర్ దోనేపల్లివారు 3. మారేపల్లి**

ఈకాలములో దేవరకొండరాజ్యంలో స్థానికముగానున్న రెడ్డి నాయకులును, పైనుండి వచ్చిన ప్రముఖులు కొందఱును వెలమ భూపతులలో మిక్కిలి స్నేహభావముగనుండి తగు సహకార మందించుచున్నట్లు తెలియుచున్నది అంతేగాక దేశముఖు, దేశ పాండ్యాగిరివంటి ప్రముఖపదవులు, కొన్ని జాగీర్లను ఈ ప్రభువుల నుండి సంపాదించి రెడ్డినాయకులు అనేక గ్రామములు కట్టినట్లును తెలియుచున్నది.

పై ప్రకరణములో తెలిపియున్నట్లు లింగమనేని విజయము లలో సింహాచల కంచి ప్రాంతముల నాక్రమించియున్నపుడు వీరి వంశీకులు చాలావరకు ఆ ప్రాంతములందు స్థిరపడి చిన్న చిన్న రాజ్యముల నేర్పరచుకొన్నట్లు తెలియుచున్నది. కర్నూలుజిల్లా మాన్యువలుపుట 104-1565 లో వెలుగోటి రాజ్యము, విశాఖ జిల్లా మాన్యువలు పుట 291, ప్రకారము బొబ్బిలిరాజ్యము ఆ ప్రాంత ముల ప్రారంభించినట్లు వ్రాయబడియున్నది.

ఆ తరువాతనే క్రమముగా పేరులోకి వచ్చియున్న వెలమ సంస్థానాలు కొన్ని యేర్పాటైనవి. వీటిలో మైలవరం రాజాలైన నల్ల సూరానేని వారు, యాచమనాయని సంతతిలో వెలుగోడు - వెంకటగిరి సంస్థానాధీశులు, మాదానేని సంతతిలో పోలగానివారు, జటప్రోలు - కొల్లాపురంలో సురభివంశపువారు, పిఠాపురం బొబ్బిలిలో రావు వంశీయులు ప్రసిద్ధికివచ్చిరి.

మాదానేని సంతతిలో చిట్టచివర గాన్పించు మాధవరావు లక్ష్మారావు 1565 లో దేవరకొండను పాలించిన చివరివాడని తెలియుచున్నది ఈతని సనదొకటి నేటికి దేవరకొండలోనున్న 'హజారి' సంతతిలో నొక వ్యక్తివద్ద పదిలముగానున్నది.[4] ఈ లక్ష్మ

---

**కటికనేనివారు 4. నడికూడి ముమగోటివారు 5. గణపురపువిడిగల్లువారు 6. దోనేపల్లి కొత్తవారు 7. గూడెపూరి మిర్యాలవారు 8. వంగూరి పానుగంటివారు 9. నేరడుగొమ్మ గుగ్గిలపువారు ఇక్కడగల వంశముఖ్యులు.**

**4. కడువృద్ధుడు దేవరకొండ మున్సబునైన ఏనుగల బుచ్చయ్యగారి వద్ద ఈ సనదు (పార్సీలో) గలదు.**

తానికి అప్పుడు తెలుగు నాయకులతో పాటు నూతన ప్రభుత్వ మొకటి తామేర్పాటు గావింపనిచో మనదేశచరిత్రలే తారుమారుగా నుండెడివని జెప్పవచ్చును. ముఖ్యముగా మహమ్మదీయుల తాకిడికి ప్రవేశద్వారముగా నున్న ఈ పశ్చిమాంధ్రదేశము కొంతవరకైనా వీరి నిలకడను బట్టియే తీవ్ర ప్రమాదమునుండి తప్పిపోయినదని జెప్పవచ్చును.

రాజానుమతో ధర్మ మనునట్లు ఈ రాజ్యపు ప్రారంభ దశలో కొంతవరకు శైవమతమే బాగుగా వ్యాప్తిలో నున్నది. 1 అనపోతానేడు శైవమును మిక్కిలి యాదరించెను. ఆతడు నిరంతర శివదేవతాపారాయణుడనని ఒక శాసనమున జెప్పుకొనియుండెను.[6] ముఖ్యముగా 'ఉమామహేశ్వరమునుచో...' శ్రీశైలోత్తర ద్వారమండప నిర్మాణము,[7] శ్రీపర్వత శిఖరమునకు సోపానములు గట్టించుట[8], పెక్కు దేవాలయముల నిర్మాణములు ఈతని శైవాభి నిరతిని జాటుచున్నవి. తరువాత జెప్పదగినది ఈతని వైష్ణవాభ్యాసము. అనపోతానేడు గట్టించిన దేవాలయముల నిర్మాణము ననుసరించి ప్రజలకానాటికిగల అనురక్తిని గ్రహింపవచ్చును.

అనపోతానేని కాలమునకు రాజ్యమున శైవాదరణ తగ్గిపోయినప్పటికి II సింగభూపాలుని కాలమునాటికే రాచకొండలో వైష్ణవమత ప్రాధాన్యము హెచ్చినట్లు దెలియుచున్నది బహుశా

6. రాచకొండ దుర్గములో శాసనము. క్రీ. శ. 1380.

7. శ్రీశైలోత్తర తోరణే భువి మహేశాస్యాలయం నూతనం
పాషాణై సుదృఢం సురాసురనుతం గమ్య మ్మదాచీకరల్
విశ్రేణ...దభంగ సానుతలయో సోపానమార్గం
దృఢం శైలం దిశు మహేశ్వరస్య చ గృహం శ్రీమాధవేనా తతమ్.
ఉమా. శాసనము. 27-28.

8. 'హేమాద్రిదానై ర్ధరణీ సురాణాం హేమాచలం హస్తగతం విధాయ
యశ్చారు సోపాన పథేన చక్రే శ్రీపర్వతం సర్వ జనాంఘ్రి నమ్యమ్.
రసార్ణవ సుధాకరము. 21.

వేదాంత దేశికులవారి శక్తి సామర్థ్యములు, వారి ప్రచార సరళి వీరిని బాగుగా నాకర్షించియుండవచ్చు. నాగాంబికా శాసనము కొంత దీనిని బలపరచుచున్నది ? ఇందుకు II సింగభూపాలు డొక సారి యానాటి మతవిషయములనుగూర్చి సందేహములు దీర్చుటకై వేదాంతదేశికులవారి నాహ్వానింప, సమాధానముగావారు సుభాషిత నీవి, తత్త్వసందేశోపహారము మొదలైన కొన్ని గ్రంథములే వ్రాసి పంపినట్లు దెలియుచున్నది. వానిలోనివిగా ఈ శ్లోకములు గాన వచ్చుచున్నవి.

'త్రివిధ చిద చిదేకత త్త్రి లక్ష్యే యతిపతి యామున భాషితే నియోక్తః, ఇదమితి నిగమాన్త దేశికేన ప్రతిసముదిశ్యత మాధ వాత్మజస్య

అని యీ తత్త్వ సందేశ శ్లోకము. సుభాషిత నీవిలోని మరి యొక వాక్యము 'గాదమహేంద్రనగరస్థిత సర్వజ్ఞక్షమావల్లభేన'యని గానవచ్చుచున్నది. వీరిలో మాధవాత్మజు లెవరో దెలియుటలేదు. మాధవ నామధేయులు రెండవ మూడవ సింగభూపతులకు పిన తండ్రులుగుదురు. సింగననామధేయులైన మాధవాత్మజు లెవనును వీరి వంశక్రమములో గానుపించుట లేదు.

మొత్తముపై 1380 ప్రాంతమునుండియే వైష్ణవ మీ ప్రాంత మున మిక్కిలి యాదరణకు వచ్చినట్లు దెలియుచున్నవి. ముఖ్యముగా II అనపోతానేని గావించిన రామాలయనిర్మాణము, III సింగభూపతి వేయించిన బెల్లంకొండ తిరుపతి శాసనములు, వసంతానాయుని కంజీవరశాసనము, ధర్మానాయునిదైన శాయింపేట శాసనము. అందలి దాన ధర్మములు వీరివైష్ణవాభిమానమునకు నిదర్శనమని జెప్పదగు చున్నవి.

---

9. నిర్మితోహం త్వయారామప్రేష్య వార్థాయ కేవలమ్
అపచ్చిన్నాస్తు మే తేషాం సదా త్వత్పాద సేవినామ్ 15
ఇతితేన స్వయం ప్రోక్తం తత్వం తత్వార్థ వేదినా
అతసేవాస్య విషయా నాసః స్వార్థపరాః పరమ్. 16

నాగాంబికా శాసనము. నాగారం.

అన్నింటిలోను నీసు శారదాపురా[illegible] [illegible] ప్రత్యేకత. దేవరకొండ కోటలో శినాయాయుని [illegible] దాంపత్య హము నేటికినిగలదు ముఖ్యముగా [illegible] అధిదేవతాస్తుతిలోనే ప్రారంభమగుచున్నవి

## ప్రజాహిత కార్యములు

రాచకొండ ప్రభువులు ప్రజాహిత కార్యములందు [illegible] శ్రద్ధ వహించినట్లు దెలియుచున్నది. ముఖ్యముగా [illegible] గృహ పరిశ్రమలపై యాధారపడి స్వయంపోషకముగా [illegible] చీటికి మాటికి ప్రభుత్వముపై నాధారపడు [illegible]. వ్యవసాయము, దానికి గావలసిన జలాధారవసతులు పూర్వకాలములో చాలాతక్కువమైనను ఈ ప్రభువుల [illegible] సానుకూలముగా కొన్ని తటాకములు వెలసినవి. వీటిలో [illegible] సముద్రమనునది 1429లో రావుమాధానాయకుని [illegible] నాగాంబికాదేవిపేరిట ఈ తటాకము నిర్మింపబడినది [illegible] దేవరకొండలోనున్న పర్వతరావు [illegible], [illegible] చెప్పదగియున్నవి వ్యవసాయాభివృద్ధికై [illegible] తటాకములు నిర్మించి శాసనములు ప్రతిష్ఠించినట్లు దెలియుచున్నది ఈతటాకములన్నియు నేటికని ఆ [illegible] మునకై గావలసిన నీటిని అందించుచున్నవి.

## కట్టడపుపనులు - నిర్మాణములు

రాజధానీనగర నిర్మాణముగురించి [illegible] యున్నది. ముఖ్యముగా కోటనిర్మాణసమయమున [illegible] రములందు ప్రశస్తమైన దేవాలయములెన్నియో నిర్మింపబడినవి. శిల్పకళ ప్రత్యేకముగా కాకతీయులకాలమునకే జెందియున్నది. నేడీ [illegible] యములన్నియు శిథిలావస్థలో నుండుటేగాక [illegible] దుర్గమారణ్యములలో జిక్కుకొనియున్నవి. రాజభవనములు – రాచ నగరు పూర్తిగా నేలమట్టమైయున్నందున వాటినిగురించి దెలుసుకొనుటకు అవకాశములులేవు.

దుర్గప్రతిష్ఠాపనకు వాడిన తామ్రమఫలక మొకటి లభించియున్నది ప్రభుత్వశాఖకది ఇటీవలనే బంపబడియుండెను

## మంత్రాంగము

పద్మనాయకరాజ్యములో మొదటినుండియు పండితులు, శాస్త్ర విజ్ఞాన సంపన్నులు, రాజకార్యధురంధరులునైన బ్రాహ్మణ మంత్రివర్యులే పదవిలో నుండిరి. వీరిలో పెద్దన, పోతరాజు, గోపన-సింగనల పేర్లు దెలిసియున్నవే మంత్రి పోతరాజు ప్రఖ్యాతిని మాత్రమే తెలుసుకొనియుంటిమి రాచకొండ-దేవరకొండ గిరిదుర్గములు [illegible] తురుష్కులకు చేజిక్కియున్నవి గనుక చివరికాలమునందలి వీరి రాజ్య వ్యవస్థ యేమిటో దెలియుటలేదు. అభిమానులు, పట్టుబడిగలిగి యున్నవారు, ఉన్నతపదవులందున్న వీరి వంశీయులు [illegible] ప్రయత్నించినచో పూర్వసమాచారము దెలియుటకు తగిన సాధనములు లభింపగలవేమో. ఆ ప్రయత్న మిప్పటికైనా సాగినయెడల యుక్తము. గడ్డిలో మల్లెవలె అక్కడక్కడ వీరి సనదులు కొన్ని మాత్రము దొరుకుచున్నవి.

## సాహిత్యపోషణ

రాచకొండ తెలుగు ప్రభువులు రాజకీయముగనే కేవలము తమ ప్రభుత్వమును సుస్థిరము గావించుకొన్న వారుగాక, ఆకాలపు మన వాఙ్మయాభివృద్ధికిని మిక్కిలి పాటుబడియుండిరి. ముఖ్యముగ సింగభూపాలురలో చివరియిద్దరు పండితప్రభువులు. ప్రబంధసామ్రాజ్యమను పీఠము నధిరోహించి యున్నట్టివారు. అంతేగాక దేవరకొండ మాదానాయుడు వేదగిరినాయుడును కవులను బోషించిరి. అయ్యలార్యుడు, గౌరనకవి కేవలము వారి మంత్రి కుటుంబములకు జెంది యున్నవారే. రాచకొండలో రావుమాదానేని పాండిత్యము, కావ్య రచనల గురించి యొకశాసనమువలన దెలియుచున్నది.

రాచకొండప్రభువుల కీర్తిచంద్రికకు మకుటాయమానమైనది రావుసింగభూపాలుని రసార్ణవసుధాకరరచన. రత్నపాంచాలిక, సంగీతరత్నసుధాకరము (వ్యాఖ్యానము) వంటి కావ్యముల నీతడు

రచించియుండెను. ఇవి సమకాలీనులైన పండితులచేతనే గాక నేటి విద్వాంసులెల్లరిచేతను మిక్కిలి ప్రశంసింపబడుచున్నవి

రాచకొండ ఆస్థానకవులలో తొలిసారి చరిత్రకెక్కిన వారు పశుపతి నాగనాథుడు ఆతనిగురువగు విశ్వేశ్వర కవిచంద్రుడు వీరిరువురును I అనపోతానేని ఆస్థానమందును II సింగభూపాలుని విద్వత్సభను అలంకరించియుండిరి. కావ్యములెన్నో రచించినను కవిచంద్రుని చమత్కారచంద్రిక, నాగనాథుని మదనవిలాసబాణములుదప్ప (అముద్రితములు) ఇతర మేమియు లభించుటలేదు

ఇంతకుపూర్వమే ఈ ఆస్థానమందున్న మరియొక కవివరేణ్యుడు శాకల్య మల్లభట్టు గురించి తెలియుచున్నది. కాని ఈతడు ప్రతాపరుద్రుని ఆస్థానమందును,[10] విజయనగర ఆస్థానమునను[11] తుదకు రాచకొండ ఆస్థానమందును నివసించినట్లు సమాచారము లభించుటచే కాలనిర్ణయము క్లిష్టమైనది [12] ప్రసంగ రత్నావళిలో నుదాహరింపబడిన శ్లోక మీవిధముగా నున్నది

'సింహో నారద శక్ర కిం కినుగిరి భూలోక మాలోకతుమ్
కోరాజా భువి విక్రమీ హరి హరో దత్తో కియన్మండలమ్
ఆపూర్వార్ణవ మాపరార్ణవ మానావణ
పూర్ణస్తత్కృపయా గజేంద్ర విజయీ శాక్ల(ల్య)మల్లః కవిః
'ఏకోఽభూత్పులినాత్తతస్తునలినాచ్చాన్యోఽపినాకోరభూత్
ప్రాచ్యాస్తే త్రయ ఏవ దివ్య కవయో దీవ్యన్తు దేవ్యాగిరా
అర్వాంచో యది గద్య పద్య రచనా చాతుర్య వాగుద్ధతా
స్సర్వే సతిశయ్య ఖేల తితరాం శాకల్య మల్లః కవిః'

బా. వ. మ. P- 95

10. ప్రతాప చరిత్ర, A. S. P P. Vol VII P 298-91 మరియు శైవ ప్రవారణీ గ్రంథమాల. ఓరుగల్లువారి అనుబంధము III p. 60.

11. ప్రసంగ రత్నావళి, Mac. Mss. 5-4-10 7-6-17.

12. గురుపరంపరాప్రభావ, Ep Ind. Vol VIII p. 222.

ఆ నాగనాథునిచే పండితసుతుడైన మల్లకవి యోటమి జెందెననియు శైవ శాసనముల వలన దెలియుచున్నది[14] అది నిజమై యుండు నేని యా సందర్భములన్నియు జూచినచో ఈకవి 1326–1380 మధ్య కాలమున జీవించి యుండునని తోచుచున్నది. ఈ మల్లకవి శాస్త్రుడే శాకల్య అయ్యలార్యుడు. పెదవేదగిరినేని ప్రోత్సాహమున భాస్కర రామాయణమునందలి యుద్ధ కాండపు రచన బూర్తి గావించెను.

ఇక III సింగభూపాలుని సర్వజ్ఞ బిరుదము, ఆతని రాసిక్య గుణము, పోతన కవి నిరాకరించుట మరియు శ్రీనాథకవిసార్వభౌముడు ఈ ప్రభువును దర్శించుట ఒక్క రాచకొండ చరిత్రకే గాక తెలుగుభాషా చరిత్రకే యుజ్జ్వలమైన ఘట్టములు ఈ కవులే గాక వీరిలో కొందరు ఈ రాజ్యమున వర్ధిల్లిన కవిసత్తములు మరి కొందరు గలరు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు కొఱవి గోపరాజు, గౌరనార్యుని తనయుడైన భైరవకవి వీరిలో ముఖ్యులుగనుండిరి. తొలి తెలుగు రామాయణము రచించి, ఆంధ్ర కవితాపితామహయని పిలువబడిన కొఱవి సత్యనారన కవి, శంభునాథ కవులు నేటి వరకు కృష్ణకవులు అట్లే పశుపతినాగనాథకవి రచించిన తొలి విష్ణుపురాణము, రావుమాధవభూపతి రచించిన 'రాఘవీయము' నేటివరకజ్ఞాత కావ్యములే. అదృష్టమువలన నివికూడా లభించినచో రాచకొండ ప్రభువుల భాషా పోషణ మెట్టిదో ఇంకను కొంతవరకు దెలియవచ్చును. ముఖ్యముగా చారిత్రకమయిన సమాచారమందుండి దెలియుటకు అవకాశము గలుగును. ఇక చివరకీ తుదిమాటలచే ఆ భూపతుల పరిపాలనాశయము నుగ్గడించుచు దీనిని ముగించి వేయుదము.

'కల్యాణమస్తు జగతాం సతతం ప్రజానాం
సంవర్ధితో భవతు నాటక పదమార్గః
రంగస్థితాని సదనాని కవీశ్వరాణాం
మాత్సర్య దిగ్ధహృదయా న కలంకయంతు'

సింగభూపాల—రత్నపాంచాలికా.

---

14. Ep. Ind. Vol. XIII. P 222, Vol XXV PP. 323–24.

XI

అనుబంధము — I

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి

రాచకొండ ఆంధ్రదేశాన్ని కడసారి పాలించిన III రావు సింగభూపాలునికి, లింగమనేనికి సమకాలీనులై, స్వతంత్రంగానో లేక ఇతరాస్థానాలయందో జేరియున్న సుప్రసిద్ధకవులు- అజ్ఞాత కవులు కొందరున్నారు. వారిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, కొఱవి గోపరాజు మరియు భైరవకవి ముఖ్యులు.

పినవీరన కుటుంబం సూర్యాపేట తాలూకాకు చెందిన పిల్లలమఱ్ఱి గ్రామంలో[1] నివసించియుండిరి. 15 వ శతాబ్దం ప్రారంభంలో గావచ్చును వారి కుటుంబం నెల్లూరుజిల్లా 'సోమరాజుపల్లె'కు తరలిపోయినట్లు తెలుస్తున్నది. కారణములు తెలియవు. కాని తురుష్కుల ఉపద్రవము గావచ్చునేమో[2] పినవీరన కుటుంబం కొద్దికాలం సోమరాజుపల్లెలో నివసించినను - ఆ తరువాత విజయనగర ఆస్థానంలో వారు పదవులు సంపాదించుటచే అక్కడే స్థిరపడియుండిరి. ఈ వివరాలన్నీ ఈకవి చెప్పకున్నను గాక వారి వంశీకుడైన పెనుమళ్ళ సోమయామాత్యుడును చెప్పినదానినిబట్టి పినవీరన జన్మస్థలము పిల్లలమఱ్ఱి అనియే తెలియుచున్నది.

పినవీరన కవికి - రాచకొండ ఆస్థానానికి సంబంధములేదు. కాని రాచకొండ రాజ్యంలో ప్రధానభాగమైన 'పిల్లలమఱ్ఱి' నాతడు విశేషముగా వర్ణించుటచేత - ఆ గ్రామనామ మాయనకు పూర్వసంబంధమై యున్నందువలనే మక్కువ గనబరచియుండెనని అనిపింపక మానదు. పిల్లలమఱ్ఱి విషయంలో కవి వ్రాసినది.

"మహితగుణశాలి పిల్లలమఱ్ఱి వీర
నార్యుఁడాయింటఁ బెద్దవాఁడౌటఁగుచును
వెలయుచున్నది నేడు కవిత్వలక్ష్మి
యఖిల సత్కవి నికరంబు నాదరింప."                శృం. శా. అ 1. ప 1.

జైమిని భారతంలో,

తాతయుఁ దండ్రియు నగ్ర
    భ్రాతయునుం దాను భువన భాసురకృతి ని
ర్మాతలు పిల్లలమఱ్ఱి ని
    ఖ్యాతుఁడు పినవీరుఁ బోలఁగలరే సుకవుల్'

పీఠిక - 21

---

1. రాచకొండ ప్రాంతంలోని నాయంకర గ్రామం. చరిత్రప్రసిద్ధమైన రెడ్డి సేనాపతులకు - రేచర్ల వెలమ సేనాపతులకు జన్మస్థానమైనప్పటికి.

2. క్రీ. శ. 1357 లో అల్లావుద్దీన్ పిల్లలమఱ్ఱి దేవాలయము ధ్వంసము గావించెను.
పిల్లలమఱ్ఱి శాసనము - I. T. D. N. D No. 40 P. 113

పిల్లలమఱ్ఱి శారదా పీఠమట! ఆ శారద కరుణాకటాక్షములు ఈ కవికి గలవను టయేగాక 'వాణి యిల్లాలుగా గవిశ్రేణికెల్ల బృథుతరాశ్చర్యకరమైన బిరుదుపూనె' అనేయంతటి సాహసిక వృత్తాంతాన్నొకదానిని ఈయనకు ఆపాదించి కొందరు చెపుతారు. దాని నిజమెట్లున్నా ఈయన శారదోపాసకుడే యని దెలియుచున్నది. అది జూడండి,

సీ. అమృతాంశు మండలం బాలవాలముగాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయ సింధుగతకైతవడింభ
శయనీయ వరపత్రాశములతోడ
బితృదేవతలకు నంచిత సత్రశాలయై
చెట్టుగట్టెను గయాక్షేత్ర సీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియ కళా
కోటీరునకు భోగి కుండలునకు
తే. మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెఁగాదు శారదా పీఠకంబు
వారిలోపలఁ బిన వీర వాక్యసరణి
సరసులకు నెన్నఁ గర్ణరసాయనంబు

పీఠిక _ 22.

సీమంతినీ పరిణయంలో[1] పినవీరన తండ్రినిగురించి పెనుమళ్ళ సోమయామాత్యుడిట్లు దెలిపెను.

సీ. కవివర్ణనీయుఁడా గాదిరాజు వివేక
ఘనుఁడు పిల్లలమఱ్ఱియను పురమున
నధివసించుటఁజేసి యాపేర విఖ్యాత
మై ప్రకాశించెనయ్యన్వయంబు
మహనీయ కీర్తినమ్మంత్రి శేఖరుఁడంతఁ
దన ధర్మసతియందుఁ దగినయట్టి
సంతతి లేదన్న చింతాభరము పూని
యతి ధైర్య సంపన్నుఁ డౌట కతన
శివునిగూర్చి తపంబు నేఁజేసి పుత్ర
రత్నములఁగాంతు నన్నట్టి యత్నముగని
యాత్మగృహమున నన్నదానాది కార్య
భరము సోదర వర్గము పాలనునిచి.

1. అముద్రితం. మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం. R. 518.

పిన వీరనవి లభించిన కావ్యములు రెండు. శృంగార శాకుంతలము, జైమిని భారతము. కాని ఆయన మరికొన్ని కావ్యములు రచించియున్నట్లు ఈ పద్యమున దెలియుచున్నది.

సీ. రచియించినాఁడవు రమణీయ వాగ్రీతి
 నవతార దర్పణం బభినవముగ
బల్కినాడవు తేట పడఁజేసి నార
 దీయము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీ విశేషంబున
 మాఘమహాత్మ్యంబు మంజువాణిఁ
గావించినాఁడవు ఘనబుద్ధిమాన
 సోల్లాససారము సముల్లసితశయ్య
తే. భారత తీర్థమతి సార్వభౌమ గురుకృ
 పాతిశయ లబ్ధకవితా విఖ్యాతిగలిగి
 గౌరవముఁగాంచి కవులచేత
 విపుల చాటూక్తి విర్నిద్ర వీరభద్ర.

శృ. శా. అ 1 ప. 22.

కాళిదాసు శాకుంతలం – భారతోపాఖ్యాన శాకుంతలం తరువాత, పద్య ప్రబంధంగా అవతరించినది పినవీరన శృంగార శాకుంతలం. జైమినీ భారత రచన దీని తరువాతది. ప్రౌఢమైనది. మొత్తంపై విశేషమేమిటనగా పురాణాంతర్గతమైన చిన్న చిన్న కథల నీతడు గైకొని రసవంతముగా కావ్యముల ల్లుట. ఆ సంగతి కృతిపతియైన సరసింగరాయలిట్లు పొగడుతూ జెప్పాడు.

ఉ. అల్లన విచ్చు చెంగలువవిందు రజంబను కప్పురంబుపైఁ,
 జల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదజల్లు భావముల్,
 పల్లవ హాసచన్నుఁగవ పయ్యెద జీబుగఁ దోఁచు భాతిగాఁ,
 బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్.

జై. భా. పీఠిక – 25

మరొకటి,

ఉ. వచ్చిన ధర్మజుం గదిసి వారిజనాభుఁడు మ్రొక్కె మ్రొక్కినన్
 గ్రుచ్చి కవుంగిలించుకొనెఁ గూర్మియు భక్తియుఁ బొత్తుసేయగా
 ముచ్చట వాయఁ గొంతవడి మూర్ధము మూర్కొని లోచనంబులం
 బిచ్చలిరాల భాష్పజల బిందులు మౌళి నలంకరింపగన్.

జై. భా. అ 3, ప.

కాళిదాసు శాకుంతలానికి ఇది అనువాదమేమొ - శకుంతల రూపవర్ణన అదే మాదిరి గానవస్తుంది.

శా. చంచత్పల్లవ కోమలాంగుళి కరస్సంపూర్ణ చంద్రానన
న్యంచ చ్చందనగంధి గజయానం జక్ర వాక స్తనిం
గించిన్మధ్య దటిల్లతా విలసితాంగిం పద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతలన్మధుకర శ్రేణీ లసత్కుంతలన్.

శృ. శా. అ. 2. ప. 53.

## కొఱవి గోపరాజు

సింహాసన ద్వాత్రింశిక రచించిన కొఱవి గోపరాజు రాచకొండ మంత్రులైన బాచిరాజు మరియు సింగనల బాంధవ్యము వలన మనకు దెలియవచ్చిన యొక కవి. ఈ గోపరాజుగారి గ్రంధం చాలాకాలంవరకు లభింపకపోవుటవలన ఈయన చరిత్ర ఇటీవల వరకు మనకు దెలియలేదు. ప్రస్తుత మాకొదువ పూర్తియై గ్రంధము లభించుచున్నది. సింహాసన ద్వాత్రింశికను సుపరిష్కారమొనర్చి, కవిచరిత్రను గూడా కొంతవరకు వ్రాసిన ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడవారికి మనము కృతజ్ఞులమని జెప్పవలయును. ఈ గోపరాజు కాలము 1405 - 1480 అనగా ఇంచుమించు పినవీరన - పోతన కవుల కీతడు సమకాలీనుడు.

గోపరాజు పూర్వీకులు చాలాకాలంనుండి రాచకొండ - దేవరకొండ రాజ్యములలో మంత్రులుగానుండుట సుప్రసిద్ధమగు విషయము. ఈతని పూర్వీకులందరు రాజకార్యదురంధరులేకాక పాండిత్యమందును ప్రసిద్ధులు. బ్రాహ్మణులైన ఈ మంత్రులందరు ఆనాడు తమపేర్ల చివర భట్ట, రాజు, అమాత్య శబ్దములను జేర్చుకొని వాడుకొనుట సుపరిచిత విషయము. నన్నయభట్టు, శ్రీనాధ భట్ట, తిక్కనామాత్య, పోతరాజు లిందుకుదాహరణములు. పోతరాజు - అతని సోదర పుత్రుడైన గౌరన మాదానాయుని కాలమున (1361-1384) ఈ వరకే దెలిసిరి.[1] ఈ గోపరాజు పినవీరనను స్తుతిస్తూ 'రాజు శబ్దం' వాడి[2] మహామతియని పొగడియుండెను. మొత్తంపై వీరందరున్ను ఒకానొకప్పుడు ప్రాభవంలోనున్న "పిల్లలమఱ్ఱి" విశిష్ట కుటుంబాలకు జెందినవారనియే దెలియుచున్నది.

గోపరాజు కావ్యం ఒక్కటే. అందుగల ప్రత్యేకత ఏమన - చరిత్ర ప్రసిద్ధమనబడుచున్న విక్రమార్కుని కథలెన్నో ఆతడు గైకొని - కథాకావ్యమల్లుట. ఈ తరహాలో వచ్చిన కావ్యములందిది శ్రేష్ఠమైనది.

---

1. "మంత్రీపోతనామాసీ త్సర్వ శాస్త్రవిశారదః, యస్యామాత్య శిఖామణేః కవివర స్తోత్రైక పాత్రీకృతాం, మత్వావాకృతి రిద్ధనీతి సుభగాం వాగ్వైభవం లజ్జతే, సోయం పెద్దన మంత్రివర్య తనయః శ్రీ పోతరాజోన్వహం". ఉమామహేశ్వర శాసనం క్రీ.శ. 1376.

2. సింహాసన ద్వాత్రింశిక. 1-12.

గోపరాజు తన కావ్యం గురించి – భాషగురించి ఈ విధంగా దెలిపి యున్నాడు.

చ. తెనుఁగున దేటగా గథలు దెల్పినఁ గావ్యము పొందులేదు మె
త్తన పస చాలదండ్రు విశదంబుగ సంస్కృత శబ్ద మూఁదఁ జెప్పిన
నవి దర్భుపుండ్లనుచుఁ బెట్టరు వీనుల గావునన్ రుచుల్
దనరఁ దెనుంగుదేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్."

అ. 1. ప. 32

ఈ సింహాసన ద్వాత్రింశిక విసుగు జనించని చక్కని కథలతో నీతి బోధకమైన పద్యాలలో చకచకా సాగిపోతుంటుంది. కొన్ని పద్యాలు మచ్చుకు జూడవచ్చును.

చ. జల జల మంచునీరొలుకఁ జల్లని గాడ్పులు వీవఁ దారక
ల్మలమల మ్రగ్గఁ జీకటి క్రమంబున డిగ్గ విహంగ సంఘము
లక్కలకలఁ బల్కఁ దూర్పున విరాసము కెంపునఁ గూడియాడఁగా
బల బలఁ దెల్లవారె జనపాలకుఁడేగు వనాంతరంబునన్."

5_82

వివిధ విషయాలపై,

శా. సంగీతంబుఁ గవిత్వ తత్త్వమును సౌజన్యంబు భావంబున
త్సాంగత్యంబు నెఱుంగఁ డేని పుడమి నాశ్చర్యంబుగా వాలమున్
శృంగమ్ములుదము లేని యెద్దతఁడనం జెల్లుం దృణం బాతఁడు
య్యాంగీకంబున మేయఁ డౌపసుల భాగ్యం బిచ్చుటం గల్గుటన్.

4_172

శా. ధర్మం బెల్లెడఁ జెల్లునా? ద్విజుల విద్యాగోష్ఠి రాణిల్లునా?
దుర్మార్గంబు లడంగునా? ప్రజలు సంతోషింతురా? సత్క్రియా
మర్మం బేర్పడ జన్మముల్ జరుగునా? మర్యాద వర్తిల్లునా?
నిర్మూలంబుగ శత్రులం గెడపునా? నీ లక్ష్మి సొంపెక్కగాన్

అ_8.

చివరి పద్యం ఆనాటి దేశపరిస్థితుల ధ్వనిగా వచ్చునేమో.

## అజ్ఞాతాంధ్రకవితాపితామహ

ఈ కొఱవి గోపరాజుగారి వ్యాఖ్యానాల్ని సింహాసన ద్వాత్రింశికలోనే మనకు కాక అజ్ఞాతాంధ్ర కవితా పితామహుని గానవస్తున్నాడు. ఆంధ్రకవితా పితామహు డనగానే మనకు పెద్దన మహాకవియే సాధారణంగా స్మరణకు రావటంగద్దు.

ఆదొక అనుబంధం. కాని పూర్వమే మనకొక తొలితెలుగు రామాయణ రచయిత యగు అజ్ఞాతకవి యొకరున్నారు. ఆతడే కొఱవి సత్యనారన యనుపేరుగల కవి.

సత్యనారనకవి రాచకొండను బాలించిన II సింగభూపాలుని మంత్రులైన బాచిరాజు మరియు సింగనలకు పినతండ్రిగావలయును. మరియు కవి గోపరాజున కితడు పినతాతగూడ. గోపరాజు తెలిపిన ప్రకారం _ వారి వంశవివరాలివి.

| | |
|---|---|
| 1. వెన్నమంత్రి[1] | క్రీ. శ. 1240 వరకు |
| 2. పేరు చెప్పలేదు | 1230_1265 |
| 3. అమరేశ్వరుడు = గంగాంబ | 1265_1300 |
| 4. అన్నయ్య, సింగయ = గంగమ | 1300_1335 |
| 5. పెద్దిరాజు, అబ్బయ, గోపయ, సత్యనారన | 1335_1370 |
| 6. రామరాజు, కేసన, కసవరాజు | 1370_1405 |
| గోపరాజు | 1405_1480 |

పై వంశ వృక్షాన్ననుసరించి సత్యనారనకవి 1335_1370 కి పైబడి జీవించి యుండెనని దెలియుచున్నది,

ఇక సత్యనారనకవి రామాయణము రచించి 'ఆంధ్రకవితా పితామహుయని' బిరుదు గాంచెనని కొఱవి గోపరాజు వ్రాసియుండెను. కాని ఆ రామాయణము లభింపలేదు.

కం. రామాయణ కృతిపతియై[2]
తామెరయుచు నాంధ్రకవితా పితామహుండనగా
భూమిని మించిన భీమన
నామంబునఁ బరఁగె సత్యనారన కవియై.[3]

ఈ సత్యనారనకే 'భీమన' యని నామాంతరమున్నట్లు పై పద్యమునగలదు.

---

1. పై వెన్నమంత్రి వెలనాటి నేలిన గొంకరాజుకు మరియు పృథ్వీశ్వరునకు మంత్రిగా నుండెను. దానిని దెలుపు శాసనము. "స్వస్తిశ్రీ వెలనాటి చోడంద్రిపదేసూనుర్మహీమండనః శ్రీమా(న్గొంక) మహీపతి స్మంత్రి శిఖామణిర్భుజ ధనిధిశ్రీ వెన్న (నామాసు) ధీః"
ద్రాక్షారామ శాసనం - Vol. IV No. 1204-1205

2. 3. కృతికృతియై. ఘనుడై అను పాఠాంతరములు గలవు.

దీనికిముందే గోపరాజు వేములవాడ భీమకవిని నుతిస్తూ రెండు పద్యాలిలా జెప్పాడు. ఇవి ఎవరిగురించో మరి!

కం. వేములవాడక శుచియై
వేములవాడ చరించు వేములవాడం
దామెఱసిన భీముని నుత
భీముని బలభీము విమత భీమునిఁదలఁతున్

సి. ద్వా. 1-11.

ఉ. "భీమన పద్యమన్నఁ గడుఁబ్రీతి వహించుచు మేలు మేలునా
నేమిది చెప్పినారమన నిక్కమె ప్రాసము గూర్చినాఁడవౌ
నేమిరె కాదు దీని వడికిక్కడి కర్థమిదెట్టి దీగణం
బేమని పెట్టినాఁడవని యెగ్గులు వట్టు గుబుద్ధి పెద్దలన్"

సి. ద్వా. 1-18.

ఏమైనా ఈతడొక అజ్ఞాతాంధ్రకవితా పితామహుడు. రాచకొండయుగంలో ఇట్లే అజ్ఞాతులైన కవులు మరికొందరున్నారు. నాగారం శాసనంలో దెలిసిన - శంభునాథకవి, ఆ శాసనముందే రాఘవీయ కావ్యము అజ్ఞాతవిషయములె. ముందైనా అవి దెలియునని యాశింతము.

## భైరవకవి

కవుల చరిత్రలో తండ్రి కొడుకు లిరువురు కవులైయుండి బాగా పేరు కెక్కినవారు తక్కువగానే గన్పిస్తుంటారు. అట్టివారిలో గౌరన పుత్రుడైన భైరవకవి ముందు జెప్పదగినవాడు. భైరవకవి రాచకొండ మంత్రుల కుటుంబమునకు జెందినవాడు. కాని అపుడే రాజ్యమున దాపురించుచున్న కొన్ని ఉపద్రవాలవలన ఈ కవితోబాటు ఈతని వంశీకులు ఇతర ప్రాంతాలకుదరలిపోయి ఇమ్మడిసైఫఖాను మంత్రియైన విరలేంద్రుని సోదరుడు - చాగయరామదేవ పండితుని ఆశ్రయించినట్లు దెలియుచున్నది.

ఈ ఇమ్మడి సైఫఖాను బహమని రాజ్యంలో ఒక మాండలికుడు గావచ్చు. బహమనీ సుల్తానులు 1443-44 ప్రాంతంలో విజయనగర రాజ్యంపై నొక దండయాత్ర గావించిరి. ఈ యుద్ధంలో బహమనీల తరపున విరలేంద్రుడు బాల్గొని తన ప్రతాపముజూపి యుండవచ్చును. ఆ విషయం భైరవకవి కొద్దిగా దెలిపియుండుటవలన 1440 ప్రాంతమున ఈతడు జీవించియుండునని సుమారుగా దెలియుచున్నది. భైరవకవి రచించిన శ్రీరంగమహాత్త్వంలో చరిత్రకుపయోగించగల రెండు పద్యాలుగలవు. అవి యివి.

మ. పటుధాటీ ముఖ జృంభమాణ కలహ ప్రౌఢార్వ సంఘాతవి
స్ఫుటరింఖాపుటకోటి ఘట్టన పరిక్షుణ్ణ క్షమోద్యద్విశం
కటధూళీపటల ప్రశోషిత మహాకర్ణాట సేనాసము
ద్భట పాథోనిధి విరలేంద్రుఁ బురశింపన్ మంత్రులేరీ ధరన్?.

1-42

సీ. చండ దిగ్వేదండ కాండ ధూర్వహమహీ
మండలోద్ధరణ సమర్థమగుచు
దుర్వార పరిపంథి సర్వసంపద్గర్వ
నిర్వాపణక్రియా నిపుణ మగుచు
వేదాది విద్యా వినోద విద్వజ్జనా
మోదాతిశయ సముత్పాది యగుచు
జంభ జిన్మదకుంభి కుంభీన సాధీశ
శంఖ భూ భృద్ద్యుతి స్వచ్ఛమగుచుఁ
బరఁగునే మంత్రి భుజబల ప్రకటశౌర్య
దాన సత్కీర్తులప్రతి మాన మహిప
నాతఁడిమ్మడి సైఫఖానాధిరాజ్య
భారధుర్యుఁడు విస్గల ప్రభువరుండు.

భైరవకవి రచించిన కావ్యాలు మూడు. అవి శ్రీరంగమహాత్త్వం, రత్నపరీక్ష, కవి గజాంకుశము. శ్రీరంగమహాత్త్వం పైడాగయ రామదేవపండితునికి, రత్నపరీక్ష ముదిగొండ వీరభద్రునికి అంకితమొసంగెను. మూడవది లక్షణ కావ్యము. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము 18, 2వ, సంచికలో 78 పద్యాలుమాత్రము ముద్రింపబడి యున్నవి. ముదిగొండ గ్రామం దేవరకొండకు 6 మైళ్ళ దూరాన నున్నది. అది శైవ పండితులకు పూర్వము నిలయము.

భైరవకవి పైమూడు కావ్యాలలోను గౌరనార్యుని గురించి కొంత ప్రశంస జేసియుండెను. ఆ ప్రశంసలో గౌరనకవి కావ్యముల పేరైనా జెప్పకపోయినందున 'ఆ గౌరన కుమారుడేనా' ఇతడు – అని కొంతకాలము సంశయము గలిగినది. సంశయము మంచిదే. అది నిజము దేలుటకుగదా – గౌరన రచించిన కావ్యముల పేరు ఎందుకు జెప్పలేదో గాని మరొకవిధంగా భైరవకవి స్పష్టముగా ఈ సంబంధం దెలిపియేయున్నాడు.

1. తన మూడు కృతులలో గౌరన సుతుడనని దాను తెలుపుకొనుట.
2. భ్రమరా ప్రసాద సంప్రాప్త కవిత్వము ఇరువురికి గలుగుట.
3. గౌతమ గోత్రం ఒకటే యగుట.

4. విశేషించి కవి గజాంకుశం చివరి పద్యంలో 'సాహిత్య లక్షణ దీక్షా గురుడని' తండ్రినిగురించి చెప్పుట – ఇది లక్షణదీపిక గురించేగదా – ఇంతకన్నా గావలసిన సాక్ష్యమేమున్నది ? భ్రమరాంబాప్రసాదం గురించి గౌరన చెప్పిన పలుకులు ముందు చూద్దాం.

"భ్రమరాంబా ప్రసాద సంప్రాప్తకవిత్వ
సుమహిత సామ్రాజ్య సుఖపరాయణుడు

—హరిశ్చంద్రోపాఖ్యానము

"భ్రమరాంబికా వరప్రాప్త విచిత్ర
విమలసాహిత్య ప్రవీణాధికుండు
ననఘచిత్తుఁడు గౌరనామాత్యుఁడు"

—నవనాథ చరిత్రము

ఇక భైరవకవి – కవిగజాంకుశంలో,

కం. శ్రీమత్పరమశివానన
తామరస వికాసలీలఁ దగిలి భ్రమరాం
బా మధుమత్త భ్రమరిక
నాయన సరసముహంబునఁ భ్రమియించున్.

కం. భ్రమరాంబికా మహోవర
సముదిత నిరవద్యహృద్య సాహిత్యకళా
క్రమవిమల ప్రతిభాచం
ద్రమఁ క్రమశాలియైన గౌరనసుతుఁడన్.

కం. భైరవుడ నుభయభాషా
పారీణుఁడ లోభిభవన భవస్వామివ్యా
పారనవిచార దుష్కవి
ఘోరపిశాచుల నదల్చుకొను భైరవుఁడున్. క. గ. 1-6-7

ఈ చివరి పద్యం కొంచెం వివరంగా నున్నది–

మ. గణవర్ణాదుల మేలుఁగీడు వెలయంగాఁ జెప్పె సాహిత్యల
క్షణదీక్షాగురుఁడైన గౌరనసుధీ సత్పుత్రుడత్యుల్లస
ద్గుణరత్నాభరణుండు భైరవ కవీంద్రుండెందుఁ దదజ్ఞాల్ దనుం
బ్రబుతింపంగవిరాజగజాంకుశము ఘాప్రఖ్యాతమై మించఁగన్. (78)

రత్నపరీక్ష యను దానిలో,

కం. భ్రమరాంబా దేవికృపన్
సముచిత నిరవద్య హృద్యసాహిత్యకళా
క్రమ విమల ప్రతిభామణి
క్రమ వైభవశాలియైన గౌరనసుతుఁడన్.

కం. భైరవుఁడ నుభయ విద్యా
పారీణుఁడ లోభిభవన భవభూమి వ్యా
పార సవికార దుష్కర
ఘోర పిశాచము లదల్చుగుణ భైరవుడన్.

ఈ గ్రంథంలో రత్నాలగురించి శాస్త్ర ప్రమాణాలు చాలా జూపాడు. మచ్చునకు ఒక్కటి జూద్దాం.

ఉ. దాకటిమీఁదఁ బెట్టి బెడిదంబుగ సమ్మెటవేయ భిన్నమై
పోకజలంబులో మునిఁగి పోవక యెప్పుడు లోహప త్త్రికన్
జేకొని వ్రాయు రేఖ విలసిల్లని వజ్రము శుద్ధమిద్ధరన్
బ్రాకటరీతిఁ దాల్పనట భర్తుఁడొనంగు శుభంబు లెప్పుడున్. 27

శ్రీరంగ మహాత్త్వంలో తన గురించి వ్రాసిన గద్య పద్యము లివి.

మ. కృత విద్యా ఖురళీ పరిశ్రమ కళాకేళీ విలాసుం జన
స్తుతచారిత్రుని గౌతమాన్వయ పవిత్రుం గౌరనామాత్య స
త్సుతుఁ గల్యాణకవిత్వ లక్షణసమర్థున్ సూక్తిముక్తాఫలా
తతకాంత స్ఫుటచంద్రికోల్లసిత విద్వత్కైరవున్ భైరవున్. 1_18

గద్యము : ఇది శ్రీమద్భ్రమరాంబికా వరప్రసాదలబ్ధ సిద్ధ సారస్వత విలాస గౌరవ గౌరనామాత్యపుత్ర సుధావిధేయ భైరవ నామధేయ ప్రణీతంబైన శ్రీరంగ మహాత్త్వంబను పురాణకథయందు .

భైరవకవిపై పోతన ప్రభావం జాస్తిగాయున్నట్లు శ్రీరంగమహాత్త్వం లోని పెక్కు పద్యాలు జాటుతున్నవి. అవి జూడదగినవి.

ఉ. అచ్చెరువంది సంయమి కులైక భూషణుఁడే క్రియం బ్రియం
బిచ్చఁ దలిర్పఁ బల్కెనతఁడెవ్వఁడు తద్వచనంబ కాని రూ
పెచ్చటఁ గానఁబోల దిదియంతయునుం గలయో యథార్థమో
చెచ్చెర నాదు పూన్కి వృథసేయఁగఁ బన్నిన విష్ణుమాయయో !
అ. 1.

మ. శయనంబై యుపధానమై నిలయమై సచ్ఛత్రమై పాదుకా
ద్వయమై మంగళ పీఠమై మృదుల వస్త్రంబై సమస్తోచిత
క్రియలం జక్రికి నిత్యసన్నిహిత మూర్తింబొల్చు శేషాహిన
క్షయ మేధానిధిఁ గావ్యలక్షణ కళాచార్యుం బ్రశంశించెదన్.1

1. ఇంతింతై వటుం డింతయై. భాగవ. 8_622
వరుఁడై. ఈశ్వరుఁడై. మహామహిముఁడై. భాగ. 258

సీ. ఇందుండి వచ్చితినిప్పుడే ననరాదు
సకల లోకైక సంచారిఁ గాన
ఇది యది నెలవని యేర్పరింపగఁబోల
దెందుమాచిన వసియింతు గాన
రూపించి తల్లిదండ్రుల జూపి చెప్పగా
లేదు వారెవ్వరు లేరు గాన
వారు బంధువులని వివరింపఁగూడదు
సర్వ భూతములకు సముడుగాన
వటువు లిట్టట్టు గతిజేరి వచ్చిరనగ
బొందుగాదు నిమిత్త సంభూతులగుచు
జిత్తగతమైన కార్యంబు చేతలందు
నెరుగదగుగాక మాటలు నేమిచెప్ప ?[1]

3-457.

కం. మాకందము కడు నిది ర
మ్మాకందము డాయబోయి మంజీరులకున్
మాకందగ వెరగ విసిన
మాకందము మగువ మధుర మాకందమిలన్.

816

కం. వారములగు నతనునిపరి
వారములకు నెలవు లగుచు వాలెడిసమ్య
గ్వారము వారము దనకై
వారము లొనరింప సింధువారము లతివా.[2]

817

మొత్తంపై భైరవకవిగూడా తండ్రివలెనే లక్షణశాస్త్ర గ్రంథములు రచించి, నిగ్గుదేలి, ప్రౌఢకవి ననిపించుకున్నాడు. తండ్రికి తగ్గ తనయుడుగదా మరి !

---

1. ఇది నాకు నెలవని ఏరీతి పలుకుదు - భాగ. 8-552

2. కొమ్మా దానవనాథుని. లేమా దనుజుల
గెలువగ. మామా వలుపలు ముట్టకు.

భాగ. 10-11. 173. 187. 818.

XII

అ ను బ ం ధ ము — II

# రసార్ణవ సుధాకర అవతారిక (సంక్షిప్తము)

"తత్ర రేచర్ల వంశాబ్ధి శరద్రాకా సుధాకరః
కలానిధి రుదారశ్రీ రాసీ ద్దాచమ నాయకః 5
యస్యాసిధారా మార్గేణ దుర్గేణాపి రణాంగణే
పాండ్యరాజ గజానీకా జ్జయలక్ష్మీ రుపాగతా 6
ఖడ్గనారాయణే యస్మిన్ భవతి శ్రీరతిస్థిరా
ఘూర్జరఘట్టకురణీ వశ్యా దుష్టరాజ గజాంకుశే 7
తస్యభార్యా మహాభాగ్యా విష్ణో శ్రీ రివవిశ్రుతా
పోచమాంబా గుణోదారా జాతా తామర సాన్వయాత్ 8
తయో రభూవన్ క్షితికల్పవృక్షః పుత్రా స్త్రయ స్త్రాసిత వైరి వీరాః
సింగప్రభు ర్వెన్నమ నాయకశ్చ, వీరాగ్రణీ మహీపతిశ్చ 9
కలాపేకపదో ధర్మో యైరభిశ్చ రక్తైరివ,
సంపూర్ణ పదతాం ప్రాప్య నాకాంక్షత్కృతయుగమ్ 10
తత్ర సింగమహీపాలే పాలయత్యఖిలాం మహీమ్
సమతా మున్నతి శ్చిత్రం రాజ్ఞా మనమతాం నతిః 11
కృష్ణశైలేశ్వర సన్నిధౌకృత మహా సంభారమేలేశ్వరే
వీతాపాయ మనేక శో విదధతా బ్రహ్మప్రతిష్ఠాపనమ్ 12
ఆనృణ్యం సమపాదియేన విధునా తత్ర గుణైరాత్మనో
నిర్మాణాతిశయ ప్రయాసగరిమ వ్యాసంగిని బ్రహ్మణి 13
శ్రీమాన్ రేచమహీపతి స్సుచరితో యస్యానుజన్మా స్ఫుటం
ప్రాప్తో వీరగురు ప్రథాం పృథుతరాం వీరస్య ముద్రాకరీమ్
లబ్ధ్వా లబ్ధ్వా కరారిరాయ బిరుదం రాహుత్త రాయాంకితం
పుత్రం నాగయ నాయకం వసుమతీ వీరైక చూడామణిమ్ 14
సోఽయం సింగమహీపాలో వసుదేవ ఇతిస్ఫుటమ్
అనంత మాధవౌ యస్యతనూజా లోకరక్షకా 15

తత్రానుజో మాధవ నాయకేంద్రో దిగంతరాల ప్రథిత ప్రతాపః
యస్యా భవన్ వంశకరా నరేంద్రాస్తూనూభవా వేదగిరీంద్ర ముఖ్యాః 16
తస్యాగ్ర జన్మా భువిరాజదోష్ణై రపోత్రభావా దనపోత సంజ్ఞామ్
ఖ్యాతాం దధాతి స్మయథార్థభూతా మనంత సంజ్ఞాం చ మహీధరత్వాత్ 17
సోదర్యో బలభద్రమూర్తి రనిశం దేవీ ప్రియా రుక్మిణీ
ప్రద్యుమ్నస్తనయోఽపి పౌత్రనివహో యస్యాని రుద్ధా దయః
సోఽయం శ్రీపతిరన్నపోత నృపతిః కింత్వా వనాంభోరుహే
దత్తే చారుసుదర్శన శ్రియమసౌ సత్వాత్మ హస్తాంబుజే 18
బహుసోమసుతం కృత్వా భూలోక యత్రరక్షతి
ఏకసోమసుతం హిత్వా స్వర్లోకం లజ్జతే హరిః 19
సోమకుల పరశురామే భుజబలభీమేఽధి భూమి గోపాలే
యత్ర చజాగ్రతి శాసతి జగతాం జాగర్తి నిత్యకల్యాణం 20
హేమాద్రి దానై ర్ధరణీసురాణాం మహాచలం హస్తగతం విహాయ
యశ్చారు సోపాన పథేనచక్రే శ్రీ పర్వతం సర్వ జనాంఘ్రి గమ్యమ్ 21
అన్నమాంబేతి విఖ్యాతా తస్యాసీ ద్ధరణీపతేః
దేవీ శివాశివ స్యేవ్య రాజమౌళే మహోజ్జ్వలా 24
శత్రుఘ్నం శ్రుతకీర్తిర్యా సుభద్రా యశసార్జునమ్
ఆనందయతి భర్తారం శ్యామా రాజాన ముజ్జ్వలమ్ 25
తయోర భూతామ్ పుత్రౌ ద్వా వాద్యో వేదగిరీశ్వరః
ద్వితీయస్త్వ దీతియోఽసౌయశసా సింగభూపతిః 26
అథ శ్రీసింగభూపాలో దీర్ఘాయు ర్వసుధా మిమామ్
నిజాంసపీఠే నిర్వ్యాజం కురుతే సుప్రతిష్ఠరామ్ 27
మందారపారిజాత[illegible] సంతాన కల్ప సురమణి సదృశై
అనపోత [illegible] వేదగిరిస్వామి [illegible] 35
[illegible]
రత్నాకర [illegible] 36
యస్యాభ్యః ప్రథమః [illegible] శ్రీ [illegible]
రేక స్యాగ్రజ మాత్మజాప [illegible]

ఆరూడే త్రితయాగ్రజం విజయతే దుర్వార దోర్విక్రమే
సత్యోక్తౌ చతురగ్రజం వితరణేచాపి పంచాగ్రజమ్ 37
యుద్ధేయస్య కుమార దాచయవిభో ఖడ్గాగ్ర ధారాజలే.
మజ్జంతి ప్రతిపక్ష భూమి పతయః శౌర్యోష్మ సంతాపితాః,
చిత్రం తత్రప్రమదాః ప్రనష్ట తిలకా వ్యాకీర్ణ నీలాలకాః
ప్రభ్రష్ట కుచకుంకుమాః పరిగలన్నేత్రాంచ కాలాంజనాః 38
పరితోషిణి యస్యపుత్రరత్నే, దయితే వల్లభరాయ పూర్ణచంద్రే
సముదేతు సతాం ప్రభావిశేషః కమలానాభి వర్ణనంతు చిత్రమ్ 39
ఏతై రన్యైశ్చ తనయై సోఽయం సింగమహీపతిః
షడ్భిః ప్రతిష్ఠామయితే స్వామీ వాంగైః సుసంగతైః 40
రాజా స రాజాచల నామధేయా మధ్యాస్యవంశ క్రమరాజ ధానీమ్
సతాంచరక్షా మ సతాంచ శిక్షాం న్యాయానురోధా దనుధార 41
వింధ్య శ్రీశైల మధ్యక్ష్మామండలం పాలయన్ సుతైః
వంశ ప్రవర్తకై రర్థాన్ భోగపురంధరః 42
తస్మిన్ శాసతి సింగభూమిరమణే క్ష్మామన్న పోతాత్మజే
కాఠిన్యం కుచమండలే తరులతా నేత్రాంచలే సుభ్రువామ్
వైషమ్యం త్రివలీషు మందపదతా లీలాల సాయంగతౌ
కౌటిల్యం చికురేషు కిం చకృశతా మధ్యే పరం లభ్యతే 43

## అనపోతానేని శాసనములు (క్రీ. శ. 1365)[1]

శ్రీ భైరవాయనమః స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర ఆంధ్రదేశాధీశ్వర గజదళవిభాళ రాయగాయ గోవాళ పంచపాండ్యదళవిభాళ ప్రతిగండభైరవ భుజబలభీమ, ఖడ్గనారాయణ కాకతీయరాజ్యస్థాపనాచార్య అష్టదిశారాయ మనో భయంకర రేచర్ల వంశోద్భవవర్య దాచినాయని సింగమనాయని వరసుతుండు సోమకుల పరశురామ అరిరాయ విభాళ అప్రతిహత ప్రతాపుండైన అనపోత నాయనింగారు రాజగిరి నివాసులయి సకల భూవలయమును పరిపాలిస్తూ శకవర్షంబులు ౧౨౮౭ అగు విశ్వావసు సంవత్సర శ్రావణ బ॥ ౮॥ ॥౫॥ అనపోత సముద్రము దక్షిణాన

1. రాచకొండ దుర్గపు తుంగచెరువు సమీపమున గలదు.

రాజు కొండమీంది కలుకోటలు ఖావులు దుర్గసవుంరక్షణ సేయించి ఆ చెరువు వుత్తరాన నాగానాయిని కొండమీది కలుకోటలు ఖావులు సర్వమైన దుర్గ సంరక్షణ సేయించి అవమట ఘామికోటలు సేయించి రెండుకొండల నడుమ అనవోత సముద్రము సర్వభూతహితార్థముగాను తమ బిరుదాంకితము సేసి వరగంగ చేయించిరి. ప్రతి గండభైరవ ప్రతిష్ఠ రాయగాయ గోవాళని కరణము చిలుమరాజు తిప్పనవ్రాలు మంగళం మహా శ్రీశ్రీశ్రీ.

## భైరవగండి ప్రదేశమున (క్రీ. శ. 1365)[1]

స్వస్తిశ్రీ మహామండలేశ్వర ఆంధ్రదేశాధీశ్వర గజదళవిభాళ రాయగాయ గోవాళ పంచపాండ్య దళవిభాళ ప్రతిగండభైరవ భుజబలభీమ ఖడ్గనారాయణ కాకతిరాజ్యస్థాపనాచార్య అష్టదిక్కురాయ మనోభయంకర రేచర్ల వంశోద్భవ దాచినాయని సింగమనాయని వరసుతుండు సోమకుల పరశురామ అరిరాయ విభాళ అప్రతిహత ప్రతాపుండైన అనవోత నాయనింగారు రాజగిరి నివాసులయి సకల భూవలయము పరిపాలిస్తును శకవర్షములు ౧౨౮౭ అగు విశ్వావసు సంవత్సర శ్రావణ బ॥ ౮॥ ఆ॥ అనవోత సముద్రములోన సర్వభూత హితార్థముగాను తమ బిరుదాంకితమై చేసెను. ప్రతిగండభైరవ ప్రతిష్ఠ రాయగాయగోవాళని కరణము చిలుమరాజు తిప్పన వ్రాలు. మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ.

## రామస్వామి ఆలయసమీపమున (క్రీ. శ. 1365)

స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర ఆంధ్రదేశాధీశ్వర గజదళవిభాళ రాయగాయ గోవాళ పంచపాండ్యదళవిభాళ ప్రతిగండభైరవ భుజబలభీమ ఖడ్గనారాయణ కాకతిరాజ్య స్థాపనాచార్య అష్టదిశారాయమనోభయంకర రేచర్ల వంశోద్భవ ఎఱ్ఱదాచి నాయని సింగమనాయని వరసుతుండు సోమకుల పరశురామ అరిరాయ విభాళ అప్రతిహత ప్రతాపుండైన అనవోతానాయనింగారు రాజగిరి నివాసులయి సకల భూవలయమును పరిపాలిస్తును శక వర్షంబులు ౧౨౮౭ అగు విశ్వావసు సంవత్సర శ్రావణ బ॥ ౮॥ ఆదివారము అనవోత సముద్రము దక్షిణాన రాచకొండ మీంది కలుకోటలు ఖావులు దుర్గసవుంరక్షణము సేయించి రాయగాయ గోవాళని కరణము చిలుమరాజు తిప్పనవ్రాలు.

---

1. ఈ శాసనము దుర్గమునకు సమీపముననే గలదు.

## అయ్యనవోలు శాసనము (క్రీ. శ. 1369)

(సంక్షిప్తము)

"తస్యగోత్రా ణ్యనేకాని ప్రసిద్ధా న్యాంధ్రమండలే
రేచర్ల గోత్రం తేష్వేకం కాకతీయ నృపార్చితమ్ 6
పూర్ణసుధాంశురివ వేన్నమ నాయకో భూత్
తస్మా దజాయత జగత్రయ వైత్ర శౌర్యః
శ్రీదాచినాయక ఇతి ప్రథితః ప్రవీరః

శాకాబ్దే శశినందన భాస్కరమితే సౌమాఖ్య సంవత్సరే శ్రావణ్యాం గురు యోగభాసి విజయ శ్రీసింగభూపాత్మజః నిత్యశ్రీరనపోతభూపతి రయం దేవాయ మైలారయే మోదా ఏయ్యనవోలు సంజ్ఞమదిత గ్రామం సభోగాష్టకమ్ స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర రేచర్లగోత్ర చింతామణి గజవశవిభాళ భుజబలభీమ ఖడ్గనారాయణ చేకోలుగండ గాయగోవాళ పాండ్యరాజ గజకేసరి చలమర్తిగండ ధరణి వరాహ దుష్టరాజ గజాంకుశ ప్రతికూల రాయభయంకర ప్రతిగండ భైరవ రాయ మీనజాల రాయదేవేంద్రవల్లభ జాణరాయ కులగురు సమరమహేశ్వర ఇనుమర్తి గండగోవాళ కేళాదిరాయ జగనొబ్బగండ రాయగండభేరుండ రాయబందీ విమోచక రాయబిరుద విభాళ శరణాగతవజ్రపంజర బల్లరగండ వివేకనారాయణ సమస్త సమర విజయలక్ష్మీసమాగమ సముచిత పల్లవ తోరణావళీ ప్రకాశిత నిత్య కల్యాణ సత్యప్రతిజ్ఞ సోమకులపరశురామాది జగత్ప్రసిద్ధ బిరుదనామధేయ ప్రశస్తి సహితులైన శ్రీసింగమనాయని అనపోతానాయనింగారు ఓరుగల్లు భువనగిరి రాజకొండ సింగపురము మొదలైన తెనుంగుదేశ మాచంద్రతారక ముత్తరోత్తరాభి వృద్ధిగాను ధర్మరాజ్యము చేయుచును దిగ్విజయా యాత్రాప్రసంగానను ఓరుగంటి దక్షిణాన అయ్యనవోలి తీర్థస్వామియైన శ్రీ మైలార దేవరను దర్శించి ఆ అయ్యనవోలు అనెడి గ్రామము శ్రీ మైలార దేవరకు అంగరంగభోగాది సకల సమారాధన సామగ్రి యెల్లవేళలందున్ను సమకూడునట్లుగాను శకవర్షంబులు ౧౨౯౧ అగుచున్న సౌమ్య సంవత్సర శ్రావణశుద్ధ పంచమీ శనివారమునాండు పవిత్రారోహణ మహోత్సవ పుణ్యసమయమందు అష్టభోగ సహితముగాను సమర్పించి చేసిన దిగ్విభాగమెట్లన్నను. ఇతి శ్రీ కౌశిక బ్రహ్మర్షి గోత్రజను నా పశుపతిపండితపుత్రేణ నాగనాథకవినా లిఖితమిదం శాశ్వత ప్రతిష్ఠమస్తు.

## కందికొండ శాసనము (క్రీ. శ. 1375)

(సంక్షిప్తము)

12 ...బభూవతేషు ప్రదితం విశుద్ధం రేచర్లగోత్రం రఘువంశకల్పం
తస్మిన్నృపి దాచ ధరాధినాది నాథం పూషె వజితః ప్రథమాద్రిశృంగె
యా బాహ్యైమర్లాండవం కృత్వా గజవేద్యం జయశ్రియాః
తేజోనతే పాండ్యదర్పాం హృత్వా హస్తం సమగ్రహీతె
ప్రసిద్ధా తస్యసుభగా పత్నీ పోచాంబికా భవతె 21
తస్యాం వెన్నమహీపాలా చ్ఛజ్ఞాన విరభూద్ధరిః
యత్ఖడ్గ కరినాఘూర్ణత ఖండితారాతి మండలా
సూరనారిస్య మాసాద్యస్తు వత్యస్య పరాక్రమం
గుర్వాజ్ఞయాసేయ మఖర్వదర్పో సవర్ణాద్దేవపురి విభోర్వీం
శుర్వా నగర్యాః స్వపితుర్మహాజ్ఞా స్కందాద్రినామ్నీం పురమధ్య తిష్ఠతె
తస్యాం నగర్యాం మకరో నృపాలో నికేతనం నిరధలేఖి శృంగం
సుధానులిప్తం సతరాం మనోజ్ఞం కైలాస శంకాంకల యజ్ఞనానాం 58
తత్రప్రతిష్ఠా మకరో చ్ఛ్రీమాన్వెన్నమహీపతేః
జనార్దనస్య విధివశో చంద్రార్క మమందధిః
దేవందేవ జనార్దనస్య విధివత్కృత్వా ప్రతిష్ఠాం ము
దాశ్రీమన్మాధవ భూమిపాలతనయః శ్రీ వెన్నక్ష్మాపతిః[1] ....

## మాదానాయుని ఉమామహేశ్వర శాసనము (క్రీ. శ. 1376)

(సంక్షిప్తము)

శ్రీ గణపతయేనమః స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర రాయగాయగోవాళ గజదళవిభాళ భుజబలభీమ ఖడ్గనారాయణ సోమకుల పరశురామ సత్యహరిశ్చంద్ర శౌచగాంగేయ అప్రతిహత ప్రతాపోదయ సతతహేమాద్రిదానవిరత దాచయసింగ

---

1. A. P. G R E 1965 No. B. 362-363 ఈ శాసనపాఠము నాగరలిపిలో ముద్రింపబడి - కొన్ని తప్పులు గానవచ్చుచున్నవి. అక్కడే మరియొక శాసన మీతనిది గలదు. విశేషము లేనందున చెప్పలేదు. అడిగినవెంటనే ఈ పాఠమొసంగిన ప్రభుత్వ శాసనశాఖ వారికి నా కృతజ్ఞతలు.

భూపతి సుతుండైన మేదినీరూపనారాయణ సింగమాంబాగర్భపుణ్యోదయ రేచర్ల వంశదుగ్ధాబ్ధిసుధాకరుండైన శ్రీ మాధవదేవేంద్రుడు దేవనగర దక్షిణప్రాంతమందుల స్వనామాంకిత మా ధ వ పు ర మం దు స్వారాజ్యోపవిష్టుండై శ్రీ పర్వతోత్తర ద్వారమైన మహేశ్వరదేవమంటపము మహచ్ఛిలాసమూహానను రమ్యముగా రచియింపించి పదవాక్య ప్రమాణజ్ఞులైన మాయభట్టోపాధ్యాయులను తన్నిమిత్తంబై శాసనంబు చెప్పుమని పనిచినం దదుక్త శాసనంబు...

పాథోవక్త్రప్రథిత ప్రభావవిభినా ప్రాప్తోభిధాం లక్షిశ
శ్రేష్టస్తేషు గరిష్ఠ పుణ్యమహిమా రేచర్లవంశోదధిః
తత్రాజని జనానందీ జేతా జన్యేషు వైరిణాం
విక్రమే విజయాకారో వీరోవెన్న మహీపతిః 10
దోర్దండశాలినా యేన మండలాగ్రేణ ఖండితా
రిపుఖండాల ఖండాలీ జయలక్ష్మీక చాయతే 11
తస్మాదా విరభూ దగణ్యమహిమా క్షోణీ భృతా మగ్రణీ
శ్రీమాన్ దాచయనాయకో నిజయశో నీరంధ్రితా శాంతరః
యస్యా సన్నిహపక్షిణో ఒపి రిపవోభిల్లా సదారా అపి
త్యక్తాశా భువి భిక్షవో వివసనా అప్యంబరాంతాశయా....
పుత్రస్తస్య నృసింహస్య భాతి సుత్రామ విక్రమః
అమిత్రౌఘ తమోనాశే ర్మిత్రో మాధవనాయకః
అనుజో మనుజేంద్రస్య దనుజారాతి సంపదః
అన్నపోత మహీశస్య సన్నతారి మహీపతేః 17
నృసింహసంభవో యస్మాదసౌ మాధవనాయకః
అహిత ద్విర దారాతి బిరుదాంకయశో బుధిః 18
ఏవమ్మాధవతః పురాణపురుషా న్నాన్యో నృపో మాధవో
వైషమ్యం త్విదమన్య యత్సవిజయే యుద్ధే సహాయాయతే
భాతి నారాయణోదారః ఖడ్గనారాయణో నృపః
ప్రత్యక్ష మపి యస్యేద మప్రమాణం యశోభువి 23
నిత్యం విష్ణుపదావ లంబీ ద్విజరాజ కలానిధిః
సంపూర్ణ మండలోరాజా నకలంకి కథోప్యసౌ 24
ప్రత్యర్థి గాయగోపాళ సోప్యయం సమర సాత్యకిః

శ్రీశైల వింధ్య మధ్యోర్వీ మండలం పరిపాలయన్
దంత్యం కార్కశకాబ్దశాలిని శివే వర్షే నలే
ఫాల్గునే మాసే దాచయ సింగభూపతి సుత శ్రీమాదవో భూదవః
శ్రీశైలోత్తరతోరణే భువిమహేశ్వ శ్యాలయం నూతనం
పాషాణై సుధృఢం సురాసురనుతం గమ్యమ్ముదాచీకరత్
మాధవో వర్ణ్యతే యేన దిలీప నల నాహుషైః
అకృతం సుకృతం యేన కృతా సుకృతినా కృతమ్
పదవాక్య ప్రమాణేషు ప్రవీణేన వినిర్మితమ్
శాసనం ప్మ్నాయ సుధియా స్థేయా మాచంద్రతారకమ్
శ్రీమతో మాధవేంద్రస్య రాజ్యాంగైక ధురంధరః
యస్యామాత్య శిఖామణిః కవివర స్తోత్రైక పాత్రీకృతాం
మత్వావాక్పతి రిద్ధనీతి సుభగాం వాగ్వైఖరీం లజ్జతే
సోయం పెద్దనమంత్రివర్య తనయః శ్రీ పోతరాజోన్వహం
దేవస్యాస్య మహోపకార రచనాం సమ్యఙ్ముదా చీకరత్

శ్రీ గిరినాథాయ

... ... ... .... ....

ఈ శాసనములు వ్రాయింపవచ్చి వంగూరు తిప్పయభట్లు దేవతాస్తుతిగాను జెక్కిన శ్లోకాలు రెండు.

"శ్రీశ్రీశ్రీ పెద్దిరాజు కొడుకు పోతురాజువ్రాలు"

## మాదానాయుని పానుగల్లు శాసనము[1]

"శ్రీ శ్రీ సరస్వత్యై నమః"

తన హేషితము వినం దనవారు రంజిలం
బగతుర మానంబు భంగపడంగం

1. ఈ శాసన మిటీవలనే లభించినది. ఇందు పేర్కొనబడిన మాదానేడు 1 అనపోతా నేని (1361-1384) సోదరుడు దేవరకొండ ప్రభువు. శాసనమందలి 'అశ్వవృత్తాంతం' జూచిన వెంటనే మహాకవి శ్రీనాథుడు - నిశ్శంకు కొమ్మన ప్రభులు దొడ్డారెడ్డి పై జెప్పిన "హరి దాటించె బురోవకంపమున - అరరే యెల్లయ దొడ్డి భూవిభుడు" అను పద్యాలు గుర్తుకు రాగలవు. ఆ దొడ్డారెడ్డి కాలము (1423-1445).

ఈ శాసనపాఠ పరిష్కరణలో మిత్రు లెందరో పాల్గొన్నారు. దానికి నాయకులు ఆచార్యశ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు. వారందించిన సహాయానికి మిక్కిలి కృతజ్ఞుడను.

తన ఖురఘట్టనం దనవారు సెలువొంద
రిపువరుల విభవములు రిత్తవోవ
తన ప్రతాపముసూచి తనవారు హరుషింప
నరివరుల హరుషంబు లడగిపోవ
సింగయ మాధవ క్షితినాధువారువము
రత్నాం [శుచా °] నశ్వరత్న మొప్ప
దండినిరువదినాల్గు దనరిన మూరలు
నవరంగ కేశవనాథు నెదిరి
మల్లప గుడికడ మరి పానుంగంటిలో
సకలజనులు దంను సంనుతింప॥

ఇరువది నాలుగు మూరలు । అరుదుగ నటు దొర
[యబా]ర హరిపతివోలెం । బరగిన ఇరతసానికి ।
నరిహయములు గలవె యెందుం జచ్చిణాంవంగాం॥

## I అనపోతానేని భువనగిరి శాసనము[1] (క్రీ. శ. 1378)

"శ్రీ గణేశాయనమః స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర ఆంధ్రదేశాధీశ్వర గజదళవిభాళ రాయగాయగోవాళ పంచపాండ్యదళవిభాళ ప్రతిగండభైరవ భుజబలభీమ ఖడ్గనారాయణ కాకతీయరాజ్య స్థాపనాచార్య అష్టదిక్కురాయ మనోభయంకర రేచర్ల వంశోద్భవవర్య దాచినాయని సింగమనాయని వరసుతుండు సోమకుల పరశురామ అరిరాయవిభాళ అప్రతిహతప్రతాపుండైన అనపోతనాయనింగారు సకల భూవలయము పరిపాలింస్తూ శకవర్షంబులు ౧౩౦౦ అగు కాళయుక్తి సంవత్సర కార్తీక మాసమున.... ........ .. ......... . . ... ... . . . ........... శ్రీ శ్రీ శ్రీ"

## I అనపోతానేని శాసనము[2] (క్రీ. శ. 1380)

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శకవర్షంబులు ౧౩౦౨ అగు రౌద్రిసంవత్సర శ్రావణ శుద్ధ ॥౯॥ శ్రీమన్మహామండలేశ్వర ఆంధ్రదేశాధీశ్వర గజదళవిభాళ గాయగోవాళ పంచపాండ్యదళవిభాళ మేదినీ ..అంకుశ ప్రతిగండభైరవ భుజబలభీమ ఖడ్గనారాయణ నిరంతర శివదేవతాపారాయణ అనవరత హేమాద్రిదాన సంతోషిత విప్రసమూహ సేవాలబ్ధ సకల విభవసంపన్న ఆశ్రితపారిజాత కాకతీయరాజ్యస్థాపనా

1. గిండి సమీపమున
2. రాచకొండ దుర్గముకడ గన్నేర్ల భైరవుని సమీపమున గలదు.

చార్య రేచర్ల వంశోద్భవ బాచినాయని సింగమనాయుని వరసుతుండు అప్రతిహత ప్రతాప అరిరాయవిఫాళ సోమకుల పరశురామ వీరశ్రీ రాయరావు అనఘోతానాయ వింగారు రాజగిరి నివాసులయి సకల భూవలయమును పరిపాలింస్తూన్ను రాయ సముద్రము సర్వభూత హితార్థముగాను తమ బిరుదాంకితము సేయించిన ప్రతిగండ భైరవప్రతిష్ఠ అరిరాయగాయగోవాలని కరణము చిలుమరాజు తిప్పరాజువ్రాలు.

## నాగాంబికా శాసనము - నాగారం (క్రీ. శ. 1429)

### (సంక్షిప్తము)

తత్రోదభూ ర్ధర్మమతి ర్మహాత్మా, ధన్వైర్గుణౌఘై రెఅదాచ భూపః
వీరో విశుద్ధోదయ భాగ్యసాంద్రో, రేచర్ల వంశాంబుధి పూర్ణచంద్రః 5
తస్యా భవత్సూను రనూనుతేజః, సింగక్షితీశో నయభానుసూనుః
కృపానిధిర్యో గుణరత్నసాను, ర్యదార్థతో యాచకకామధేనుః 6
తతోద్భవ ద్భూపతి రన్నపోత నామా, మహిమ్నా వసుధామరేంద్రః
ప్రసంగతోం తస్సుమనో మనాంసి, ప్రౌఢే వయత్కీర్తి సుధావినోతి 7
తస్మా ధభూత్సింగత సౌకుమార్య, శ్రీస్సింగభూపో వరవంశదీపః
యస్య ప్రతాపార్చిషి దీప్యమానే, శత్రుప్రవీరా శ్శలభా ఇవాజౌ 8
సూను సింగనృపస్య తస్య శుభధీ సూర్యోపమస్తేజసా
కాంత్యాచంద్రసమః కలాభిరనిశం సన్మార్గ సంపత్తిభిః
రమ్యోరాజిత రావుమాధవనృపో రాజన్యచూడామణి
ర్యేన శ్రీనిధి రాయరావుబిరుదం లోకేనిరూఢికృతమ్ 9
శాకాబ్యే నిధివార్ధి రామశశిగే వ్యద్దే ప్లవంగే శుభే
మాసే ప్యాశ్వయుజే రఘూద్వహపదే యోరాఘవీయాహ్వయామ్
టీకా మర్థ పటు ప్రబోధఘటనా మాణిక్యపుష్పాంజలిం
కృత్వా రాజతిరావుమాధవనృపో రామాయ ణస్యశ్రియే 17
చారిత్రం జగతాం పవిత్ర ముదయ సన్మిత్ర సంపన్మయః
పాణిః కల్పమహీరుహాగ్రసరణిః ప్రజ్ఞాన వజ్ఞార్థిషు
వంశశ్శంసిత సర్వశోభిత గుణప్రాంశు స్సయస్యావనౌ
రమ్యోరాజతి రావుమాధవవిభు సంస్సేవిత శ్రీవిభుః 18
ఖ్యాతస్య నాగమాఖ్యాదేవీ శ్రీమాధవేంద్రస్య
ఖ్యాతధి (రు కొం)డ వార్ధౌ శుక్తే ముక్తేన శుభగుణోత్పన్నా 19

శ్రీ రాజశైలనికటే నాగాంబికయా తయా తటాకోయః
అవితో నాగసముద్ర సోయం సార్థో విభాత్యగాధ జలైః 20
శాకే శశాంక శర విశ్వయు తే(త్రసౌమ్యే, సంవత్సరే శుభదినే వరమీనచైత్రే
నాగంబయా స్ఫురతి నాగసముద్ర ఏష శ్లాఘ్యః ప్రతిష్ఠిత ఇహ స్థిర ధర్మవృద్ధ్యై
నాగాంబికయా సోయం నాగసముద్రః ప్రతిష్ఠితో జీయాత్
ఆ సాగర మాహిమకర మారామచరిత్ర మాజగన్మిత్రమ్ 26
రాఘవనప్త్రా మాధవసూరేః పుత్రేణ సోమపౌత్రేణ
శ్రీ శంభునాధకవినా రచిత మిదం ధర్మశాసనం జయతు 27
శ్రీ రామచంద్రాయనమః.

## రావు మాధవరావు శాసనము[1]

కులశేఖరరావు మాధవః
కుల కోట్యై సురనాధతాం ప్రదాతుమ్
విశదాచలనాధ కేశయే
భువి భోగాయ గిరే రదత్తమాతాన్.

—· అవిఘ్నమస్తు :—

వారాహ నారసింహస్య దంష్ట్రా దండ స్సపాతువః
యస్మిన్ ఛ్ఛత్ర మివాభాతి మహీమండల ముచ్ఛ్రితమ్
జయతి విమలగాత్ర శృంగభూపోబ్జ నేత్ర
స్స్వభుజ విజిత గోత్ర స్సంపదుద్దామ మిత్రః
విదిత సకల శాస్త్రః కారితా శిష్ట సత్ర
స్సకలగుణ విచిత్ర స్సర్వధర్మ స్వతంత్రః
కీర్త్యా కుంతి సుతాయతే....హంసాయతే తేజసి
స్వర్గక్షోణి రుహాయతే వితరణే భోగి శచీశాయతే
వంగితేజసుతాయతే సుకవితా భాగేచ భాషాయతే
చాతుర్యం కిమురావుమాధవవిభో స్సజ్జన్మ శ్రీనిధే

1. రాచకొండ దుర్గముకడ చేతిరాయినరికె అనుచోట గలదు. పై శాసనమందలి నాగాంబికాదేవి భర్త-రామాయణ వ్యాఖ్యాన రచయిత అయినవా డితడే. అది లభింపలేదు.

రేచర్లాన్వయ మౌళి మండన మణౌ తస్మిన్ విహారస్థలే
రాజాద్రౌ నగరే ప్రశాసతి సతా మంత్ర క్షమామండలమ్
భోగశ్రీ తనయా గిరి స్థిరతరం శ్వేతాద్రి నాథాఖ్యయా
చూతారామ మభివ్యదత్త సకుజే సానందమాఘేజయే."

## శాయింపేట శాసనము (క్రీ. శ. 1464)[1]

"శ్రీ శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శకవర్షంబులు ౧౩౮౬ అగు నేటి తారణ సంవత్సర వైశాఖ శుద్ధ ౧౫ వడ వారమునాటి సోమగ్రహణ పుణ్య కాలమందు స్వస్తిశ్రీ మదనంతకోటి బ్రహ్మాండనాయకుండై (శ్రియః) పతై జగత్కుటుంబై ప్రణత పరిత్రాణ రతుడైన మచ్చెల్ల తిరువెంగళేశ్వరుకిన్ని యజన యజనాధ్యయ నాధ్యాపన దాన ప్రతిగ్రహ షట్కర్మనిరతులైన అయ్యగార్లు ౧౨ కిన్ని మహాజనాలు ౧౨ కిన్ని గజదళవిభాళ గాయగోవాళ సోమకులపరశు రామ, కాకతిరాజ్య స్థాపనాచార్య ద్యనేకబిరుద ప్రశస్తులై సకల ధర్మ పరిపాలకులై రేచర్ల పెదనపోతా నాయనిగారి ప్రపౌత్రులై పెదలింగమనాయనిగారి పౌత్రులై పినంన్నమనాయనిగారి పుత్రులై లింగమాంబా గర్భపుణ్యోదయులైన రావుధర్మ నాయనిగారు ఓరుగంటి సీమలోని క్రొత్తగట్టు స్థలములోని మచ్చెలు మదనపల్లె సహితం చతుస్సీమా సమేతముగానున్న కృష్ణపాండుర కేదార భూ సమేతముగానుంన్న విధి నిక్షేపాద్యష్టభోగ తేజస్స్వామ్య సమేతముగానుంన్న ఈ చంద్ర [గ్ర]హణ పుణ్యకాలమప్పుడు తిరువెంగళేశ్వర ప్రీతిగాను మచ్చెల్లి తిరు వెంగళేశ్వరునికి పది వృత్తులు (చె)ంనకేశవాది చతుర్వింశతిమూర్తిప్రీతిగాను అయ్యగారు ౧౨ కి మహాజనాలు ౧౨ న్ కూడను ౧౪ కుంన్న ౨౪ వృత్తులుంన్ అథవెరశి ౩౪ వృత్తులుగాను వరికల్పనచేసి కృషీవల సమేతముగాను ధారవోసి ఇస్తిమి గాన మీ పుత్రాదికము ఆ చంద్రార్కస్థాయిగాను అనుభవించి బ్రతికేది." 35

## దోమలపల్లి అసంపూర్ణ - భగ్నశాసనము[2]

1. [లక్ష్మి .... లా] కాలాయితత తనుహర్తి రవ్యాన్మహోన్నతః॥ యద్దంష్ట్రి కేతకే యాతి పృధ్వీ షట్పద విభ్రమం॥ అభూదంభోజ సంభూతేః పాద

---

1. మొత్తం 152 పంక్తులలో శాసనమున్నది. ముఖ్యభాగంమాత్రం జూపబడినది. పిన అన్నమనేడనగా II అనపోతానేఁడు.

2. ఈ చరిత్ర శోధనలో నూతనముగా వెలువడిన వానియందిది యొక శాసనము ప్రతి చూపిన వెంటనే పాఠ పరిష్కార మొనర్చిన ఆచార్య శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారికి కృతజ్ఞతలు. (?) ప్రసాదిత్య

పద్మ భవః ప్రభుః॥ వసాఇత్ర(?) ఇతిఖ్యాతో ధర్మే[భూ] న [ఇ] వా పరః॥ తస్యాన్వయే [దా] చయశింగనామా [భూ]పాల మౌళిః ప్ర [శాస] భూమిం రేచలణా వం [శాంబు] ధి పూర్ణచంద్ర [స్య]... (13)

—: మరియొక అసంపూర్ణ భాగము :—

(1) ..దాన్మహామతిః॥ నివర్తన త్రయమితాం కేదారభువ మాదారాత్॥కేశవ దేవాయా దాత్కేదారనివర్త [న] సంఘటీయంత్రం । కాలేస్మి న్విప్రేభ్యః కుల్యా [క్షేత్రం] గాడిచెలణ[వలి]....దేవరకు వెలి [భూమి] మఱుతురు ౫ తొంటలు ౨ గొ[ల్లి] నూంతికా ...మఱుతు .... .... .... .... .... .... ....

(గ్రామస్థులు ఒక ఆలయము పూడియున్నట్లు జూపిరి. పరిశోధింపదగిన స్థలము.)

## రావు మాధవరావుగారి సనదు[1]

మహారాజరాజశ్రీ రేచర్ల రావు మాధవరావు సరిదేశముఖు మజుమూణదారు సర్కారు దేవరకొండ వగైరాగారు కౌలునామా పాల్వాయి ముత్తారెడ్డి ధార్వా మ॥ ఇడుకుడె వ॥ ఇందుర్తికి వ్రాసిన మిరాసాసన్నదు సణ ౧౨౫౫ ఫసలి మీరు తూర్పు నుండి వచ్చి మవుజే మజుకూరిని వుంటూ మాకు ఈ గ్రామము మిరాసా యిస్తే బ్రతికెదమని అంటిరి గనుక మనవి మనస్సుకు దెచ్చుకొని పరగణే మజ్కూరు కామీల్ ౭౧౩౭౦ యింటికి మజ్కూర్ క॥ దేవరకొండకు వచ్చి హిస్సా వ్రాసి యిమ్మని అన్నందుకు ౧౫ హిస్సా పైకాలు యిచ్చేఅట్టు కస్పా యిందుర్తిలో వక కాలువ భావి తొవ్వక కాలువ తీసుకునే అందుకు యిచ్చి మజ్కూరిలో మీకు చౌదరిహి మాన్యము దస్తుజమాకు రెండ్రూపాయల సెలవు. ఈ చొప్పున వ్రాసి యిస్తిమి. ఇదివరనుండి గ్రామము ఆబాదుచేసుక ఫలముచేసుక బేరీజు రూపాయలకు పన్నులు బేరుగడచేసుక యిస్తు సుఖాన అనుభవించి మీ పారంపరం అనుభవించేది. దేవబ్రాహ్మణుల కరణాల కామదార్లకు మడిక్షేత్రాలున్ను గుళ్ళుగోపురాలు తోటల్లు భావులు చెర్వులు కుంటలు అన్ని మరమ్మతులు పెట్టుకఆనుభవించేది. ఇందుకు చతు

---

1. మునుగోడు గ్రామంలో పాల్వాయి వెంకయ్యగారి కుటుంబీకుల వద్ద దీని అసలు గలదు.

రత్రము పొలిమర సందు శాసనాలు హద్దు మవుజె మజ్కూరు గణితమైన కోలలు. ఇందుకు ఫలముపరచుక అనుభవించేది. ఇది మా యిష్టదైవం శ్రీ వారిజాల గోపాల స్వామి సాక్షిగా నిర్ణయము చేసిన కృపాపత్రిక.

వారిజాల (అని గలదు)
గోపాలస్వామి

## రేచర్ల ధర్మారావుగారి సనదు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ విక్రమార్క శకవర్షంబులు 'చాకునీయ పట్టణంబులు' అగు నేటి విజయనామ సంవత్సర చైత్ర శుద్ద ౧౫ శుక్రవారమునాడు కంచెర్లగోపాలరెడ్డి అప్పకొండారెడ్డి గోవిందరెడ్డికి రాజశ్రీ రేచర్ల ధర్మారావు దేశాయి ముఖాసా మనసబుదారు పరగణే మునుగోడు సర్కారుఖిల్లే దేవరకొండ గారు దేశముఖాగిరి వ్రాయించి యిచ్చిన సనదు. పులిజాలవారికి పసునూరు వూరు కట్టించియుంచి పసునూరులో నున్న జక్కరసు చందప్పగారిని మేము వెంటబెట్టుకొని నీలగిరి[1] దుర్గాప్రతిష్ఠాపనము చేసేనిమిత్తం నారికేళంపల్లి[2] ఘట్టుమీదికి పోయినంతలో శ్రీరాముల పాదదర్శనమై చాలా స్వామిని స్తోత్రము చేసినంతలో వారికి శ్రీరామ మంత్రము పసునూరి జక్కరసు చందప్పగారికి మాకు మంత్రోపదేశమై అక్కడనుంచి రాంగా అహల్యానది[3] తూర్పు ఒడ్డున హరిహరాదుల ప్రతిష్ఠాపనచేసి శ్రీ యాంజనేయుల ప్రతిష్ఠచేసి గుళ్లగోపురాలు గట్టించి చెర్లు కుంటలు వేయించి గ్రామదేవతల ప్రతిష్ఠచేసి ధర్మావనాంతరములు వేయించి అన్నసత్రాలు పెట్టి నిరంతరము దేవబ్రాహ్మణ పూజావిధేయులమై పసునూరు జక్కరసు చందప్పగారికి దేశపాండ్యాగిరి మిరాశీ మీకు దేశముఖాగిరి మిరాశీ వ్రాసి యిస్తిమి. అచ్యుతరాయలు[4] వేయి....లున్న ఆనెగొందికి రా॥ ముకుందదేవరాయలు భూపాల మహారాజుగారికి చెల్లించి స్వామికార్యమందు దివాణము అర్ధము చెల్లించి మిరాశీకి మీరుభయత్రులు మీ పుత్రపౌత్రపారంపర్యాయం అనుభవిస్తూ వుండేది. ఇది మా ధర్మసాక్షిగా వ్రాయించియిచ్చిన మిరాశీ సన్నదు.

---

1. నల్లగొండకు గూడ నీలగిరి యని నామము.
2. ప్రస్తుతం హైద్రాబాదు జాతీయ రహదారిపై గల నార్కెటుపల్లి.
3. నల్లగొండకు 15 మైళ్ళ దూరమున గలదు.
4. అచ్యుతదేవరాయల కాలము క్రీ. శ. 1530-1542.

శ్లో. యావచ్చంద్రశ్చ సూర్యశ్చ యావత్తిష్ఠతి మేదినీ
యావద్రామకథా లోకే తావద్రాజ్యం విభీషణః ।

కలియుగ ప్రమాణము ౩౨ వేలు ४ లక్షలు

౧. మునుగోడు ౨. గూడపూరు ౩. శింగవరము ౪. పులిపరుపుల ౫. రతిపల్లి ౬. ఊకండి ౭. కొందమటికుంట ౮ దాసర్లపూరు. ఈ యెనమిది గ్రామాదుల దేశముఖ దేశపాండ్యాగిరి పైప్రకారం అనుభవించవలసినది. అచ్యుతదేవరాయల వారికి వేయివరహాలు మాసుహన్నులు చెల్లించేది ద॥ రేచర్ల ధర్మారావుదేశాయి ముఖాసా మునసబుదారు పరగణే మునుగోడు ఖిలే దేవరకొండ.

వారిజాల గోపాలస్వామి

పసనూరు జక్కరసు చందప్ప దేశముఖు॥ మునుగోడు సర్కారు దేవరకొండ.

## మాధవరావు లక్ష్మారావుగారి సనదు

శ్రీమా॥ కందాళ యెంబెరుమానారు ఆచార్యులవారి సన్నిధికి రేచర్ల మాధవ రావు సరిదేశముఖు మజుముందారు సర్కారు దేవరకొండ వగైరాగారు శ్రీ వారిజాల గోపాలస్వామి ప్రీతిగా వ్రాసియిచ్చిన భూదానపత్రిక సన్న ౯౮౫ సాలులో దేవర కొండ హవేలి ౨౪౪ గ్రామాల తాలూకాలో చిన్న గ్రామంకు ౧ రూపాయ పెద్ద గ్రామాదులకు రు ౨ చొప్పున పర్వతరావు చెరువు క్రింద[1] రెండు తూములు పారు గడ ఖ ౦౪ పందుం పొలమున్ను వేదాద్రి చెరువుక్రింద ౦।౦ యిత్తుల పొలమున్ను పెద్రిపాకల[2] చెరువుక్రింద ఖ ౦౪ పందుం వడ్లపొలము తుకుమున్ను క॥ మును గోడులో మాధవరావుగారు వేయించిన చెరువుకింద దక్షిణము తూము పారుగడలో ౦౪ పందుం పొలమున్ను క॥ దేవరకొండ తాలూకాలో మైచాపురము, జూపల్లి, ఏపూరు ఈ మూడు గ్రామాలు సర్వ అగ్రహారాలున్ను ఈ చొప్పున విర్ణయించి యున్నాము.

మర్కూం చం. ౩౫ మహెరం
రేచర్ల రావుమాధవరావు
సరిదేశముఖు మజుముందారు
సర్కారు దేవరకొండ (మొహరు)

రేచర్ల లక్ష్మారావు
సరిదేశముఖు
మజుముందారు
(మొహరు)

1. దేవరకొండలో నున్నవి.
2. పెండ్లిపాకల

## రాచకొండ ప్రభువుల బిరుదు

స్వస్తి సమస్త సద్గుణాలంకార హేమాద్రి ప్రసిద్ధ షోడశదాన మహామండలేశ్వర వకలవిద్యాకళాప్రవీణ శ్రీవిష్ణు (భక్తి) పరాయణ విరోధి రాజతిమిర మార్తాండ పూరితగాంభీర్య రత్నాకర పరనారీదూర మంగళార్థ నిమిత్త భవన్మందిర నిత్యోత్సవ అనవరత కనక కర్పూరదాన ధారాప్రవాహ ఆరూఢ తురగరేఖా రేవంత వనితాజన హృదయవనవసంత ప్రతిగండభైరవ భుజబలభీమ ఖడ్గనారాయణ గాయగోవాళ హిందూరాయసురత్రాణ పంచపాండ్యదళవిభాళ కాకతిరాయరాజ్య స్థాపనాచార్య చలమర్తిగండ మూరురాయ జగద్దళ కంచికవాటచూఱకార క్రొత్త చెర్ల సర్వాపహరణ కొలనిపీటి వీరక్షేత్రాణో విజయ ప్రమోద కుంట్లూరు భీమ దేవుని శిరఃఖండన రణక్రీడా వినోద నెల్లూరు వీర క్షేత్రాణో భారతీకమల్ల తిక్కన బయ్య ప్రాణాపహార తిరుకాలరాజ రాజ్య స్థాపనాచార్య ఉద్దండమండలీ కరగండ సత్యగదేవుని తలగొండగండ వేములకొండ రణరంగస్థలవైరినాయక జీమూత పవన ఏకశిలానగర సమీప శాత్రవ రాజన్యగహనదావానల బెండపూడివిభాళ నెల్లూరివీరక్షేత్రాణోహల్లకల్లోల కుంట్లూరియిమ్మడిమదనవిదారణ కారణ ప్రభవ అరిరాయమీనజాల రాజదేవేంద్రవల్లభ జిలుగుపల్లి సంగరాంగణ రణోన్ముఖ మచ్చనాయకుని తలగొండగండ వైరిసామంతరాగోల కొదమ నాయంకరగండ గణపవరదుర్గవిభాళ ఇందిరాల ప్రాకారవిభాళ ధన్నాలకోట పరివేష్టిత కదనపారగ చేకోలుగండ ఇరువత్తుగండ గండగోపాల రిపురాయమాన మర్దన మెరుకవరప్రాంత సమరసన్నాహ ప్రతికూల తిమిరమార్తాండ కొలచెలమ సప్తాంగచూఱకార గోసంగి దుర్గమదాపహార యినుగొర్తినిర్ధూమధామ జల్లిపల్లి వీరక్షేత్రాణో భారతీకమల్ల వరిగొండ దుర్గవిభాళ కర్ణాటరాయమాన మర్దన భుజా దండ సత్తికతప్పు వరాయరగండ భాషగెతప్పు వరాయరగండ మండలీక భుజంగ సంగరవైనతేయ భుజబలాంజనేయ గిరిదుర్గమల్ల జలదుర్గబడబానల వనదుర్గ దావానల స్థలదుర్గ విభాళ హంకారరాజకుమారవేశ్యాభుజంగ త్రిభువనకోటల గొంగ హొన్నకుట్ట కుదితె మండలీకరగండ హేల్లావరనంట హేల్లావరదగండ వర్ణాశ్రమప్రతిపాలనోదయ ప్రజమెచ్చుగండ జాణకొమార వివేకనారాయణ ప్రతాప రామావతార ఉన్మత్తరాయ మదనమహేశ్వర పనిఘానరాయ బసవశంకర ఉన్మత్త మదనమోహన వశీకరణసంతాప కామినీపంచబాణావతార మృగమద ఘనసార వివిధసుగంధ విచిత్ర చీని చీనాంబర మౌక్తిక వజ్ర వైఢూర్య గోమేధిక

పుష్యరాగ ఇంద్రనీల మరకత మాణిక్య ప్రవాళ నవరత్నస్థాపిత సువర్ణ భూషణాలంకార అసిముసల కణయకంపన భల్లాతక భిండి వాల కోదండ శరచక్రక్రకచ కుంత కుఠార తోమర పరశు వజ్ర మార్ష కత్తి వెరకత్తి సబళ కదళ పూని లాంగల కేరళా వోడ్యాణ పలక సురియ యత్తళ పట్టెస దొంతెన బల్లకత్తి త్రిశూల బత్తీసాయుధ ప్రవీణ ఏకధాటీ సమర్థ విషమధాటీ పాంచాల చతురుపాయదక్ష రిపుప్రళయాంతకోపేంద్ర అష్టదిగ్గ్రాజమనోభయంకర అవఘళరాయమానమర్దన మేదినీరాయ దుష్టగజాంకుశ శరణాగతరాజరక్షామణి ఆదిరాజాన్వయ చారుచరిత్ర రేచర్లగోత్ర పవిత్ర వీరపాండ్య విక్రమపాండ్య పరాక్రమపాండ్య సుందరపాండ్య కులశేఖర పాండ్యులు మొదలైన పంచపాండ్యదళవిభాళ కూటువమన్నె కుమాళ్ళగుండెదిగుల హంకార రాజకుమాళ్ళవేశ్యాభుజంగ యేబిరుదుగండ సర్వబిరుద కొమరవేశ్యాభుజంగ దళరావుపతి రావుదళమోదిత్యం దళవతి రాయాంచ్ఛాప్లా పొడవని పోటును పెట్టని త్యాగమును పొగిడించుకొనె నాయంకచ్ఛాప్లా నవలక్షదాతా చక్రవర్తీ ఐశ్వర్యదేవతా విష్ణుభక్తిపరాయణ సింహతలాటరాయ రాహుత్త వేశ్యాభుజంగ నిచ్చకల్యాణ పచ్చతోరణమును గలిగిన రేచర్లనాయక కులాన్వయ బిరుద విజయ ప్రశస్తి విజయీభవ.[1]

# ఉపయుక్త గ్రంథ సూచిక


చారిత్రకములు :

1. వెలుగోటివారి వంశచరిత్ర – 1910
2. వెలుగోటివారి వంశావళి – 1939
3. రావువారి వంశచరిత్ర
4. సురభివారి వంశచరిత్ర
5. ఆంధ్రుల చరిత్ర – III Vol.
6. ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహం
7. ఆంధ్రుల సాంఘిక చరిత్ర
8. విజయనగర చరిత్రము
9. అళియరామరాయలు
10. ఆంధ్ర కవితరంగిణి సంపుటములు
11. సమగ్రాంధ్ర సాహిత్య సంపుటములు
12. ఆంధ్ర విజ్ఞానసర్వస్వము సం. III
13. మహమ్మదీయ మహాయుగము I, II
14. A Forgotten chapter of Andhra History
15. History of the Reddy Kingdoms
16. The Early History of Daccan
17. Further Sources of Vijayanagara History

సంచికలు :

18. కాకతీయ సంచిక – 1935
19. రెడ్డి సంచిక – 1947
20. గోలుకొండ కవుల సంచిక – 1934
21. కళింగ సంచిక
22. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికా సంపుటములు

కావ్యములు, ప్రబంధములు :

23. రసార్ణవ సుధాకరము (సింగభూపాలీయము)
24. రత్నపాంచాలిక

25. సంగీతరత్న సుధాకరవ్యాఖ్యానము
26. శ్రీమదాంధ్ర మహాభాగవతము, భోగినీదండకము, వీరభద్రవిజయము
27. శృంగారశాకుంతలము, జైమినీభారతము
28. సింహాసన ద్వాత్రింశిక
29. శ్రీరంగమహాత్త్వము
30. మధురావిజయమ్
31. హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాధచరిత్రము, లక్షణదీపిక
32. రామరాజీయము
33. బాలభాగవతము
34. చిత్రభారతము
35. శృంగారనైషధము, హరవిలాసము, కాశీఖండము, భీమఖండము, శివరాత్రి మహాత్మ్యము, పల్నాటి వీరచరిత్ర.
36. క్రీడాభిరామము
37. భాస్కర రామాయణము
38. చమత్కార చంద్రిక
39. సిద్ధేశ్వర చరిత్ర
40. బసవపురాణము
41. ఉత్తర హరివంశము

శాసన సంపుటములు :

42. హైద్రాబాదు అర్కలాజికల్ వారి వివిధ శాసన సంపుటములు
43. తెలంగాణా శాసనములు _ I, II
44. దక్షిణదేశ శాసన సంపుటములు
45. తిరుమల తిరుపతి దేవస్థానపు శాసన సంపుటములు
46. మెకంజీగారి సంకలన గ్రంధములు
47. షితాబుఖాను (సీతాపతి) శాసనము
48. పత్రికలందలి వివిధ వ్యాసములు
49. నూతనముగా వెలువడిన నల్లగొండ మండలపు శాసనములు (అముద్రితములు)